

# శ్రీనివాస వైభవమ్

## కలియుగవైకుంఠ సంపుటం

తిరుమల తిరుపతిదేవస్థానముల హిందూధార్మిక గ్రంథాల
ప్రచురణ ప్రోత్సాహపథకంలో అందించిన ఆర్థిక
సహాయంతో శ్రీనివాస వైభవమ్
(ద్వితీయ భాగం)
ప్రచురింపబడింది.






శ్రీ వెలమకన్ని శ్రీరామమూర్తి

ప్రథమముద్రణ
జనవరి 1983

సర్వస్వామ్య సంకలితము
వెయ్యి ప్రతులు

ముద్రణ
శ్రీపత్రిప్రెస్
కాకినాడ

ప్రతులకు :
క్షేత్రసాహితి
పద్మప్రభాస
రామచంద్రపురం
తూర్పుగోదావరిజిల్లా

వి. శ్రీనివాస్
శ్రీ బాలాజీ స్టూడెంట్సు సెంటర్
మెయిన్ రోడ్
రామచంద్రపురం
తూర్పుగోదావరిజిల్లా

ముఖచిత్రం :
శ్రీ జి. శివన్నారాయణ
ద్రాక్షారామ

మూల్యం : 20 రూ॥లు

సోల్ డిస్ట్రిబ్యూటర్సు :
శ్రీ కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
రాజమండ్రి-1



బావ | చెల్లాయి
---|---
పతివాడ | విజయలక్ష్మి

మా చెల్లాయి మా బావ విజయలక్ష్మి పతివాడలు కోటిజన్మల సంస్కారానికి ప్రతీకలు. మానవకోటిలోని సహృదయతకు, స్నేహశీలానికి ప్రతిరూపాలు. కనుపించక అనుగ్రహిస్తున్న పద్మవతీ శ్రీనివాసులకు 'శ్రీనివాస వైభవమ్' (కలియుగ వైకుంఠ సంపుటం) అంకితంచేసి తొలిప్రతిని అర్పించాను. కని పెస్తూ, ఆదరిస్తూ, అభిమానిస్తూ, అమృతహృదయాలు అందిస్తున్న ఆత్మీయు[illegible]న చెల్లాయి విజయలక్ష్మికీ, బావ పతివాడకు 'శ్రీనివాస వైభవమ్' (కలియుగ వైకుంఠ సంపుటం) మలిప్రతిని సాదరంగా అందిస్తున్నాను— నా అంతరంగంలోని అంతులేని ఆపేక్షకు ఆనవాలుగా — ఒక కానుకగా — పద్మావతీ శ్రీనివాసులు ప్రసాదించే బహుమానంగా—

వెలమకన్ని శ్రీరామమూర్తి.

# సుమనస్సు నమస్సులు

ఓం శ్రీ వేంకటేశాయ నమః. నాచేత 'శ్రీనివాసవైభవమ్' పలికిస్తున్న శ్రీ వేంకటేశ్వరునకు– ఆశరణ్యాపూర్ణునకు శరణు.

'శ్రీనివాసవైభవమ్' (ద్వితీయ భాగం) ప్రచురణకు ఆర్థికసహాయం అందజేయుడంలో తోడ్పడిన తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులు—

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ. ఏ. యస్., ఇ. ఓ. టి. టి. డి.; శ్రీరావుల సూర్యనారాయణమూర్తి, ఎం. ఏ., బి. యిడి., పి.ఆర్.ఓ., టి. టి. డి.; శ్రీ కె. సుబ్బారావు, ఎం. ఏ., సంపాదకులు, సప్తగిరి; శ్రీ విద్వాన్ విశ్వం ప్రధానసంపాదకులు, డా॥ ఎన్.వి. రామకృష్ణమాచార్య, సంపాదకులు (టి. టి. ప్రచురణలు), ధార్మికగ్రంథాల ఎంపిక చేస్తున్న గ్రంథనిపుణుల సభ్యులైన డా॥ పి. రాధాకృష్ణశర్మ, డా॥ ఎస్. బి. రఘునాథాచార్య; డా॥ ఎం. డి. బాలసుబ్రహ్మణ్యమ్, డా॥ ఇ. శ్రీకృష్ణశర్మ, డా॥ జి.ఎస్. రెడ్డి, డా॥ దివాకర్ల వేంకటావధాని, డా॥ బి. రామరాజు, డా॥ ఏక్కిరాల కృష్ణమాచార్యులు, శ్రీ ఎం. రామకృష్ణశాస్త్రి, శ్రీ వై. వి. రామిరెడ్డి ప్రభృతులకు కృతజ్ఞతాపూర్వకంగా నా సుమనస్సునమస్సులు అర్పించుకొంటున్నాను.

'శ్రీనివాసవైభవమ్' సర్వాంగసుందరంగా ముద్రించడంలోను, సకాలంలో అచ్చువేయడంలోను తోడ్పడిన ప్రియమిత్రులు, శ్రీపతి ప్రెస్ అధినేతలు శ్రీ గణేష్‌గారికి నా నమసుమనస్సులు.

— వెలమకన్ని శ్రీరామమూర్తి

# విషయ సూచిక





# శ్రీ హరివాసము

## కలియుగవైకుంఠం

"ఓం అరాయి కాణే వికటే గిరిం గచ్ఛ సదాన్వే
శిరింబిఠస్య సత్వ భిస్తే భిస్త్వా చా తయామసి"

— ఋగ్వేదం

"ఓ పురుషార్థకాముడా! ఐహిక ఆముష్మిక ఐశ్వర్యహీనుడవైనా, బాహ్యాంతరదృష్టి లేనివాడవైనా, ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవిక తాపత్రయాలతో బాధపడేవాడవైనా, పురుషార్థశత్రుపరివృతుడవైనా, భయసంకోచసందేహాలు వదలి శ్రీనిలయమైన, శ్రీనివాససన్నిధానమైన శ్రీగిరిని సేవింపుము. శ్రీనివాస సేవాసక్తులైన ఆంతరంగిక ఆచార్య పురుషులను నీ అరిష్టాలను తొలగించి, అభీష్టాలను నెరవేర్చమని శ్రీనివాసుని ప్రార్థింపుమని అర్థింపుము. వారు నీవంటి ఆపన్నుల ఆపదలు నివారింపమని శ్రీపతిని, శ్రీగిరినిలయుని, శ్రీనివాసుని ఏకాంతసేవా సమయంలో అర్థిస్తారు. ఆపన్నప్రపన్నుడైన, ఆపదమొక్కులవాడైన శ్రీనివాసప్రభుడు పరమదయామయుడై, కరుణాంతరంగుడై భక్తుల బాధలు, వేదనలు నిర్మూలిస్తాడు. ఆపదలు నివారిస్తాడు". రమారమణుడైన శ్రీ వేంకటాచలాధీశుడు భక్తులకు పరమప్రాప్యుడని ఈ ఋగ్వేదమంత్రం ప్రతిపాదిస్తోంది. "ప్రవః ప్రాన్త మన్ధసో ధియాయతే మహేశూరాయ విష్ణవే చార్చత" అనే ఋగ్వేదమంత్రం శ్రీ వేంకటేశ్వర అర్చావతారమూర్తిని విష్ణ్వర్చావతారమూర్తిగా ప్రకటిస్తోంది. 'విష్ణుః పర్వతానామధిపతిః' అనే శ్రుతివాక్యం శ్రీమహావిష్ణువునకు సర్వపర్వతాధిపత్యాన్నేగాక, శ్రీ వేంకటాచలానికి విశేషాధిపత్యాన్ని సహితం ప్రదర్శిస్తోంది.

"వేంకటాద్రౌ పరాంభక్తిం వహన్గచ్ఛతి చేద్గిరిమ్
పఙ్గుర్జాల ఏవసాద్య చక్షుః పద్మలోచనః
మూకో వాచస్పతిర్భూ శ్రోతు బధిరోభవేత్
వన్ధ్యాతు బహుపుత్రాచ నిర్ధన స్సధనోభవేత్
ఏతత్సర్వం గిరా భక్తిమాత్రేణైవ భవేద్ధ్రువమ్
తత్త్వతో వేంకటాద్రేస్తు స్వరూపం వేత్తికః పుమాన్".
— వరాహపురాణం

శ్రీ వేంకటాద్రిపై పరమభక్తిభావంకలవాడు కుంటివాడైనా కొండను ఎక్కగలుగుతాడు. గ్రుడ్డివాడు మంచిదృష్టిని పొందుతాడు. పద్మలోచనుడవుతాడు. మూగవాడు మహావక్తగా రాణిస్తాడు. చెవిటివాడు మంచివినికిడిశక్తిని పొందుతాడు. దూరశ్రవణశక్తిని పొందుతాడు. సంతానహీనురాలైన స్త్రీ బహుపుత్రలాభాన్ని పొందుతుంది. బీదవాడు భాగ్యవంతుడవుతాడు. శ్రీ వేంకటాద్రిని మహాభక్తిభావంతో స్మరిస్తే, సేవిస్తే ఇట్టి మహత్తరమైన, అత్యద్భుతమైన, ఉత్తమమైన ఫలితాలు సిద్ధిస్తున్నాయి. అట్టి శ్రీ వేంకటాద్రిస్వరూపం, శ్రీ వేంకటనాథుని తత్త్వనవనీతం వర్ణించడం ఎవరికి సాధ్యం ? ఎందరికి శక్యం ?

"వేంకటాద్రి సమంస్థానం బ్రహ్మాండే నాస్తికించన
వేంకటేశ సమోదేవో నభూతో నభవిష్యతి"

ఈ అఖిలాండకోటి బ్రహ్మాండంలో శ్రీ వేంకటాద్రితో సమానమైనస్థానం లేదు. శ్రీ వేంకటేశ్వరునితో సమానమైన దైవతామూర్తి ఇప్పుడు లేడు. ముందు ఉండడు. "పాలసముద్రంపై పవ్వళించినస్వామి వేంకటగిరిపై వెలసాడు. తిరుమల ప్రత్యక్ష వైకుంఠం. త్రివిక్రమచారు చరిత్రుడైన, వామనావతార స్వరూపుడైన శ్రీహరి తానై వలచివచ్చి భక్తులు కొలవడానికి నిలచినస్థలం వేంకటాచలం నహాకా, విన్నగర్, తిరుకోవలూర్ ఆదిగాగల వైష్ణవక్షేత్రాలలో

శ్రీహరి కూర్చుండి, పరుండి, నడవగా శ్రీ వేంకటగిరిపై భక్తులను అనుగ్రహించడానికి నిదానంగా నిలబడ్డాడు. శ్రీనివాసుడు, గోపాలుడు, గోవిందుడు, శ్రీమన్నారాయణుడు, శ్రీ రంగనాథుడు, శ్రీ లక్ష్మీనాథుడు బ్రహ్మాది దేవతల సేవలు అందుకొంటున్నాడు. శివాదులను తనలో కలుపుకొని నిలుపుకొంటున్నాడు. భక్తుల పూలంగి సేవలు, దీపారాధనలు స్వీకరించి అనుగ్రహిస్తున్నాడు. ద్వాదశి మహా పర్వదినాలలో మహిళా భక్త బృందాల ధూప, దీప, నైవేద్య, మంగళ హారతులు పొంది వారిని కరుణిస్తున్నాడు. దారి తప్పినవారికి, పెడదారి పట్టినవారికి దారిచూపేకొండ- సక్రమమైన మార్గం చూపించేకొండ శ్రీ వేంకటేశ్వరునిబంగారుకొండ. భక్తులకు త్రోవచూపే గోవిందుడుండే బహుదొడ్డకొండ ఈ వేంకటపుకొండ. దిక్కులేనివారిపై దయా దృక్కులు ప్రసరించే వెన్నెలవెలుగులవలికగా, ఏడుకొండలపై జాలి గుండెలవాడై దివ్యజ్యోతిగా, అఖండదీపారాధనలోని కాంతిరేఖగా సప్తగిరివాసుడు, శేషాద్రిశిఖర నివాసుడు అలరారుతున్నాడు. వైభవ శ్రీసమేతుడై విరాజిల్లుతున్నాడు.'' ఇవి ఆళ్వారుల దివ్య ప్రబంధాలలోని తిరువెంగడపు వర్ణనలు, ప్రశంసలు.

"ప్రపద్యేతం గిరిం ప్రాయః శ్రీనివాసానుకంపయా
ఇక్షుసార స్రవన్త్యేవ యన్మూర్త్యా శర్కరాయితమ్''
— వేదాంత దేశికుని 'దయాశతకం'

"మధురమైన చెరకురసం మహానదిగా ప్రవహించి, ఘనీభవించి శర్కరగా రూపొందుతుంది. అదేవిధంగా శ్రీనివాసుని కరుణారసప్రవాహం గడ్డకట్టి వేంకటాచలరూపం వహించింది. అట్టి శర్కరామయమైన వేంకటగిరికి నమస్కరిస్తున్నాను. దయాదేవి వేంకటగిరిరూపం ధరించి నిలచింది. అందుచేత తిరుమలగిరిదర్శనం దయాదేవిదర్శనమే! అట్టి గిరికి నమస్కారం చేయడం దయాదేవికి నమస్కరించడమే అవుతుంది. దయాదేవిరూపాన్ని నింపుకొన్న శ్రీనివాసగిరికి, శ్రీనివాసగిరి

స్వరూపంలో సాక్షాత్కరించే దయా దేవికి సుమనస్సుల నమస్సులు, నమస్సుమనస్సులు అర్పించుకొంటున్నాను" అంటూ వేదాంత దేశికా చార్యులవారు తమ "దయాశతకం" లో దయా దేవిస్వరూపిణియైన వేంకటాచలానికి నతమస్తకులై నమస్కరించారు. ఆవిధంగా స్మరించి సమార్చనలు కావించారు.

"కట్టెదుర వైకుంఠము కాణాచయినకొండ
తెట్టెలాయ మహిమలే తిరుమలకొండ ॥పల్లవి॥
వేదములే శిలలై వెలసినది కొండ
యేదెస పుణ్యరాసులే యేరులైనది కొండ
గాదిలి బ్రహ్మాదిలోకముల కొనలకొండ
శ్రీదేవు డుండేటి శేషాద్రి యీకొండ ॥కట్టె॥
సర్వదేవతలు మృగజాతులై చరించేకొండ
నిర్వహించి జలధులే నిట్టచరులైన కొండ
ఉర్వితపసులే తరువులై నిలిచిన కొండ
పూర్వపుటంజనాద్రి యీ పొడవాటి కొండ ॥కట్టె॥
వరములు కొటారుగా వక్కణించి పెంచేకొండ
పరగు లక్ష్మీకాంతు సోబనపు కొండ
కురిసిసంపదలెల్ల గుహలనిండిన కొండ
విరివైనదిదివో శ్రీవేంకటపు కొండ"

— తాళ్ళపాక అన్నమాచార్యులు.

ఈవిధంగా భక్త్యావేశంతో, పదకవితాభినివేశంతో పరవశించి, మైమరచి పదకవితాపితామహుడైన అన్నమయ్య శ్రీ వేంకటపు కొండను వర్ణించి, అభివర్ణించి ధన్యుడయ్యాడు. దివిని భువిని కలిపే పుష్పకవంతెన తిరుమల. దివినుండి భువికి దిగివచ్చినా భువిని దివికి తరలించే వెన్నెల వెన్నెలనావ తిరుమలగిరి !

ఈ సముద్ర వేలావలయితమైన భూతలంలో భారతఖండం ఉత్తమమైనది. అట్టి సుందరభారతంలో దక్షిణాపథం పుణ్యసంపన్నమైనది. దక్షిణాపథదేశంలోని ఆంధ్రప్రాంతం పుణ్యాకరమైనది. ఆంధ్రభూమికి అలంకారమైన శ్రీవేంకటాద్రి పుణ్యతమమైనది. శ్రీవేంకటేశ్వరుని వైభవం, తిరుపతిప్రభావం, శ్రీవేంకటాచల మాహాత్మ్యం సర్వులూ సదా మననంచేసి మననం చేసికొంటూంటారు. తిరుపతి ప్రపంచయాత్రా కేంద్రాలలో ముఖ్యమైనది. భారతమహాక్షేత్రాలలో ప్రముఖమైనది. ఆంధ్రపుణ్యస్థలాలలో ప్రధానమైనది. తిరుమల పేరు స్మరిస్తే పాపాలు తొలగుతాయి. సందర్శిస్తే కష్టాలుగట్టెక్కుతాయి. అపాయాలు అనర్థాలు నివారింపబడతాయి. తిరుమల భక్తుల ముంగొంగు బంగారం. తిరుపతి భక్తులపాలిట కల్పవృక్షం. కామధేనువు.

శ్రీనివాసుడు భక్తజనసులభుడు. సులభప్రాప్యుడు. ఏడుకొండల వాడు కరుణాంతరంగుడు. శ్రీవేంకటేశ్వరుడు కమనీయస్వరూపుడు. శ్రీరమాలోలుడు కలియుగంలో ప్రత్యక్షప్రమాణభూతుడైన మహనీయ స్వరూపుడు. మ్రొక్కితే చిక్కులు విప్పే మోహనాంగుడు. ఆపద మ్రొక్కులవాడు. అడుగడుగు దండాలవాడు. గోవిందబొబ్బలకు పలికే వాడు. వడ్డీకాసులవాడు. పిలిస్తే పలుకుతాడు. అర్థిస్తే వరాలుప్రసాదిస్తాడు. భక్తుల ఆర్తిని నిర్మూలిస్తాడు. అట్టి దివ్యసుందరమైన మంగళ మోహనమైన నవకల్యాణ లావణ్యమూర్తియైన శ్రీ వేంకటరమణమూర్తి అర్చావతార మూర్తిగా ఆవిర్భవించిన దివ్యస్థలం, దేవతానిలయం శ్రీ వేంకటాచలం. తిరుమల కలియుగవైకుంఠం. కన్నులవైకుంఠం. భూలోకపు ఆనందనిలయం. స్వర్గలోకంనుండి భూలోకానికి దిగివచ్చినకొండ తిరుమలగిరి. అందు అధివసించిన బాలాజీ భూలోకాన్ని స్వర్గలోకంగా మలచగలిగిన మహనీయుడు. అటు దేవతలు క్రిందికి దిగివచ్చి దర్శించడానికి, ఇటు మానవులు పైకి ఎక్కి సేవించ

డానికి ఈవిధంగా ఉభయులకూ సన్నిహితంగా ఉండడానికి కొండల కోనేటిరాయుడైన ఏడుకొండలవాడు ఉభయతారకంగా సప్తగిరి వాసు డయ్యాడు. తిరుపతిచెంత తిరుమల వెలసింది. తిరుమల పాదప్రాంతంలో తిరుపతి నిలచింది. అందుచేతనే శ్రీనివాసుడు తిరుమలేశ్వరునిగా, తిరుపతి వేంకటేశ్వరునిగా, తిరుమల తిరుపతి శ్రీపతిగా భక్తులసేవలు, కానుకలు అందుకొంటున్నాడు.

వృషాద్రి

"కృతేవృషాద్రిం వక్ష్యంతి త్రేతాయామంజనాచలమ్
ద్వాపరే శేషశైలంతు కలౌ వేంకటాచలమ్
నామానియుగ భేదేన శైలస్యాస్య భవంతి హి"

శ్రీనివాసుడు వెలసిన శైలం కృతయుగంలో వృషాచలంగాను, త్రేతాయుగంలో అంజనాచలంగాను, ద్వాపరయుగంలో శేషశైలం గాను; కలియుగంలో వేంకటాచలంగాను వ్యవహారప్రాచుర్యం పొందింది. ఆ నాలుగు యుగాలలో తిరుమల ఆ నాలుగుపేర్లతో జగత్ప్రసిద్ధి పొందింది. కృతయుగంలో వృషాచరుడనే రాక్షసుడు తిరుమలను ఆక్ర మించాడు. అతడు మహాబలవంతుడు. నారాయణధ్యానపరాయణుడు. ఆ కొండపైగల తుంబురతీర్థంలో నిత్యం స్నానం చేసేవాడు. పవిత్ర శరీరుడయ్యేవాడు. పావన మనస్కుడయ్యేవాడు. మహాభక్తిభావంతో నరసింహసాలగ్రామాన్ని అర్చించేవాడు. పూజావసానసమయాన కత్తితో కుత్తుక నుత్తరించుకొనేవాడు. అతని తపోశక్తివలన అతని మొండెంపై ఇంకొక్కశిరస్సు మొలచి నిలచేది. అతడు ఛేదించిన తన శిరస్సును పూజాపుష్పంతో తనఆరాధ్యదైవానికి అర్పించేవాడు.

ఇట్టి రాక్షసపూజాకార్యక్రమం నిరంతరాయంగా, నిర్విఘ్నంగా, నిరాఘాటంగా ఐదువేల సంవత్సరాలు నిర్వహించాడు. శ్రీమన్నారా యణుడు వృషాసురునకు ప్రత్యక్షమై వరం కోరుకోమని ఆదేశించాడు.

వృషాసురుడు దేవదేవునకు నమస్కరించి తనతో యుద్ధంచేసే అవకాశం కల్పించమనే విచిత్రమైన వరాన్ని అర్థించాడు. శ్రీహరిసుప్రసన్నుడై తనతో సమరంసాగించే వరం వృషాసురునకు అనుగ్రహించాడు. ఫలితంగా భక్తునకు భక్తమందారునకు మధ్య సంకులసమరం సాగింది. వృషాసురుడు రాక్షసమాయతో మాయామహావిష్ణువును సృష్టించి శ్రీవిష్ణువుపైకి పురికొల్పాడు. విష్ణుమాయతో రాక్షసమాయను అంతమొందించి మాయామహావిష్ణువు మాయంకావించి చక్రి వృషాసురునిపై చక్రప్రయోగం చేసాడు. తాను నివసించి దేవదేవుని ధ్యానించి, జపించి, పూజించి, ఆరాధనాకార్యక్రమాలు ఏ కొండపైన నిర్వహించాడో ఆకొండ తనపేరుతో వ్యవహరింపబడాలని వృషాసురుడు శ్రీహరిని ప్రార్థించాడు.

అతని చివరికోరికను శ్రీనివాసుడు మన్నించాడు. విష్ణుచక్రప్రయోగఫలితంగా వృషాసురుడు విష్ణులోకం పొందాడు. కృతయుగసమయంలోను, తదాదిగాను తిరుమల వృషాద్రిగా, వృషాచలంగా వ్యవహారనామాన్ని పొందింది. "ఓం వృషదృగ్గోచరాయ శ్రీవేంకటేశాయ నమః, ఓం వృషాద్రిపతయే శ్రీవేంకటేశాయ నమః, "ఓం వృషభాసురహారిణే శ్రీవేంకటేశ్వరాయ నమః. "ఓం వృషభాచలవాసినే శ్రీవేంకటేశాయ నమః," అనే నామాలు శ్రీవేంకటేశ్వర అష్టోత్తరశతనామావళిలో కనపడుతున్నాయి. ఆవిధమైన వృషభాసుర సంబంబంధమైన నామాలతో శ్రీనివాసుడు సదా భక్తులచేత సేవింపబడుతున్నాడు.

"ధ్యాయన్ కృతే" అని "కృతయుగంబున ధ్యానము" అని కృతయుగధర్మం ప్రతిపాదింపబడింది. కృతయుగప్రమాణం 17, 28,000 సంవత్సరాలు, కృతయుగ మానవుని ఆయుర్దాయం లక్షసంవత్సరాలు.

వేలాదిసంవత్సరాలు ధ్యానం చేసి కృతయుగమానవులు తరించేవారు. ధ్యానపరులైన భక్తులు వృషాద్రిని సేవించినా, వృషభాచలవాసుని దర్శించినా, స్మరించినా, పూజించినా వారికి ధ్యానసిద్ధి, యోగసిద్ధి, తపోసిద్ధి లభిస్తుంది. కలియుగేశ్వరుడైన శ్రీవేంకటేశ్వరుడు కృతయుగం నాటి ధ్యానసిద్ధిని వృషాచలం నుండి భక్తులకు ప్రసాదించి అనుగ్రహిస్తున్నాడు.

## అం జ నా ద్రి

త్రేతాయుగసమయంలో కేసరి భార్యయైన అంజనాదేవి పంపా సరోవరతీరంలో (నేటి బళ్లారిజిల్లాలోని హంపిలో) నివసించేది. పుత్రలాభం పొందడానికుపాయం చెప్పమని అంజన మతంగమహర్షిని ప్రార్థించింది. మునిఆదేశాన్ని శిరసావహించి అనుసరించింది. పంపా సరస్సునకు పూర్వభాగంలో యాభై యోజనాల దూరంలో గల నరసింహక్షేత్రం సమీపించింది. దానికి దక్షిణంగాను, నారాయణగిరికి ఉత్తరంగాను ఉన్న శ్రీస్వామి పుష్కరిణిని సేవించింది. దానికిక్రోసెడు దూరంలోఉన్న ఆకాశగంగాతీర్థ సమీపంలో ఆశ్రమం నిర్మించుకొంది. ఆది వరాహస్వామిని అర్చించి, అశ్వత్థప్రదక్షిణం చేసి, ఆకాశగంగలో నిత్యం స్నానంచేస్తూ నిరాహారనియమం పాటిస్తూ పన్నెండు సంవత్సరాలు తీవ్రమైన తపంకావించింది. ద్వాదశవర్షపరిమాణమైన తపస్సు పరిసమాప్తమైన శుభసమయంలో దీక్షాసిద్ధిని, ఇష్టదేవతానుగ్రహసిద్ధిని పొందింది. వాయుదేవుడు ప్రత్యక్షమై శివవీర్యపరిపూరితమైన మహా ఫలాన్ని అంజనాదేవికి అనుగ్రహించాడు. వాయుదేవుడు సమర్పించిన ఆ మహాఫలాన్ని అంజన స్వీకరించి, ఆరగించి గర్భవతి అయింది. మహా బలుడైన, అఖండవీరుడైన ఆంజనేయుని పుత్రునిగా బడసి కృతార్థురాలైంది. తిరుమల అంజనాదేవి తపంకావించిన పరమపవిత్ర ప్రాంతం

కావడంవలన, శ్రీరామదూతయైన ఆంజనేయస్వామి ఆవిర్భవించిన పుణ్యస్థలం కావడంవలన అంజనాద్రిగా, అంజనాచలంగా సార్థక నామాలను పొంది వర్ధిల్లుతోంది. అంజనాద్రివాసుడైన శ్రీనివాసుడు 'ఓం అంజనాగోత్రపతయే శ్రీ వేంకటేశాయ నమః', 'ఓం అంజనాసుత దాత్రే శ్రీ వేంకటేశాయ నమః' అనే నామాలతో స్తుతింపబడి పూజింపబడుతున్నాడు. త్రేతాయుగప్రమాణం 12, 96, 000 సంవత్సరాలు. త్రేతాయుగమానవుని సగటువయస్సు 10, 000 ఏండ్లు. యజ్ఞయాగాలు కావించడం త్రేతాయుగమానవులకు యుగధర్మంగా నిర్దేశింపబడింది. అంజనాద్రిని సేవించినా, అంజనాద్రివాసుడైన శ్రీపతిని దర్శించినా, స్మరించినా, పూజించినా నేటిభక్తులకు యజ్ఞనిర్వాహణ ఫలసిద్ధి ప్రాప్తిస్తుంది. రామద్వారపుకాపరియైన శ్రీరామదూత అనుగ్రహం లభిస్తుంది. శ్రీరామానుగ్రహం సిద్ధిస్తుంది. తిరుమలేశ్వరునకు అభిముఖంగా ఆంజనేయుడు నెలకొన్నాడు. అంజనాద్రి స్మరణచేసిన, సేవించిన,భక్తులను శ్రీనివాసుడు శ్రీరాముడై అనుగ్రహిస్తాడు. శ్రీరామదూతగా తోడ్పడతాడు.

## శేషాద్రి

అది ద్వాపరయుగసమయం. వైకుంఠంలో శ్రీమన్నారాయణుడు లక్ష్మీనారాయణుడై క్రీడావినోదలోలుడై విహరిస్తున్నాడు. శేషుడు వైకుంఠద్వారాన్ని పాలిస్తున్నాడు. వాయుదేవుడు అత్యవసరమైన కార్యంపై శ్రీహరిని దర్శింపవచ్చాడు. వైకుంఠంలోనికి ఆతురతతో ప్రవేశింప ప్రయత్నింపగా వైకుంఠద్వారపు కాపరియైన ఆదిశేషుడు వాయుదేవుని వారించాడు. అతని ప్రయత్నాన్ని నివారించాడు. అవశ్యం శ్రీనివాసునిదర్శించాలని వాయుదేవుడు పట్టుపట్టాడు. గతంలో సనకాదిమునులకు విష్ణుదర్శనాన్ని నిరోధించిన నేరానికి

వైకుంఠద్వారపాలకులైన జయవిజయులు వారి శాపంమూలంగా రావణ కుంభకర్ణులుగా ఇతిబాధలు పొందినవివరాలు వాయువు శేషునికి వివరించాడు. తనను నిరోధింపవలదని శేషునకు హితోపదేశం కావించాడు. అదిఫలించలేదు. అహంభావం, అధికారగర్వం ఎంతటివారినైనా అధోగతి పాలుచేసి అణచివేస్తుందని హెచ్చరించాడు. ఆసమయంలో లక్ష్మీదేవిచే ప్రబోధితుడైన నారాయణుడు వాయువుకు వాదం ఉపసంహరించుకొనమని సంజ్ఞాపూర్వకంగా ఆజ్ఞాపించాడు. వాయుదేవుడు మౌనంపాటించాడు. ఆదిశేషుడు తన ప్రతాప పరాక్రమాలనుగూర్చి ప్రగల్భవాక్యాలు పలుకుతూ వాయుదేవుని తనబలాన్ని నిరూపించుకోమని హెచ్చరించాడు.

ఆసమయంలో శ్రీమహావిష్ణువు వారిరువురికి బలపరాక్రమ ప్రదర్శనావకాశం కల్పించాడు. మేరుగిరి తనయుడైన ఆనందగిరిని తన బలంతో గట్టిగా చుట్టుకొని పట్టుకోమని శేషుని ఆజ్ఞాపించాడు. వాయుదేవుణ్ణి శేషపరివృతమైన ఆనందాద్రిని కదలింపజేయమని ఆదేశించాడు. 'ఆనందగిరి కదలకపోతే శేషుడు వాయుదేవుని జయించినవాడవుతాడు. ఆనందగిరి చలించితే వాయుదేవుడు శేషుని ఓడిస్తాడు' అంటూ వారుభయుల బలపరాక్రమప్రదర్శనవిషయమై జయాపజయాలనుగూర్చి నియమాలు నిర్దేశించాడు. దానికి వారు తమ ఆమోదం తెలిపారు. వారిలో ఎవరు బలవంతులో నిరూపించుకొని నిశ్చయించుకోవడానికి సన్నద్ధులై బలపరాక్రమ ప్రదర్శనానికి ఉపక్రమించారు. వారి పోరాటం తీవ్రంగా, తీవ్రతరంగా, తీవ్రతమంగా సాగుతోంది. జోరుగా, హోరుగా వాయుప్రసారం జరుగుతోంది. శేషసహితమైన ఆనందాద్రి నిశ్చలంగా ఉంది. వాయుదేవుడు విజృంభిస్తున్నాడు. శేషుడు గట్టిపట్టుపట్టాడు. ఆనందాద్రి కదలడంలేదు. వాయు

ప్రసారం ఆగడంలేదు. తీవ్రమైన వాయుప్రసారంతో ఉంగా భూమ్యాకాశాలు ఏకమవుతున్నాయి. సప్తసముద్రాలూ ఉల్లోలకల్లోలితమై, విచలితమై ఘూర్ణిల్లి కలగుండు పడిపోతున్నాయి. లోకాలోకాలు తల్లడిల్లి అల్లకల్లోలమైపోతున్నాయి. సకలచరాచర జీవరాసులూ పీడిత తాడితయాతనలు పొందుతున్నాయి.

సప్తఋషిపుంగవులు, అష్టదిక్పాలకులు, నవగ్రహాదిపతులు, ఇంద్రాదిదేవతలు, బ్రహ్మరుద్రాదులు వాయుదేవుని శాంతింపమని అర్థించారు. వాయుదేవుడు వారి అభ్యర్థనను తిరస్కరించాడు. వారి ప్రార్థన వ్యర్థమైపోయింది. జనసంక్షోభం, జగతీసంక్షోభం నివారించడానికై పట్టిన గట్టిపట్టు వదలమని ఆదిశేషుని సర్వదేవతాసముదాయం ప్రార్థించింది. తనఓటమివలన జనరక్షణ, జగతీరక్షణ జరుగుతుందని గ్రహించి శేషుడు ఓడిపోవాలని నిశ్చయించుకొన్నాడు. దేవతాసముదాయప్రార్థనను దేవతాదేశంగా స్వీకరించాడు. ఇది శ్రీ విష్ణుభగవానుని వాంఛితమని, అభిమతమని భావించి దానిని దైవశాసనంగా శిరసావహించాడు. అతడు తనపట్టును సడలించాడు. వాయుదేవుడు విజయం సాధించాడు. ఆనందగిరి - శేషసహితమైన ఆనందగిరి కదలింది. మహావేగంగా ప్రయాణం సాగించింది. అది ఆంధ్రభూమిలో సువర్ణముఖీనదికి ఉత్తరంగా మూడుయోజనాల వెడల్పు, ముప్పై యోజనాల పొడవు ప్రాంతంలో నిలచింది.

మన పురాణప్రపంచంలో శేషునకు ప్రత్యేకమైన స్థానం లభించింది. ఆదిపూజ్యుడైన గణపతి 'నాగయజ్ఞోపవీతధారుడు'. 'ఓం విఘ్నేశోద్యదరబంధనాయ నమః' అని శేషుడు శ్రీ సుబ్రహ్మణ్య అష్టోత్తర శతనామావళిలో ప్రస్తుతింపబడ్డాడు. 'భాగవతం' శేషుని కారణంగా ఉద్భవించింది. శేషుడే హరిశ్చంద్రుడు యశ్చంద్రికలు విశ్వ

వ్యాప్తం కావించాడు. అతనికి సుఖశాంతులు ప్రసాదించాడు. 'ఓం హరిశ్చంద్రసుఖ కృతే నమః' అనే నామంతో శేషుడు కీర్తింపబడ్డాడు. కర్మసాక్షి, సర్వసాక్షిగా ఉండేసూర్యభగవానుని రథాన్నిలాగే సప్త హయాలూ పాములపగ్గాలతో నడపబడుతున్నాయి. అమృతమథనం, సాధనం, రక్షణం అనంతుని కర్తవ్యమైంది. దివ్యక్షేత్రాలైన తిరుమల, శ్రీకాళహస్తిక్షేత్రాల ఆవిర్భావానికి శేషునిసంబంధం ఉంది. శ్రీపతి పన్నగశయనుడు. ఉమాపతి పన్నగభూషణుడు. వైష్ణవులు శేషుడని, శైవులు సుబ్రహ్మణ్యేశ్వరుడని అనంతుని ఆరాధిస్తారు.

"ఘనశయ్యాసన పాదుకాంశుకసమగ్రచ్ఛత్ర ముఖ్యో లస
త్తను భేదంబుల చేర మాధవునకున్ దా శేషమై యుండుటన్
జనులెల్లం దను శేషుడంచు వినుతించన్నించు నత్యంతశాం
తు ననంతు న్బరభక్తిమంతు ఫణికాంతు గొల్తు నశ్రాంతమున్"

అంటూ ఆదిశేషుడు అనంతునిగా జనులమన్ననలు పొందు తున్నాడు. శేషుడు తన ఫణాభోగంబుపై భువనశ్రేణిని భరిస్తున్నాడు. శ్రీనివాసునకు శయనమై, ఉపధానమై, నిలయమై, సచ్ఛత్రమై, పాదుకాద్వయమై, మంగళపీఠమై, మృదులవస్త్రమై, సమస్తోచితక్రియలు శేషుడు నిర్వహిస్తున్నాడు. అట్టి శేషసహితమైన ఆనందగిరి తిరుమల గిరిగా నిలచి శేషాచలంగా, శేషాద్రిగా ద్వాపరయుగసమయంనుండి బహుళప్రచారం పొందింది.

ప్రతిమానవుని శరీరనిర్మాణంలో గుదస్థానం (మూలాధారం) నుండి సహస్రారకర్ణిక (బైందవము) వరకూ మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారములనే ఏడుచక్రాలున్నాయి. మూలాధారంనుండి సహస్రారంవరకు బ్రహ్మదండి మధ్యనుండి (వెన్నెముక మధ్యనుండి) కుండలినీశక్తి అనే సుషుమ్నానాడి

సర్పాకారంగా వ్యాపించి ఉంటుంది. మనోవృత్తులు ప్రపంచాభిముఖంగా ప్రసరించే సామాన్యమానవునిలో సర్పాకారంగాఉండే కుండలినీశక్తి శిరస్సు మూలాధారంలోను, తోక (పుచ్ఛం) సహస్రారంలోను ఉంటాయి. కాగా సుబ్రహ్మణ్యమూర్తులను, సుబ్రహ్మణ్యక్షేత్రాలను, శేషరూపపర్వతాలను దర్శించి ధ్యానించే పురుషుని మనోవృత్తులు పరమేశ్వరాభిముఖ మవుతాయి. అందుచేత అట్టివ్యక్తిలోని కుండలినీ సర్పస్వరూపపు శిరస్సు సహస్రారంలోను, పుచ్ఛం మూలాధారంలోను నిలుస్తాయి. ఆనాడు మానవుడు మాధవుడు, నరుడు నారాయణుడు, జనుడు జనార్దనుడు, జీవుడు శివుడు అవుతాడు. అట్టి దివ్యచైతన్యం, మహాప్రభావం ప్రసరించే శైలం శేషాచలం. శేషాద్రిశిఖరవాసుడు భక్తులలోని సర్పాకారపు కుండలినీశక్తిని ఉచితస్థానాలలో నిలుపుతాడు. ద్వాపరయుగధర్మమైన అర్చనాసంబంధమైన విశేషమైన ఫలితాన్ని అశేషభక్తజనులకు ప్రసాదించి అనుగ్రహిస్తాడు. ద్వాపరయుగప్రమాణం 8, 64000 సంవత్సరాలు. ద్వాపరయుగమానవుని సరాసరి ఆయుర్దాయం వెయ్యిసంవత్సరాలు. పరమేశ్వరార్చనం ద్వాపరయుగమానవుని పరమకర్తవ్యం. శేషాద్రిశిఖరవాసుడు తనను అర్చించేవారికి సహస్రవర్షప్రమాణమైన అర్చనా మహాఫలాన్ని ప్రసాదించి అనుగ్రహిస్తాడు. 'ఓం శేషాద్రినిలయాయ శ్రీ వేంకటేశాయ నమః 'ఓం శేషపర్వతరూపత్వ ప్రకాశనపరాయ శ్రీ వేంకటేశాయ నమః' అనే దివ్యనామాలతో శేషశైలనివాసుడైన శ్రీనివాసుడు నిత్యార్చనలు పొందుతున్నాడు.

శ్రీనివాసుడు వెలసిన తిరుమలక్షేత్రం శేషగిరి సంబంధంచేత సుప్రసిద్ధ సుబ్రహ్మణ్యక్షేత్రంగా ప్రాభవవైభవాలను సంతరించుకొంది. కలియుగంలో సకలక్షేత్రాలలోను, సమస్తతీర్థాలలోను కళలు

నశించి, ప్రత్యక్షఫలితాలు లోపించినా, శ్రీసుబ్రహ్మణ్యక్షేత్రాలలో, శ్రీవేంకటేశ్వర క్షేత్రాలలోమాత్రం ఎప్పుడూ, ఏమాత్రం కళలు నశించవు. ఆక్షేత్రాలలో నిత్యం మహిమలు, లీలలు, విభూతులు, ప్రత్యక్షనిదర్శనాలు శతసహస్రాధికంగా అధికమవుతాయని భవిష్యోత్తరపురాణవచనం సప్రమాణంగా నిర్దేశిస్తోంది. తిరుమలకు ద్వాపరయుగంనుండి శ్రీసుబ్రహ్మణ్య, శ్రీవేంకటేశ్వరసంబంధం ధృవపడింది. అందుచేత శేషశైలం సుబ్రహ్మణ్యక్షేత్రంగా, ఆనందనిలయం శ్రీవేంకటేశ్వరుని దివ్యమైన పూజాపీఠంగా నేటికీ భక్తులకు ప్రత్యక్షప్రమాణాలను ప్రసాదిస్తూ పరవశింపజేసి ప్రభావితులను కావిస్తోంది.

## వేంకటాద్రి

కలియుగారంభసమయంలో తిరుపతికి సమీపంలోని సుప్రసిద్ధ శైవక్షేత్రమైన శ్రీకాళహస్తిలో పురంధరుడనే వైదికనిష్ఠాగరిష్ఠుడైన ఒక బ్రాహ్మణోత్తముడు నివశించేవాడు. అతనికుమారుడు మాధవుడు. మాధవుడు మహాపండితుడు. వేదవేదాంగ విద్యాపారంగతుడు. అతని భార్య చంద్రలేఖ. ఆమె రూపలావణ్య విద్యాగుణసంపత్తులు కలది. భర్తకు అనుకూలవతి. మాధవుడెంత విద్యావంతుడో, అంత వక్రబుద్ధి కలవాడు. ఒకనాటి పగటిపూట కామాతురుడైన మాధవుడు చంద్రలేఖను కామకేళికి ప్రేరేపించాడు. పగటిపూట ప్రణయకేళి సాగింపరాదని ఆమె భర్తను వారించింది. ధర్మోపదేశం చేసింది. మాధవుడు మన్మథవాంఛామోహితుడై భయాన్ని, సిగ్గును విడచి ఆమెహితోక్తులను పెడచెవినిపెట్టాడు. ఆమెను బలవంతంచేశాడు. ఆమె నిరాదరణతో అంగీకరించి సమీపంలోని ఒక సుందరమైన ఉద్యానవనానికి మాధవుని అనుసరించి ప్రవేశించింది. మాధవుడు ఆసుందరోద్యానవనంలో ఇంకొక సుందరాంగిని చూచాడు. చంద్రలేఖతో తానుధర్మవిరుద్ధంగా ప్రవర్తించలేనని చెప్పి ఆమెను స్వగృహానికి పంపించాడు,

వనంలో తాను విలోకించిన వనితను మాధవుడు సమీపించి, మోహించి, వరించాడు. అతడు ఆమె వివరాలు తెలుపమన్నాడు. "నా వృత్తి నీచమైన పశుపువృత్తి. నాది మధ్యదేశం. నాపేరు కుంతల. నన్ను మీరు వరించరాదు." అంటూ కుంతల సమాధానంచెప్పి మాధవుణ్ణి నిరాకరించింది. ఆమెమాటలను త్రోసిపుచ్చాడు, "నీవులేని లోకం నాకు నరకం, నువ్వే నా పాలిటస్వర్గం. నీరూపమే నాజీవితానికి దీపం. నన్ను స్వీకరించు కుంతలా" అంటూ మాధవుడు కోరాడు. "నన్ను సతిగా స్వీకరిస్తే నీతో కాపురానికి అంగీకరిస్తాను" అని కుంతల నిబంధనను విధించింది. మాధవుడు అంగీకరించాడు. వారుమధ్యదేశానికి వెళ్ళి పన్నెండుసంవత్సరాలు కాపురం చేశారు. అంతలో కుంతల మరణించింది. దానితో మాధవుడు పిచ్చివాడై పోయాడు. ఉత్తరదేశం నుండి తిరుమలయాత్రను సాగిస్తూన్న రాజులతో కలసి మాధవుడు తిరుపతి చేరుకున్నాడు. సుదర్శన తీర్థంలో స్నానంచేసి పిచ్చిని పోగొట్టుకున్నాడు. అతడు ఏడుకొండలూ ఎక్కడం ప్రారంభించాడు. అతని శరీరంనుండి అగ్నిజనించి అతని పాపసముదాయాన్ని దహించివేసింది. ఈ అపూర్వమైన దృశ్యం చూచిన దేవతలు పుష్పవృష్టి కురిపించారు. శేషశైలం సేవించి, శ్రీనివాసుని దర్శించిన ఫలితంగా పాపవిముక్తుడయ్యాడు.

"మాధవా! నీవు తిరుమలయాత్ర కావించడంద్వారా నీవు సర్వపాపాలను దహింపజేసికొన్నావు. నీవు శ్రీనివాసుని సేవించిన భాగ్యవిశేషంవలన ముందుజన్మలో ఆకాశరాజువై పుట్టి తొండమండలాన్ని నారాయణపురం రాజధానిగా చేసికొని పరిపాలించి సుప్రసిద్ధుడవవుతావు. జగన్మాత మహాలక్ష్మి పద్మావతియై నీకు పుత్రికగా లభిస్తుంది. పద్మావతీ శ్రీనివాసకళ్యాణం కావించి ధన్యుడవవుతావు" అంటూ బ్రహ్మదేవుడు మాధవునకు వరం అనుగ్రహించాడు. మాధవునిపాపాలను దహించిన ఆకొండను వేంకటాచలమని నామకరణం చేశాడు.

"వేం" అంటే పాపసమూహమని అర్థం. "కట" అంటే దహించుట అని భావం. "వేం"కార మృతబీజం. "కట" ఐశ్వర్యబీజం. పాపాలను దహించి మాధవులవంటి కలియుగమానవులకు అమృతైశ్వర్యసిద్ధిని ప్రసాదించే దివ్యశైలంకావడంవలన తిరుమలకు వేంకటాచలం అనే నామం అన్వర్థభాజనమైనది. మాధవులవంటి కలియుగమానవులను ఆకాశరాజులను చేసే శైలం వేంకటాచలం. వారికి అభయప్రదానం కావించే కలియుగేశ్వరుడు శ్రీవేంకటేశ్వరుడు.

"సర్వపాపాని వేం ప్రాహుః కటస్తద్దాహ ఉచ్యతే
తస్మాద్వేంకట శైలోయం లోకేవిఖ్యాత కీర్తిమాన్"

అని భవిష్యోత్తరపురాణం వేంకటాచల వైభవంప్రతిపాదిస్తోంది. ప్రభాతసమయంలో ఎవరు వేంకటాద్రిస్మరణచేస్తారో వారు సమస్త గంగాసేతుయాత్రలు చేసిన పుణ్యఫలాన్ని పొందుతారని ఫలశ్రుతిని ప్రకటించింది. అందుచేతనే కులశేఖర ఆళ్వారు ఈకొండపై రాయిగా, రప్పగా పుట్టినా చాలునని మనసా తలపోసాడు.

కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలలో వృషభాచలంగా, అంజనాచలంగా, శేషాచలంగా, వేంకటాచలంగా విఖ్యాతమైన ఈ తిరుమల ప్రశస్తిని వరాహ, వామన, భవిష్యోత్తర, బ్రహ్మ,బ్రహ్మాండ పద్మపురాణాలు వివరిస్తున్నాయి. ఒక మహాయుగపు కాలపరిమితి 43,20,000 సంవత్సరాలు. శ్రీనివాసుడు తిరుమలపై 28 మహాయుగాల పూర్వంలో వెలసాడు. 28 × 43, 20,000= 1, 19, 960,000 సంవత్సరాలకు పూర్వం శ్రీనివాసుని ఆవిర్భావం జరిగినట్లు మనపురాణ సాహిత్యం ప్రతిపాదిస్తోంది.

పౌరాణికప్రశస్తి

ఈ కలియుగంతో సమాప్తమయ్యే ఇరవైఎనిమిదవ మహా

యుగంలో ఎందరో పురాణపురుషులు శ్రీవేంకటాచలాన్ని సేవించి, శ్రీనివాసుని దర్శించి తరించారు. దశరథుడు పుత్రార్థియై వసిష్ఠుని రావించి పుత్రప్రాప్తికి మార్గం తెలుపుమని ప్రార్థించాడు. తిరుమల యాత్రకుపోయి శ్రీవేంకటేశ్వరుని దర్శనంచేస్తే క్షీణపాపుడవై పుత్ర సంతానం పొందుతావని వసిష్ఠుడు దశరథునకుపదేశించాడు. కులగురువైన వసిష్ఠునితో కలసి దశరథుడు వేంకటాచలాన్ని సేవించాడు. స్వామిపుష్కరిణిలో నిత్యం స్నానంచేసి వసిష్ఠుడు ఉపదేశించిన వేంకటేశాష్టాక్షరీమంత్రజపం ప్రారంభించాడు. ఇదేసమయంలో బ్రహ్మ ఇంద్రాది దేవతలు రావణుని ఉపద్రవంగూర్చి శ్రీనివాసునకు నివేదించడానికై వేంకటాచలానికి వచ్చారు. స్వామిపుష్కరిణీతీరంలో అపూర్వమైన శోభతో, అనుపమానమైన కాంతిలో ఒకదివ్యమైన విమానం ఆవిర్భవించింది. దానిలో శ్రీనివాసుడు ప్రసన్నవదనుడై సాక్షాత్కరించాడు. సనకాదిమునులు, బ్రహ్మరుద్ర ఇంద్రాది దేవతలు స్వామిని సభక్తిపురస్సరంగా సేవించారు. రావణోపద్రవాన్ని నివేదించి నివారింపమని ప్రార్థించారు. దేవతాసముదాయానికి శ్రీపతి అభయమిచ్చాడు. అంత దశరథుడు శ్రీనివాసుని సమీపించి, సందర్శించి, సేవించి పుత్రప్రాప్తిని ప్రసాదింపమని ప్రార్థించాడు. కీర్తివంతులు, శూరులు, ధర్మవర్తనులైన నలుగురుకుమారులు కలుగుతారని దశరథునకు శ్రీపతి వరం అనుగ్రహించాడు. దేవతాసముదాయం రావణసంహారం విషయంలో అభయం పొందింది. దశరథుడు పుత్రప్రాప్తిని పొందాడు.

దశరథుడే కాదు అతనికుమారుడైన శ్రీరాముడు లక్ష్మణస్వామితో కలసి వానరసైన్యం సమీకరించుకొని రావణసంహారానికి బయలుదేరిన సమయంలో ఆంజనేయుని అభ్యర్థనను మన్నించి వేంక

టాచలాన్ని సేవించాడు బ్రహ్మలోకప్రాప్తికై బ్రహ్మవరం పొందిన నిర్లోమునికి శ్రీరాముడు దర్శనమిచ్చి అనుగ్రహించాడు. ఆకాశ గంగాతీరంలోని అంజనపూజలు అందుకొని, వేంకటాచలంపైగల మును లకు తపోసిద్ధి ప్రసాదించి స్వామిపుష్కరిణిలో సపరివారంగా స్నానం చేసి శ్రీనివాసుని సేవించాడు. వానరులు కొండపైగల దివ్యప్రభావ సమన్వితమైన వైకుంఠగుహను సందర్శించి ధన్యులయ్యారు. కోదండ రాముడు వేంకటాచలాన్ని సేవించి లంకకుపోయి రావణసంహారం కావించాడు. వేంకటాచలయాత్రాఫలితంగాను, స్వామిపుష్కరిణీస్నాన ఫలంగాను స్వామిత్వంపొంది పట్టాభిరాముడై రామరాజ్యం ప్రజలకు ప్రసాదించాడు. కోదండరాముడు తిరుపతియాత్ర కావించినదానికి ప్రతీ కంగా తిరుపతిలో కోదండరామాలయం నెలకొని ఉంది.

త్రేతాయుగంలోని శ్రీరాముడేకాదు ద్వాపరయుగమందలి ధర్మరాజుకూడ వేంకటాద్రిని సేవించి కౌరవసంహారం సాధించి నష్ట రాజ్యలాభం పొందాడు. శ్రీకృష్ణుడు పాండవులను శేషశైలాన్ని సేవింపుమని ఆదేశించాడు. పాండవులు ఒక సంవత్సరం తిరుమలపై నివ సించి శ్రీనివాసుని అర్చించారు. వారు నిర్మించుకొని స్నానంచేసిన తీర్థం నేడు పాండవతీర్థంగా ప్రసిద్ధి వహించింది. ఆవిధంగా వేంకటా చలాన్ని సేవించిన పుణ్యవిశేషంవలన వారు క్షీణపాపులై కురుపాండవ యుద్ధంలో విజయం సాధించి హస్తినాపురరాజ్యం సంపాదించారు. ఈ విధంగా తిరుమలను బ్రహ్మ,రుద్ర, ఇంద్రాది దేవతలు, సప్తఋషిపుంగ వులు, అష్టదిక్పాలకులు, నవగ్రహాధిపతులు, సనకాదిమునులు, పుణ్య పురాణపురుషులు సేవించి తాము ధన్యులై కలియుగమానవులకు భక్తు లకు మార్గదర్శకులయ్యారు. తిరుమల పవిత్రతను ఇతోధికం, శతాధికం చేసి ఆ దైవసంపదను పరిరక్షించుకొనే వారసత్వం మనకు సంక్రమింప జేశారు.

తిరుమల అంటే పవిత్రమైనకొండ అని అర్థం. ఈ తిరుమల క్రీడాద్రి, జ్ఞానాద్రి, తీర్థాద్రి, పుష్కరాద్రి, వృషాద్రి, నారాయణాద్రి, కనకాద్రి, వైకుంఠాద్రి, ఆనందాద్రి, సింహాద్రి, వరాహగిరి, శ్రీగిరి, నీలగిరి, శ్రీనివాసగిరి, చింతామణి మొదలైనపేర్లతో పిలువబడుతోంది. శ్రీహరికి క్రీడలకు నెలువుకావడంవలన క్రీడాద్రి అయింది. జ్ఞానం ప్రసాదించేదికనుక జ్ఞానాద్రిగా పేరుపొందింది. ఇది సర్వతీర్థ సముదాయానికి కేంద్రం. అందుచేత తీర్థాద్రిగా ప్రసిద్ధి పొందింది. పుణ్యపుష్కరిణులు బహుళంగా ఉండడంచేత పుష్కరాద్రి అనేపేరు పొందింది. యమధర్మరాజుకి తపోప్రదేశం కావడంవలన వృషాద్రిగా ప్రసిద్ధమైనది. నారాయణుడనే విప్రుడు దీనిపై తపస్సుచేసి తనపేరు మీదుగా ఈకొండ పిలువబడాలని కోరడంవలన నారాయణాద్రి అయింది. ఇది బంగారుకొండ కావడంవలన కనకాద్రి అనేపేరు సంపాదించుకొంది. ఈకొండ వైకుంఠంనుండి తీసికొనిరాబడడంచేత వైకుంఠాద్రి అయింది. శ్రీనివాసుని ఆనందనిలయం వెలసిన గిరి కావడం వలన ఆనందాద్రి అనే నామాన్ని సిద్ధింపజేసికొంది. నరసింహావతారం ఉద్భవించిన తావు కనుక సింహాద్రి - నరసింహగిరి అనే పేర్లు పొందింది. ఇది ఆదివరాహక్షేత్రానికి నిలయం కనుక వరాహగిరిగా వ్యవహరింపబడుతోంది. ఈకొండ శ్రీపాదయుక్తం, శ్రీనివాసమయం కావడం వలన శ్రీగిరి, శ్రీశైలం అనే నామాలను ధరించింది. నీలుడు నివసించినకొండకనుక నీలగిరి అయింది. దీనిపై శ్రీనివాసభగవానుడు అవతరించడంచేత శ్రీనివాసగిరిగా వ్యవహారప్రసిద్ధి పొందింది. భక్తులు చింతించినదంతా ప్రసాదించేదికనుక చింతామణి — భక్తచింతామణి అనే సార్థకనామాన్ని వహించింది. 'వేంకటాచల మాహాత్మ్యాన్ని యథాతథంగా వివరించడానికి సహస్రవదనుడైన ఆదిశేషునకు, షణ్ముఖుడైన స్కందునకుకూడ సాధ్యంకాదు. ఇతరదేవతలకు ఏవిధంగా సాధ్యమవుతుంది' అని వేంకటాచలవైభవంగూర్చి వరాహపురాణం

ప్రశంసిస్తోంది. ఇంతటి పౌరాణికప్రశస్తి, ఐతిహాసికయశస్సు సంపాదించిన తిరుమల మహాక్షేత్రమై, పరమపవిత్రప్రపంచయాత్రా కేంద్రమై విరాజిల్లుతోంది. తిరుమలక్షేత్రాన్ని తిరుమలేశ్వరుని సదా సర్వదా సేవించిన అన్నమాచార్యుడు తిరుమలయాత్రికులకు, తిరుమలేశ్వరుని భక్తులకు ఒక అపూర్వమైన సందేశం అందించాడు. 'తనువును తిరుమలగిరిగా మలచుకొని, మనస్సును ఆనందనిలయంగా చేసికొని అందులో తిరుమలేశ్వరుని నిలుపుకోమనే' దే అన్నమాచార్యులుభక్తుల కిచ్చిన ఆ సందేశం. భక్తులు ఈ అన్నమయ్యసూత్రాన్ని మనస్సునను పట్టించుకొని, మననం చేసికొని, తిరుమలయాత్రిలో అట్టి దివ్యానుభూతిని పొందాలి! ఆనాడే భక్తుల తిరుమలయాత్ర సార్థకమవుతుంది. అట్టి యాత్రానుభూతిని పొందడానికి అన్నమాచారి పలుకులలోని శ్రీహరివాసాన్ని చూడండి! వినండి. ధన్యత చెందండి.

"అదివో అల్లదివో హరివాసము
పదివేల శేషుల పడగలమయము ॥పల్లవి॥

అది వేంకటాచల మఖిలోన్నతము
అదివో బ్రహ్మాదుల కపురూపము
అదివో నిత్యనివాస మఖిలమునులకు
అదె చూడుడదె మ్రొక్కుడానందమయము ॥అది॥

చెంగట నల్లదివో శేషాచలము
నింగినున్న దేవతల నిజనివాసము
ముంగిట నల్లదివో మూలనున్నధనము
బంగారుశిఖరాల బహుబ్రహ్మమయము ॥అది॥

కైవల్యపదము వేంకటనగమదివో
శ్రీ వేంకటపతికి సిరులయినది
భావింప సకలసంపదల రూపమదివో
పావనములకెల్ల పావనమయము ॥అది॥"

## ఆవిర్భావం

"ఆతడే ఇతో మాయలేలిన ఆతడే జగన్నాథుల
నాతడే శ్రీ వేంకటాద్రినిలయుని మాదైవము

కమలవాసిని ఎదఁ గాంచి ఉన్నాడినాడు
కమలములో పుట్టఁగన్నవాడు
కమలాక్షుని లోకం గెలిచి మెరయువాడు
కమలనాభుడే ఇతో మా కావలదైవము

జలధి బంధించి లంక సంహరించినవాడు
జలధి శాయిత్వము చూపినవాడు
జలధిసుతను సరసఁబట్టినవాడు
జలధిశయనుడే ఇతో చక్కని మాదైవము

కొండగోవర్ధనమెత్తి గోవులఁ గాచినవాడు
కొండవంటి రాకాసిఁ గొట్టినవాడు
కొండలను సొక్కినైన గనుటను శ్రీవేంకటాద్రి
కొండపెరుమాళ్ళు దానే ఇతో కోరిన మాదైవము"

— అన్నమాచార్య సంకీర్తన

### వామనపురాణ గాథ

శ్రీనివాసుడు సృష్టిప్రారంభం నుండి ప్రతిమన్వంతరం, ప్రతి కల్పం, ప్రతియుగంలోను తన అనంతమైన లీలావతారాలను ధరించి జనులను, జగత్తులను ఉద్ధరిస్తున్నాడు. 'ధాతా యథాపూర్వ మకల్ప యత్' అన్నశ్రుతివాక్యం దీనికి ప్రమాణం. శ్రీవేంకటేశ్వరుని దివ్యావతారాలు అసంఖ్యాకమైన ఆకాశరాజులను, పద్మావతీదేవులను కల్పించింది. అటి అద్వితీయుడైన, అనంతుడైన శ్రీనివాసుని ఆవిర్భావం నిర్ణయించడం అసాధ్యం. తెలిసికొనడం, తెలియచెప్పడం దుర్లభం.

నామం, రూపం లేని ఆదిమూర్తి నామరూపాలు ధరించి, భువిపై అర్చావతార స్వరూపియై ఆవిర్భవిస్తే, శ్రీ వేంకటరమణమూర్తియై అవతరిస్తే వ్యాసుడు తనదివ్యదృష్టితో చూచి, గ్రహించి పురాణ కథలద్వారా ప్రజకు అందించాడు. శ్రీనివాసునిగా ఆవిర్భవించిన భగవానుని అర్చావతారగాథలను వ్యాసభగవానుడు పద్మ, గరుడ, బ్రహ్మాండ, మార్కండేయ, ఆదిత్య, వామన, బ్రహ్మ, బ్రహ్మోత్తర, స్కంధ, భవిష్యోత్తరపురాణాలలో ప్రతిపాదించాడు. మహాభారతం లోని మౌసలపర్వంలో ప్రకటించాడు. 'హరివంశం' కూడ శ్రీనివాస ఆవిర్భావాన్ని వర్ణించింది.

కృతయుగసమయంలో సూర్యవంశపురాజైన శంఖరాజన్యుడు శాశ్వతనిర్మాణం సాధించాలని సంకల్పించాడు. గురుదేవుడైన వశిష్ఠునితో సమాలోచించాడు. గురుడు రాజును వేంకటాచలానికి వెళ్ళమన్నాడు. శంఖరాజన్యుడు వేంకటాద్రిని సేవించాడు. శ్రీనివాసుడు ఒక దివ్యవిమానంలో రాజునకు సాక్షాత్కరించాడు. తాను ఎటువంటి విమానంలో ఆవిర్భవించానో అటువంటి విమానాన్ని నిర్మింపుమని రాజును భగవానుడు ఆదేశించాడు. ఆవిధంగా కావించిన శ్రీనివాసుని అర్చావతారమూర్తిని ప్రతిష్ఠించి పూజించి ధన్యుడయ్యాడు శంఖ రాజన్యుడు. వామనపురాణం ఈవిధంగా కృతయుగంనాటి శ్రీనివాస ఆవిర్భావంగూర్చి ప్రకటించింది.

### వరాహపురాణ కథ

అది త్రేతాయుగం. కృతయుగంలో శంఖరాజన్యుడు నిర్మించిన విమానం కాలగర్భంలో లీనమైపోయింది. స్వామివిగ్రహంపై ఒకపెద్ద పుట్ట పెరిగింది. దానిసరసనే ఒక చింత పెరిగింది. త్రేతాయుగంలో రావణఉపద్రవం బ్రహ్మాదిదేవతలు శ్రీనివాసునితో నివేదించుకోవ

డానికి వేంకటాద్రికి వచ్చారు. ఒకదివ్యమైన విమానంలో వారికి శ్రీనివాసుడు తన దర్శనభాగ్యం ప్రసాదించాడు. దశరథునకు పుత్ర లాభం కలిగేవరం అనుగ్రహించాడు. దేవతలకు రావణోపద్రవం తొలగుతుందని అభయమిచ్చాడు. బ్రహ్మ కావించిన బ్రహ్మోత్సవాన్ని సాదరంగా స్వీకరించి అనుగ్రహించాడు. బ్రహ్మదేవుని కోరికను మన్నించి శ్రీనివాసుడు వేంకటాద్రిపై ఉండి జనులకోరికలు మన్నిస్తూ, వారికి వరాలుప్రసాదిస్తూ త్రేతాయుగంలోనివారిని రక్షించాడు. త్రేతాయుగంనాటి శ్రీనివాస ఆవిర్భావకథ వరాహపురాణంలో ఆ విధంగా ఆవిష్కరింపబడింది.

## బ్రహ్మాండపురాణ గాథ

త్రిలోకసంచారి నారదుడు నారాయణుని దర్శించాడు. తనకు భూలోకవాసం కావించాలని వాంఛకల్గిందని, తననివాసానికి విహారానికి అర్హమైన ప్రదేశం సూచించమని నారదుణ్ణి శ్రీనివాసుడు ప్రశ్నించాడు. నారదుడు శ్రీవేంకటాద్రిగల స్థానం శ్రీహరివాసానికి ఉచితమైన స్థానమని ప్రకటించాడు. శ్రీనివాసుడు శేషుని తనకు క్రీడాద్రిగా రూపొందమని ఆదేశించాడు. శేషుడు ఆవిధంగా చేసాడు. విష్వక్సేనుని బ్రహ్మాదిదేవతలను శేషాద్రికి ఆహ్వానింపమని ఆజ్ఞాపించాడు. శ్రీ భూదేవులతో కలసి శ్రీనివాసుడు ద్వాపరయుగసమయంలో శేషాద్రిపై అవతరించాడు. ఇది బ్రహ్మాండపురాణం ద్వితీయాధ్యాయంలోగల శ్రీనివాస ఆవిర్భావగాథ.

## బ్రహ్మపురాణ కథ

బ్రహ్మపురాణంలో శేషసంబంధమైన శేషాద్రిశిఖరవాసుని ఆవిర్భావకథ ఇంకొకవిధంగా ఉంది. శేషునకు వాయుదేవునకు వాక్కలహం పెరిగి వారుభయుల బలపరీక్షప్రదర్శనకు దారితీసింది. మేరువును

పట్టిచుట్టిన శేషుని వాయుదేవుడు కదలించి సువర్ణముఖరీనదీ తీరాన పడవేశాడు. అది శేషాద్రి అయింది. శేషుడు శేషాద్రి శిఖరంపైన ఘోరమైన తపస్సు కావించాడు. శ్రీనివాసుడు ప్రత్యక్షమై శేషుని వరం అడుగుమన్నాడు. తన శిరఃప్రదేశాన స్వామి అవతరించి తనను భక్తులను అనుగ్రహించాలని శేషుడు వరం అర్థించాడు. శేషుని మన్నించి శ్రీనివాసుడు శేషాద్రి శిఖరంపై ఆవిర్భవించి, శేషాద్రి శిఖరవాసు డయ్యాడు.

బ్రహ్మాండపురాణ గాథ

అది కలియుగసమయం. ఆ కాలంలో చోళరాజు ఉండేవాడు. అతడు వేటకై శేషాచలానికి వెళ్ళి ఎన్నోక్రూరమృగాలను సంహరించాడు. విశ్రాంతికై వేచిఉన్నప్రదేశానికి సమీపంలోని ఒకఉద్యానవనంలో పువ్వులు సేకరిస్తూన్న సుందరిపై చోళరాజు దృష్టి ప్రసరించింది. రాజు ఆమె వివరాలు అడిగాడు. 'నా పేరు ధనంజయ. నేను నాగకాంతను. నానివాసం పాతాళం' అని ఆనాగకాంత బదులు చెప్పింది. తనను వివాహమాడుమని రాజు ధనంజయను అర్థించాడు. ఆమె రాజును పాతాళంలోని తనతండ్రి అనుమతిని పొందమంది. రాజు సాధ్యంకాదనిచెప్పి ఆమెను గాంధర్వవిధని స్వీకరించాడు. వారు ఆ రాత్రి సంతోషంగా కాలంగడిపారు. మరునాడు రాజు రాజధానికి మరలివెళ్ళాడు. ధనంజయ పాతాళానికి వెళ్ళి తండ్రికి చోళరాజుతో తన గాంధర్వవివాహ వృత్తాంతం నివేదించింది. అతడు ఆమోదించి ఆశీర్వదించాడు. ఆమె గర్భందాల్చి మగశిశువును ప్రసవించింది. ఆ బాలుడు పెరిగి పెద్దవాడయ్యాడు. తండ్రిని చూపుమని తల్లిని అడిగాడు. తల్లి తనయునకు తండ్రి వివరాలు చెప్పింది. పాతాళంనుండి భూలోకానికి మార్గంచూపింది. ధనంజయపుత్రుడు చోళరాజును కలసి తన సంగతి చెప్పాడు. నాగకన్యావృత్తాంతం విస్మరించిన రాజు తన

యుణ్ని శంకించాడు. ఆకాశవాణి వచ్చినవాడు చోళరాజు తనయుడని నిర్ధారించింది. తక్షణమే చోళరాజు తాను నాగకన్యతో సమావేశమైన ప్రదేశంలో ఒక మహానగరాన్ని నిర్మించడానికి ధనంజయ పుత్రుణ్ణి రాజును కావించాడు. ధనంజయపుత్రుడు చోళచక్రవర్తిగా ప్రసిద్ధు డయ్యాడు.

ఒకనాడు చోళచక్రవర్తి గోసంరక్షకులు రాజుతో "రాజా! కడవలతో గోక్షీరం నిత్యం తెస్తున్నాం. కొండపైగల ఒకపుట్టను దాటకుండానే ఒకకుండ బద్దలై దానిలోని ఆవుపాలు పుట్టపై పడు తున్నాయి. ఈ చోద్యం మాకు అర్థంకావడంలేదు. అందుకే తమకు మనవిచేసాము" అన్నారు. ఆనాటిరాత్రి చక్రవర్తికి ఒక కలవచ్చింది. ఒకఅందమైన నల్లనివ్యక్తి కలలో కనిపించాడు. "నేనూ శ్రీనివాసుడూ కలసి శేషాద్రిపై ఉంటున్నాము. శ్రీదేవితో, భూదేవితో శ్రీనివాసుడు నెలకొని ఉన్నాడు. నీవువచ్చి స్వామిని దర్శింపుము అని" ఆ నల్లనివాడు, పద్మనయనాలవాడు కలలో చక్రవర్తికి వివరించాడు. కలలో అతణ్ణి అనుసరించి ఒకదివ్యమైన, అపూర్వమైన, నయనానంద దాయకమైన ఒక అందమైనవిమానాన్ని తిలకించి పులకించిపోయాడు. మరునాడు ఒక శబరుడువచ్చి రాజుకొక వింతకథ ఈవిధంగాచెప్పాడు.

'రాజా! నేను శేషాద్రిపై ప్రియంగుధాన్యాలు పండిస్తూం టాను. ఆ ప్రియంగుధాన్యాలను స్వామికి నివేదించి మిగిలినవి ఆహారంగా తీసికొంటాను. ఒకనాడు ఒక శ్వేతవరాహం ప్రియంగుసస్యాన్ని పాడుచేయడం చూచాను. నా కొడుకును సస్యం కాపాడడానికి నిలిపి తేనె సేకరించడానికి వెళ్ళి మరలివచ్చాను. దైవానికి నివేదించకుండా పిల్లవాడు ప్రియంగుధాన్యం తినడం గమనించాను. పట్టరానికోపంతో వాణ్ణి మట్టుపెట్టా లనుకొన్నాను. స్వామి నివేదన అందుకొన్నాడు కనుక బాలుణ్ని చంపవద్దని అశరీరవాణి చెప్పింది. ఇదే ఆ వింతకథ".

చోళచక్రవర్తి వెయ్యిఆవులపాలు కడవలలో నింపించి శేషాద్రికి తోడ్కొనిరమ్మని మంత్రులను ఆజ్ఞాపించాడు. వింతకథచెప్పిన వ్యక్తితోకలసి శేషాద్రి అధిరోహించాడు. శబరుడు రాజుకి వల్మీకం చూపించాడు. పుట్టను త్రవ్వించమన్నాడు. చక్రవర్తి ఆవిధంగాచేయడానికి భయపడ్డాడు. రాజు పరివారాన్ని పుట్టపై తెచ్చిన గోక్షీరంతో ధారగా అభిషేకింపమని ఆజ్ఞాపించాడు. వారు పోసిన ఆవుపాలతో పుట్ట కరిగిపోయింది. పాలకడలినుండి లేచిన స్వామివలె శ్రీ భూ సమేతుడై, శంఖచక్రధారుడై, భక్తవరదుడై, కట్యావలంబితవామహస్తుడై శ్రీనివాసుడు సుధామధురమైన తన దివ్యదర్శనభాగ్యాన్ని చోళచక్రవర్తికి అనుగ్రహించాడు. చక్రవర్తి, చక్రవర్తులకు చక్రవర్తియైన శ్రీనివాసచక్రవర్తికి వశవర్తియై కీర్తించాడు. ఏ దివ్యరూపంతో ఎచ్చట నిలచి వెలసినావో అచ్చటనే ఉండుమని చక్రవర్తి శ్రీనివాసుని అర్థించాడు. స్వామి ఆమోదించి తనకు నిత్యం పూజచేయమని చక్రవర్తిని ఆదేశించాడు. చక్రవర్తి కావించే పవిత్ర పాదపూజాసమయంలో శ్రీనివాసుడు ఆ భక్తుణ్ని, ఆ దాసుణ్ని మిత్రునిగా స్వీకరించి ప్రియంగా సంభాషించేవాడు. చక్రవర్తిని తన భార్యాశిశువుల రక్షణచూడమని కృష్ణశర్మ కాశీయాత్ర వెళ్ళాడు. తిరిగివచ్చి తన భార్యాబిడ్డలను చూపమన్నాడు. రాచకార్యనిమగ్నుడై వారి విషయం విస్మరించగా వారిఅస్థికలు మిగిలాయి. శ్రీనివాసుడు చక్రవర్తిని మిత్రునిగాభావించడంవలన వారిని సజీవులనుకావించి చక్రవర్తికి అపకీర్తి రాకుండా వారించాడు.

వరగర్వితుడైన సింహాదుడనే రాక్షసుడు ఎవ్వరినీ లక్ష్యపెట్టకుండా, దేవతల్నిసహితంహింసిస్తూ శేషశైలంపై విజృంభించసాగాడు. దేవతలు శ్రీనివాసుని ఆశ్రయించి తమనురక్షింపుమని ప్రార్థించారు: "మీరు నాభక్తుడైన చక్రవర్తిసహాయం అర్థించండి. మీ అంశలతో

అతనిలో ప్రవేశించండి" అని దేవతలకు శ్రీనివాసుడు హితవు చెప్పాడు. వారు ఆవిధంగా చేసారు. చక్రవర్తి శ్రీనివాసుని పాదాలకై వాలి దేవతాకార్యం సాధించడానికి అనుగ్రహింపమని అర్థించాడు. స్వామి భక్తరక్షకుడు. చక్రవర్తికి తన దివ్యాయుధాలైన శంఖచక్రాలను ప్రసాదించాడు. చక్రవర్తి పాపవినాశనతీర్థసమీపంలో ఉన్న ఆ పాపిష్ఠిరాక్షసుణ్ణి యుద్ధానికి ఆహ్వానించి, చక్రప్రయోగం కావించి సంహరించాడు. పిమ్మట స్వామివారిఆయుధాలను స్వామివారికి చక్రవర్తి సమర్పించాడు. "ఇవిలేకుండా కొంతకాలం ఉంటాను. ఓ దివ్యాయుధాలైనమీరు మీపేర్లతో వర్ధిల్లేతీర్థాలలో అధివసించండి. ఒకకారణంవల్ల ఒకవ్యక్తి సమర్పించే కృత్రిమమైన శంఖచక్రాలను ప్రపంచాన్ని మెప్పించడానికి కలియుగంలో ధరిస్తాను" అని శ్రీనివాసుడు తననిర్ణయం ప్రకటించాడు. బ్రహ్మాండపురాణంలో చోళచక్రవర్తి నిమిత్తంగా శ్రీనివాసుడు ఆవిర్భవించిన ఈ పరమపవిత్రచరిత్ర వ్యక్తమవుతోంది.

## బ్రహ్మాండపురాణ గాథ

పూర్వకాలంలో వైఖానసబ్రాహ్మణుడైన గోపీనాథుడు చోళదేశంలో ఉండేవాడు. శ్రీకృష్ణావతారలీలలు విన్న గోపీనాథుడు శ్రీకృష్ణభగవానుని ప్రత్యక్షంగా దర్శించి మోక్షం పొందాలని కాంక్షించాడు. చోళదేశంలో అతడు మహాతపస్సు కావించాడు. గోపీనాథునకు గోపీనాథరూపంలో కృష్ణుడు ప్రత్యక్షమెయ్యాడు. శేషాచలానికి వెళ్ళి శ్రీనివాసునిసేవింపుమని ఆదేశించాడు. మార్గమధ్యంలో కలిసే రంగదాసునకు ఉపయోగపడుమని హితవు చెప్పాడు. పాండ్యదేశంలోపుట్టిన రంగదాసుడు తనపన్నెండవయేట వేంకటాచలం సేవించడానికి వచ్చాడు. గోపీనాథుడూ, రంగదాసుడూ శ్రీ వేంకటాద్రి

పాదప్రాంతంలో కలసికొన్నారు. వారుభయులు తిరుమలకు చేరారు. స్వామిపుష్కరిణిలో స్నానంచేసి పవిత్రశరీరులయ్యారు. పావనమనస్కులయ్యారు. సమీపంలో ఒక చింతచెట్టు, దానిసరసనే ఒక పుట్ట కనిపించాయి. వారు పుట్ట నెమ్మదిగా త్రవ్వి శ్రీనివాసుని దివ్యసుందర మూర్తిని కనుగొన్నారు. తాటాకు పైకప్పువేసి, రాతిగోడలుకట్టి ఒక మండపం సిద్ధంచేసారు. దానిలో స్వామివారిని నిలిపారు. రంగదాసు బావిత్రవ్వి ఉద్యానవనాలు నెలకొల్పాడు. నిత్యం పూలుకోసి, మాలలుగా మలచి స్వామిపాదాలమ్రోల సమర్పించడానికి, స్వామిదివ్యమంగళవిగ్రహానికి అలంకరించడానికి అర్పించేవాడు. గోపీనాథుడు విధివిధానంగా స్వామి అర్చనాదులు నిర్వహించేవాడు. ఒకనాడు రంగదాసుడు ఉద్యానవనానికి వెళ్ళాడు, పువ్వులు సేకరించాడు. మాలలుగా రచిస్తున్నాడు. సమీపంలోని సరోవరంలో కుండలుడనే గంధర్వుడు ప్రియసతితో జలక్రీడలాడడం చూస్తూ రంగదాసుడు స్వామివారి పూజను మరచాడు. ఆ దృశ్యంచూసి మనస్సులో ప్రణయభావాలు కల్పించుకొని ఊహాలోకాలలో విహరింపసాగాడు. జలక్రీడలు ముగించిన గంధర్వదంపతులు విమానంలో వెళ్ళిపోయారు. రంగదాసు మనస్సును చిక్కబట్టలేనందుకు చింతించాడు. స్వామిపూజకు సకాలంలో పువ్వులు, పూలదండలు సమర్పింపలేకపోయినందుకు విచారించాడు. తనమనస్సులోని భావాలు కలుషితమయ్యాయి. అందుచేత తాను కోసిన కుసుమాలు, తాను మలచిన పూలహారాలు పూజకు పనికిరావని నిశ్చయించుకొన్నాడు. మరల స్నానంచేసాడు. మరల పువ్వులు సేకరించాడు. సుమాలమాలలు అల్లాడు. తొందర, తొందరగా స్వామిమందిర ద్వారంవద్ద నిలిచాడు. గోపీనాథుడు స్వామివారి పూజాసమయాతిక్రమణానికి రంగదాసు బాధ్యుడని అతనిపై కోపగించాడు. ఈ ఆలస్యానికి కారణమేమిటని అడిగాడు. మనస్సులోని మదనుడు ఈ ఆలస్యా

నికి కారకుడని రంగదాసు చెప్పలేకపోయాడు. గోపీనాథుని ప్రశ్నకు రంగదాసుని మౌనమే సమాధానమైనది.

"రంగదాసా ! నీవు మాయామోహితుడవై మదనవశుడ వయ్యావు. దానికి పశ్చాత్తాపం పొందావు. నీకు మేలు జరుగుతుంది. నీవుచూచిన గంధర్వరాజువలె నీవుకూడ ఉత్తరజన్మలో రాజువై జన్మిస్తావు. సకలభోగభాగ్యాలు అనుభవిస్తావు. ఈజన్మలో నాకు పర్ణశాల నిర్మించావు. ఆ జన్మలో దివ్యవిమానం నిర్మించి దివ్యత్వం పొందుతావు" అని శ్రీనివాసుడు రంగదాసును అనునయించాడు. రంగదాసు వందసంవత్సరాలు జీవించి శ్రీనివాసుని సేవించి మరుజన్మలో చక్రవర్తిగా జన్మించాడు.

ద్రావిడదేశంలోని ప్రజలు ఆ చక్రవర్తిని తొండమానుడని పిలిచేవారు. తొండమానుచక్రవర్తి శ్రీనివాసునకు దేవాలయప్రాకారాదులు నిర్మించి, దివ్యాభరణాలు సమర్పించాడు. ఒకసమయంలో శత్రురాజులు తొండమానుచక్రవర్తి రాజ్యంపై దండెత్తి ముట్టడించారు. ఆ సమయంలో తొండమానుడు శ్రీనివాసుని సహాయం చేయమని అర్థించాడు. భగవానుడు శంఖుచక్రాలను భక్తునకిచ్చాడు. వాని సహాయంతో చక్రవర్తి శత్రువులను ఓడించి, రాజ్యంనుండి వారిని వెడలగొట్టాడు. తొండమానుడు మరలివచ్చి కృతజ్ఞతాపూర్వక నమస్సులు అర్పించాడు. "శ్రీనివాసుడు భక్తునకు సహాయం చేయడంకోసం ఎట్టిత్యాగమైనా చేస్తాడు. భక్తరక్షణకోసం తనదివ్యాయుధాలైన శంఖుచక్రాల నివ్వడానికైనా సిద్ధపడతాడు. ఆ విషయం లోకానికి తెలియడంకోసం నీవు శంఖుచక్రాలు ధరించకుండా అర్చావతార స్వరూపుడవై నిలవాలి" అని తొండమానుడు శ్రీనివాసుని ప్రార్థించాడు. శ్రీనివాసుడు తొండమానుని విన్నపాన్ని మన్నించాడు. శ్రీని

వాసుని అర్చావతారాన్ని ఆవిర్భావాన్నిగూర్చి బ్రహ్మాండపురాణంలో ఈ వృత్తాంతం కనపడుతోంది. ఇదే వృత్తాంతాన్ని వరాహపురాణం కూడ ధృవ పరుస్తోంది.

భవిష్యోత్తరపురాణ గాథ

పూర్వం కాశీక్షేత్రంలో శ్రీ విశ్వేశ్వర సన్నిధానమందలి గంగా తీరంలో ఋషిపరిషత్తుయజ్ఞం నిర్వహింప సంకల్పించింది. నారదుడు యజ్ఞఫలం ఎవరికి సమర్పిస్తారని అడిగాడు. వారు భృగువును యజ్ఞ ఫలం అందుకోవడానికి అర్హుడైన దైవతామూర్తిని నిశ్చయింపమని ప్రార్థించారు. భృగువు త్రిమూర్తులను పరీక్షించాడు. త్రిలోకాలు సంచరించాడు. బ్రహ్మ, శివుడు భృగువురాకనే గమనించలేదు. అదే పరిస్థితి వైకుంఠంలోకూడ భృగువునకు ఎదురైంది. పవ్వళించిన శ్రీహరి వక్షస్థలాన లక్ష్మీస్థానాన్ని భృగువు తనపాదంతో తన్నాడు. సత్వగుణసంపన్నుడైన శ్రీనివాసుడు భృగువునకు పాదసేవ కావించాడు. భృగువు "శ్రీ మహావిష్ణువు సత్వగుణసంపన్నుడు. కలియుగ మానవులను రక్షింపగల సమర్థుడు. శ్రీహరికే యజ్ఞఫలం సమర్పించడం సముచితం" అని గంగాతీరంలోని మునిపరిషత్తుకు నివేదించాడు. శ్రీసతి తన నిత్యనివాసస్థానం భృగువు పాదఘాతానికి గురికావడం సహింపలేక వైకుంఠాన్నివిడచి కరవీరపురానికి (కొల్హాపూరు) కదలి పోయింది. శ్రీసతి వియోగం భరించలేని శ్రీపతి వైకుంఠాన్నివదలి భూలోకానికి కదలివచ్చాడు. వేంకటాచలం తనకు అనుకూలమైన ప్రదేశమని నిశ్చయించుకొన్నాడు. స్వామిపుష్కరిణీతీరంలో దక్షిణ భాగమందలి తింత్రిణీవృక్షచ్ఛాయలలోని వల్మీకంలో శ్రీనివాసుడు నివాసం యేర్పరచుకొన్నాడు. వైకుంఠంనుండి వేంకటాచలానికి వచ్చి వల్మీకంలో నెలకొన్న శ్రీనివాసునిచరిత్రను భవిష్యోత్తర పురాణం ప్రకటిస్తోంది.

భృగువు పరీక్షమూలంగా భూలోకమందలి వేంకటాచలంపై వల్మీకంలో శ్రీనివాసుడు వర్షసహస్రాలు కాలం గడిపాడు. లక్ష్మీ వియోగంతో, ఆకలిబాధతో పరితపిస్తూన్న శ్రీనివాసుని పరిస్థితిని బ్రహ్మదేవుడు గ్రహించాడు. కైలాసానికి వెళ్ళి పరమశివునితో డ్కోని కరవీరపురంలో లక్ష్మీని దర్శించాడు. ఆమెకు శ్రీనివాసుని పరిస్థితిని నివేదించాడు. లక్ష్మీదేవి గోపాలికగా మారింది. బ్రహ్మ ఆవుగా, శివుడు దూడగా మారారు. ఆ గోపాలిక గోవత్సాలను చోళరాజునకు విక్రయించి కరవీరపురానికి కదలిపోయింది. మేతకు వేంకటాచలానికి వెళ్ళిన ఆగోవు శ్రీనివాసునకు తన పాలధారలతో కడుపునింపేది. ఆవు రాత్రిపూట పాలివ్వకపోవడంవలన చోళరాజు భార్య గోపాలకుని శిక్షించింది. మరునాడు గోపాలకుడు ఆవును వెంబడించాడు. ఆవు పుట్టలో తనపొదుగులోని పాలను ధారవిడవడం చూచాడు. గోవుపైకి గొడ్డలి ఎత్తాడు. గోరక్షణకై, ధర్మరక్షణకై శ్రీనివాసుడు వల్మీకం నుండి బయటకువచ్చాడు. గోపాలకుని గొడ్డలిదెబ్బవలన శ్రీనివాసుని తలకు గాయమైనది. ధర్మగ్లానిని నివారించడానికై ఆత్మగ్లానిని ఆహ్వానిస్తూ వల్మీకగతుడైన శ్రీనివాసుడు ఆవిర్భవించాడు. అధర్మవర్తనానికి కారకుడైన గోపాలకుడు మూర్ఛపోయాడు. చోళరాజు శాపగ్రస్తుడయ్యాడు. పిశాచరూపంధరించాడు. ఆవిధంగా అధర్మాన్ని నిర్మూలించడానికి, ధర్మాన్ని నెలకొల్పడానికి ఆది ఆద్యుడు అవనిపై అడుగు ముందుకువేసాడు. వేంకటేశ్వరావతార స్వరూపుడై, స్వయం వ్యక్త అర్చావతార స్వరూపుడై ఆవిర్భవించాడు.

శ్రీనివాసుని శాపంమూలంగా పిశాచరూపం ధరించిన చోళరాజు శాపవిమోచనం కల్పించమని భగవానుని ప్రార్థించాడు. "నీవు ఆకాశరాజువై జన్మిస్తావు. పద్మావతి నిచ్చి వివాహంచేస్తావు. కల్యాణ సమయంలో నాకు కిరీటం కానుకగాసమర్పిస్తావు. నేనుదాన్ని ప్రతి

శుక్రవారం సాయం సంధ్యాసమయంలో ధరిస్తాను. నీవు ఆకాశరాజుగా జన్మించడానికి ముందు నీపిశాచరూపం పోతుంది" అని శ్రీనివాసుడు చోళరాజును అనుగ్రహించాడు. అట్టి భక్తానుగ్రహం చోళరాజునకే గాక కలియుగమానవులకు కల్పించడానికై శ్రీనివాసుడు అర్చావతార స్వరూపుడుగా ఆవిర్భవించాడు.

పూర్వం వసువనే కిరాతుడు వేంకటాచలంపై నివసించేవాడు. వసువు భార్య చిత్రవతి. కుమారుడు వీరుడు. ఆ కిరాత దంపతులు శ్యామాకతండులాలు వండి శ్రీనివాసునకు నివేదించి భుజించేవారు. ఆ దంపతులు శ్యామాకాలను ఆరబెట్టి కుమారుని కాపుఉంచి తేనెను సేకరించడానికై అరణ్యంలోనికి వెళ్ళారు. వీరుడు శ్యామాకతండులాలను వండి స్వామికి సమర్పించి తాను భుజించాడు. తేనె తెచ్చిన ఆ దంపతులు కుమారుడు అకార్యం చేసాడని భావించారు. అన్నం శ్రీనివాసునకు నివేదించలేదని ఆగ్రహం అదుపుచేసికొనలేక కత్తితో బాలుని కుత్తుక ఉత్తరించపోయాడు. స్వామి అవతరించి కిరాతునిపుత్ర హత్యాప్రయత్నంనుండివిరమింపజేశాడు. "వీరుడు బాలుడు. నా గుడి జాడ వాడికి తెలియదు. చెట్టుక్రింద నాకు నివేదించాడు. నేను ఆరగించాను. నీ కన్న నీ కుమారుడు ఎక్కువ భక్తుడు" అని భగవానుడు చెప్పాడు. దేవుని రూపాన్ని చూసి, పలుకులువిన్న వసువు ఆశ్చర్య చకితుడయ్యాడు. అవ్యక్తమైన ఆనందం పొందాడు.

కొంతకాలం గడచింది. తొండమానుడు వేటకువచ్చి ఒకపంచ వర్ణశుకాన్ని చూచాడు, దాన్ని పట్టుకోవాలని దాని వెనుక రాజు పరుగెత్తడాన్ని వసువుచూచాడు. "మహారాజా! శ్రీనివాసుని పెంపుడు చిలుక అది. దేవునిపేరు పలుకుతూ పగలంతా తిరిగి రాత్రి శ్రీనివాసుని చేరుతుంది. ఆచిలుక ఎవ్వరికి దొరకదు. విఫలయత్నం విరమించడం మంచిది. సాయంత్రం మవుతోంది. నాకుమారునితో నా

కటీరంలో మీరుంటే నేను శ్రీనివాసుని దర్శనం కావించుకొని వస్తాను" అని కిరాతుడు చక్రవర్తికి చెప్పాడు. తొండమానుడు స్వామిని చూడాలని కుతూహలపడ్డాడు. వారు శ్రీ స్వామిపుష్కరిణిలో స్నానంచేసి శ్రీనివాసుని దర్శించి, సేవించారు. చైత్రశుద్ధనవమినాడు తొండమానుడు రేణుకాదేవి వరానుగ్రహపాత్రుడయ్యాడు. రేణుకాదేవి తన దేవీవసంలో రాజధానీనగరం నిర్మిస్తావని తొండమానుని దీవించింది.

వసువు తానుపొందిన దైవాదేశం రాజుకు నివేదించాడు. శ్రీ వరాహ శ్రీనివాసులకు దేవమందిరాలు నిర్మింపమని కోరాడు. ఆనాటి రాత్రి నిద్రించినరాజునకు శ్రీనివాసుడు కలలో తనకొండకు బిలమార్గం చూపించాడు. మరునాడు అది చూచి ఆ బిలమార్గం తన అంతఃపురంలో ఉండేవిధంగా సప్రాకారంగా ఒకపట్టణాన్ని రాజు నిర్మించ సంకల్పించాడు. శ్రీనివాసుడు తొండమానునకు "ఈ తింత్రిణీ వృక్షం నా ఆవాసం. ఆ చంపకవృక్షం లక్ష్మీనివాసం. వానిని రక్షింపుము. నా స్థానానికి ద్వారగోపురప్రాకారాలు నిర్మింపుము. నీవంశానికి చెందిన నారాయణుడనేరాజు నాకు స్వర్ణ విమానం నిర్మిస్తాడు" అని ఆదేశించాడు. తొండమానుడు స్వామికి మందిరం నిర్మింపజేసి, దానిలో స్వామివారిని అంగరంగవైభవాలతో ప్రతిష్ఠింపజేసాడు. నిత్యం బిలమార్గంద్వారా తిరుమలచేరి స్వామికి సమార్చనలు కావించేవాడు. వరాహపురాణంవలన తొండమానుడు శ్రీనివాసుని అర్చావతార మూర్తిని ప్రతిష్ఠించిన వివరాలు తెలుస్తున్నాయి.

శ్రీనివాసుడు పద్మావతిని పరిణయమాడిన కొంతకాలానికి ఆకాశరాజు మృతుడయ్యాడు. వసుదానునకు తొండమానునకు మధ్య రాజ్యం విషయమై యుద్ధం సంభవించింది. వసుదానుడు శ్రీనివాసునకు

బావమరది. తొండమానుడు పినమామగారు. శ్రీనివాస దాసు. స్వామి వారు తొండమానునకు శంఖుచక్రాలనిచ్చాడు. తాను వసుదానుని పక్షం వహించాడు. ఇరువర్గాలమధ్య పోరు తీవ్రతమంగా సాగింది. తొండమానుడు చక్రప్రయోగం చేసాడు. చక్రి చక్రాన్ని ఆపాడు. ఫలితంగా స్వామిసిల్లి పడిపోయాడు. పద్మావతి శీతలోపచారాలు కావించి శ్రీనివాసుని యథాస్థితికి తెచ్చింది. పద్మావతి, అగస్త్యుల ప్రార్థనలు మన్నించి ఉభయులకు సంధి కావించాడు. రాజ్య, కోశ, దండ, దుర్గాలను వారికి సమంగా పంచి వారిలో సౌమనస్యం సృష్టించాడు. తొండరాజ్యాన తొండమానుని, నారాయణపురాన వసుదానుని రాజులుగా ప్రతిష్ఠించాడు. పద్మావతితో శ్రీనివాసుడు అగస్త్యుని ఆశ్రమంలో ఉన్నాడు.

కొంతకాలం పిమ్మట తొండమానుడు శ్రీనివాసుని దర్శింప వచ్చాడు. శ్రీనివాసుడే తనకు ఏకైకప్రాప్యుడని, అట్టి శ్రీనివాసునకు తనసర్వస్వం, సమర్పించుకొని సేవించాలని స్థిరసంకల్పం కావించుకొన్న శ్రీనివాసభక్తుడు తొండమానుడు. "మీఅన్న నన్నొక ఇంటివాణ్ని చేసాడు. నీవొక ఇల్లు నాకు కట్టించి ఇవ్వాలి" అన్నాడు శ్రీనివాసుడు తొండమానునితో. తొండమానుడు తనకు మహాభాగ్యం కలిగిందని సంబరపడ్డాడు. శ్రీనివాసుడు స్థలనిర్దేశం, నిర్మాణపథకం రాజునకు వివరించాడు. తొండమానుడు శ్రీ స్వామిపుష్కరిణికి దక్షిణభాగంలో దివ్యమైన దేవాలయం నిర్మించాడు. రెండుగోపురాలతోను, మూడు ప్రాకారాలతోను, సప్తద్వారాలతోను, ధ్వజస్తంభంతోను దివ్య ప్రభలు ప్రసరించే అపూర్వమైన, అతిమనోహరమైన, అద్భుతమైన భవనం శ్రీనివాసునకు తొండమానుడు నిర్మించాడు. ఆస్థానమండపం, యాగమండపం, గోశాల, తైలశాల, భక్ష్యశాల, భూషణశాల, ధాన్య

భవనం, ఘృతభవనం, మాలాగృహం, వస్త్రగృహం, పరిమళద్రవ్య గృహం ఆదిగాగల వివిధోపగృహాలను ఆ దేవాలయప్రాంగణంలో నిర్మించాడు. మహోన్నతమైన, రత్నఖచితమైన, స్వర్ణమయమైన, సువర్ణకలశయుక్తమైన ఆనందనిలయవిమానం నిర్మించాడు.

నిర్మాణకార్యక్రమాలు నిర్విఘ్నంగా నిర్వహించినపిమ్మట తొండమానుడు శ్రీనివాసుని సమీపించాడు. సాగిసాష్టాంగనమస్కారం చేసాడు. సముచితమైన సకలనిర్మాణాలు సిద్ధమయ్యాయని నివేదించాడు. ఆనందనిలయవిమానం అలంకరింపమని ఆహ్వానించాడు. శ్రీనివాసుడు సుప్రసన్నుడై ఆమోదించాడు. పద్మాసనంలోఉన్నా పద్మావతిని శ్రీనివాసుడు తనవక్షస్థలంలో నిలుపుకొని పదిలపరచుకొన్నాడు. శంఖుచక్రాలు భక్తునిరక్షణకు అనుగ్రహించవలసినవే కాని తాము ధరించవలసినవి కావని స్వామి నిర్ణయించుకొన్నాడు. అందుకే వానిని స్వామి ధరించలేదు. దక్షిణహస్తంతో — వరదహస్తంతో తనపాద పద్మాలను సేవించుమనే సందేశం భక్తులకందిస్తూ, వామహస్తాన్ని కటిపైని నిలుపుకొని ఆనందనిలయంలో పద్మపీఠంపై అవతరించాడు.

"కటిన్యస్తకరేణాపి నజపాదాబ్జ గామినామ్
నృణాం భవపయోరాశిం కటిదఘ్నం ప్రదర్శయన్
విరాజతే వేంకటేశః సంప్రత్యాపి రమాపతిః"

— భవిష్యోత్తర పురాణం

మానవులకు తనపాదసేవవలన సంసారసాగరం కటిదఘ్నం కాగలదని సూచిస్తూ అభయముద్రాలంకృతుడై శ్రీనివాసుడు ఆనందనిలయంలో నిలిచాడు. దేవతలు పుష్పవృష్టి కురిపించారు. ఇంద్రాది దేవతలు నతమస్తకులై నిలిచారు. అష్టదిక్పాలకులు కైవారాలు కావించారు. సప్తఋషిపుంగవులు వేదగానం చేసారు. బ్రహ్మ

దేవుడు శ్రీనివాసుని పాదాలను సేవించాడు. కలియుగాంతంవరకు వెలుగుతూ దివ్యకాంతులు ప్రసరించే రెండు అఖండజ్యోతులను గర్భాలయపురోభాగంలో నెలకొల్పాడు. యుగాంతంవరకు కలియుగమానవులను ఉద్ధరిస్తూ ఆనందనిలయవిమానం అలంకరించవలసిందని శ్రీనివాసుని బ్రహ్మ అర్థించాడు. ధ్వజారోహణంతో ప్రారంభమై రథారోహణంతో సమాప్తమయ్యే వాహనయుక్తమైన ఉత్సవం కావింపుమని శ్రీపతి వాణీపతిని ఆదేశించాడు. బ్రహ్మదేవుడు శ్రీనివాసునకు విధి విధానంగా బ్రహ్మోత్సవం కావించాడు.

ఆవిధంగా ఆనందనిలయంలో ప్రవేశించి, బ్రహ్మోత్సవంపొందిన స్వామి భక్తులకు ప్రత్యక్షదర్శన, సంభాషణభాగ్యాలు అనుగ్రహిస్తున్నాడు. కూర్మశర్మ అనే బ్రాహ్మణుడు కాశీయాత్రకు ప్రయాణం సాగిస్తూ తనభార్య మహాలక్ష్మిని, కుమారుడైన రాఘవుని రక్షణ, పోషణభారాలను వహించుమని తొండమానునికోరి యథాప్రకారం యాత్రకు వెళ్ళిపోయాడు. రాజు వారికి ఆరునెలలకు సరిపోయే ఆహార పదార్థాలు, ఇతర అవసరపరికరాలను సమకూర్చి కూర్మునికుటుంబాన్ని ఒకగృహంలోపెట్టి జాగ్రత్తగా తాళంవేయించాడు. రాచకార్యభారంమూలంగా వారిమాట మరచిపోయాడు. కాశీయాత్ర కావించుకొనివచ్చి కూర్ముడు తన భార్యాబిడ్డలను చూపుమని రాజును అడిగాడు. విప్రునితో అతని భార్యాబిడ్డలు వేంకటగిరికి వెళ్ళారని చెప్పాడు. తొండమానుడు తన కుమారుని వారి విషయం విచారించను పంపాడు. అతడు మరలివచ్చి వారి అస్థిపంజరాలు ఆగృహంలో ఉన్నాయని చెప్పాడు. బిలమార్గంద్వారా శ్రీనివాసునిసమీపించి, సేవించి, విషయం వివరించి, రక్షింపుమని తొండమానుడు ప్రార్థించాడు. భక్తవత్సలుడు, కరుణాంతరంగుడైన శ్రీనివాసుడు వారి అస్థులను అస్థిసరస్సునముంచి సజీవులనుకావించి, తొండమానుని రక్షించాడు.

"ఇంక నేను మౌనంవహిస్తాను. ఏకాంతజనంతో మాత్రమే సంభాషిస్తాను. కలియుగంలో పరుల ముఖతః మాట్లాడతాను. కలియుగ మానవులను కటాక్షించడంకోసం, రక్షించడంకోసం ఈ ఆనంద నిలయవిమానంలో అర్చావతారమూర్తిగా నిలచిపోతాను" అని శ్రీనివాసుడు తొండమానునకు తన భావిప్రణాళికను వివరించాడు. భవిష్యోత్తర పురాణంవలన ఈవిధమైన శ్రీనివాస ఆవిర్భావకథ తెలుస్తోంది.

## మహాభారత గాథ

వ్యాసభగవానుడురచించిన మహాభారతమందలిమౌసలపర్వంలో పంచమాధ్యాయంలోని కథ శ్రీనివాసుడు కలియుగంలో దివినుండి భువికి దిగివచ్చి అవతరించడానికి హేతువును తెలిపింది. శ్రీకృష్ణుడు తన అవతారం ఉపసంహరించుకొంటున్నప్పుడు తన దివ్యసౌందర్య స్వరూపం దేవతలకు, ఋషులకు ప్రకటించాడు. కలియుగమానవులకు అర్చావతారపూజ అత్యావశ్యకమని ప్రకటించాడు. పరమప్రయోజనకరమైనదని ప్రవచించాడు.

"రామావతారసమయంలో వాలిని చెట్టుచాటునుండి సంహరించాను. ఆనాటి వాలి 'జర' అనే బోయవానిగా జన్మించాడు. నా అరకాలిని బాణంతో జర కొడతాడు" అని శ్రీకృష్ణుడు బ్రహ్మదేవునకు తన నిర్యాణహేతువు చెప్పాడు. దూర్వాసుడు శ్రీకృష్ణునకు ప్రాణభయం అరకాలివల్ల వస్తుందని చెప్పాడు. సాంబునికడుపున రోకలి పుట్టింది. దానితో యాదవకులానికి ముసలం వచ్చింది. బలరాముడు తపోవనానికి వెళ్ళాడు. శ్రీకృష్ణుడు ఆవిషయంవిని తానుకూడ తపస్సు కావించుకోవడానికి అరణ్యానికి వెళ్ళాడు. పరున్న కృష్ణుణ్ని మృగమనుకొని బాణంవేసి జర కొట్టాడు. శ్రీకృష్ణపరమాత్ముడు తేజోవంత

మైనరూపంతో సూర్యమండలం అధిగమించాడు. ఆ సమయంలో బ్రహ్మాది దేవతలు ఆ పరంజ్యోతిస్వరూపుని ప్రార్థించారు. "మీరు ముందుచూచినరూపంతో భూలోకంలో శిలావిగ్రహరూపంలో అర్చావతారస్వరూపంలో ఆవిర్భవిస్తాను. నేను కలియుగేశ్వరుడను. ఆ యుగంలో నేనే శక్తిసంపన్నుడను. మీరు కావించే సేవలు, పూజలు, అర్చనలు ఆశిలారూపానికి, ఆ అర్చాస్వరూపానికిచెయ్యండి" అని శ్రీకృష్ణుడు ప్రార్థించిన బ్రహ్మాది దేవతలను అశరీరవాణిరూపంలో ఆదేశించాడు.

శ్రీకృష్ణావతార సమాప్తసమయంలో ఏదివ్యరూపం బ్రహ్మాది దేవతలకు ప్రకటించాడో ఆరూపంతోనే కలియుగారంభంలో తిరుమలపై ఆవిర్భవించాడు. భుజములనుండి బాహుమూలాలవరకు ధనుర్బాణాలు ధరించిన గుర్తులతో, దక్షిణవక్షస్థలంలో శ్రీదేవితో శంఖచక్రాది ఆయుధాలు ధరించకుండా శ్రీనివాసుడు ఆవిర్భవించాడు. ఏ వేంకటాచలంపై దేవతలకు, ఋషులకు, తపోధనులకు తీవ్రతమమైన తపస్సు కావిస్తేగాని యే శ్రీనివాసుడు ప్రత్యక్షంకాలేదో, ఆ శ్రీనివాసుడే కలియుగమానవుల తరణోపాయంకోసం, భక్తులరక్షణ కోసం, ప్రజలపాపాలు హరించడంకోసం, ఆపదలు బాపడంకోసం, సిరులివ్వడం కోసం సర్వజనసులభుడై అందరికి అందే అర్చావతారస్వరూపుడై ఆ వేంకటాచలంపై నే అవతరించాడు. స్వయంవ్యక్తస్వరూపుడై ఆవిర్భవించాడు. ఇది శ్రీనివాసవైభవం! ఇది శ్రీనివాస అవతారవైభవం! ఇది శ్రీనివాస ఆవిర్భావ వైభవం!

"ఆ మూరితియే యీామూరితి అందునిందు భేదములేదు
సోమార్క నేత్రుండ విశ్వరూపములు చూచినవారమే
మునుయేము

బలిమితోడ వత్సాపహారణమున బ్రహ్మకుని మాయచూపితివి
విలసిల్లంగ రణభూమిని నరునకు విశ్వరూపమటు చూపితివి
అలరిని నీరూపు జలమధ్యంబున అక్రూరునకట జూపితివి
చెలంగి కుమారస్వామికి నారూపు శ్రీవేంకటగిరిం జూపితివి

దైవికముగ దుర్యోధను సభను ప్రతాపము నీరూపు చూపితివి
ఆవిధమున నే నీరూపము దక్షు నాశ్రమమున నటు చూపితివి
నీవిధ మెఱంగని భీష్మకు నీకు మఱి నిర్మలరూపము చూపితివి
శ్రీవేంకటగిరి నారూపంబె చేరి పురుషులకుం జూపితివి

పుట్టినపుడె వసుదేవునకు చతుర్భుజములని రూపు చూపితివి
జట్టిగ గొల్లెతలకు రూపము రాసక్రీడలలో జూపితివి
యిట్టె నారదునకు ద్వారకలో యింటింట నీరూపు చూపితివి
పట్టుగ శ్రీవేంకటేశ్వర ఆరూపమె మాకిపుడు చూపితివి"

— అన్నమాచార్య అధ్యాత్మ సంకీర్తన



# మంగళాశాసనం

"ఇలువేల్పితడే యిందరికిని మరి
పలువేల్పులతో పని యిక నేలా?
కమలారమణుని కరుణే కాదా
అమరులు గొనియెడి యమృతము
అమితపు శ్రీహరి యాధారము గాదా?
నెమకెటి ప్రాణులు నిలిచిన భూమి
దనుజాంతకు బొడ్డు తామెర కాదా?
జననకారణము సర్వమునకు
మనికై హరిసతి మహిమే కాదా?
నినుపై భువిలోనిండిన సిరులు
యితనికోడుకు రచనింతా కాదా?
సతులపతుల సంసారరతి
గతి శ్రీవేంకటపతి లోకమె వు
న్నతి వైకుంఠపు నగరముక్తి"

— శ్రీ అన్నమాచార్య అధ్యాత్మ సంకీర్తన

## పౌరాణిక స్తుతి

శ్రీనివాసుడు కలియుగేశ్వరుడు. దోషదూషితమైన కలియుగం శ్రీవేంకటేశ్వరుని అర్చావతారవిశేషం వలన భక్తులపాలిట కల్పతరువుగా, కామధేనువుగా వరాల ననుగ్రహిస్తోంది. శ్రీనివాసుని అర్చావతారాన్ని చూచినవారికి, సేవించినవారికి, స్మరించినవారికి సూక్ష్మంలో మోక్షంసిద్ధిస్తుంది. అందుకే ఋగ్వేదం వేంకటగిరిని, వేంకటగిరినాథుని స్తుతించింది. వేదవ్యాసుడు తనురచించిన పదునెనిమిది పురాణాలలో పన్నెండు పురాణాలలో శ్రీనివాస వైభవాన్ని పరిస్తుతించాడు. హరివంశ, శ్రీమద్భాగవతం శ్రీహరి సంకీర్తనం కావించాయి. బ్రహ్మాది

దేవతలు, ఇంద్రాది అష్టదిక్పాలకులు, అత్ర్యాది సప్తఋషులు, సనకాదియోగులు, శుకాదిమునీశ్వరులు, సర్వులు శ్రీనివాసుని దర్శనభాగ్యంకోసం తపించిపోయారు. స్వామివారి దివ్యమంగళ విగ్రహ దర్శనభాగ్యం పొందినవారు నతమస్తకులై పలువిధాలుగా స్తుతించారు.

"జయ దేవ జగన్నాథ సర్వలోకైక వందిత
జయ వేంకట శైలేశ కరుణాకరపాహినః
త్వాం నమామో వ్యయం విష్ణో వేంకటాచలనాయక
అస్మాకం వాంఛితం దత్త్వా పాహిపాహి జగద్గురో"

(వరాహపురాణంలో - బ్రహ్మరుద్రాదులు)

"ప్రసీద పరమోదార ప్రసీద త్వం శ్రియోజ్జ్వల
ప్రసీద పరమానంద ప్రసీద సుముఖోజ్జ్వల"

(వరాహపురాణంలో - బ్రహ్మ)

"విష్ణో తవైవ తద్బహుబాహుశాఖం
తమాలవదనం బహువక్త్ర నేత్రమ్
జ్వలత్కిరీటై బహురత్నవద్భి
ర్జాజ్వల్యమానం ప్రణమామి రూపమ్"

(వామనపురాణంలో—శివుడు)

"ఓం నమో వేంకటేశాయ శేషాద్రినిలయాయ చ
సింహాచలనివాసాయ శ్రీమన్నారాయణాయ చ
కేశవాయ నమో నిత్యం వాసుదేవాయతే నమః
హృషీకేశాయ మహతే వామనాయ నమోనమః"

(వరాహపురాణంలో-ఇంద్రుడు)

"అహోభాగ్య మహోభాగ్య మహోభాగ్య మహోమహత్
వేంకటేశం కృపాసింధుం దృష్టావానస్మి సాంప్రతమ్"

(మార్కండేయపురాణంలో-కుమారస్వామి

"నమోనమోస్తు విశ్వాత్మన్ త్వం బ్రహ్మాత్వం పినాకధృక్
చంద్రేంద్రార్కాశ్వి మరుతస్త్వమేవ జగతః పతే
సహస్రాదిత్య సంకాశ చక్రహస్తాయతే నమః
శంఖహస్తాయతే నిత్యం నమోవిష్ణో మహాత్మనే
నమః కిరీటినే నిత్యం నమః కౌస్తుభధారిణే
నీలమేఘప్రతీకాశవపుషే బ్రహ్మణే నమః
అసిరత్న గదాచాపశక్తి తోమరపాణయే
ప్రదీప్తాయుధ జాలాయ ప్రదీప్త వపుషే నమః"

(సప్తఋషికృత శ్రీనివాసస్తుతి-వామనపురాణం)

"వైకుంఠధామ విష్ణోత్వం జగతామాదికారణమ్
నమామి త్వాం జగద్రూపం నమామి త్వా మసంగినమ్"

(సనకాదికృత శ్రీనివాసస్తుతి-వరాహపురాణం)

"జితంతే పుండరీకాక్షాయ వాసుదేవమితద్యుతే
రోగాదిదోష విముక్త సమగ్రగుణమూర్తయే
ప్రసీద భగవాన్ విష్ణో ప్రసీద పురుషోత్తమ
ప్రసీద పుండరీకాక్ష ప్రసాదాదాత్మసాత్కురు"

(శుకకృతి శ్రీనివాసస్తుతి-పద్మపురాణం)

"నమస్తే యజ్ఞరూపాయ యజ్ఞభోక్త్రే నమోనమః
యజ్ఞకర్త్రేన్ నమోయజ్ఞ ప్రియాయచ నమోనమః."

(అగస్త్యుని శ్రీనివాసస్తుతి-వరాహపురాణం)

"నమస్తుభ్యం మహాదేవ నారాయణ! కృపానిధే
పాహిమాం ఫణిశైలేశ భక్తబంధో దయానిధే
న జానే వేంకటాచలాధీశ లక్ష్మీనాయక కేశవ
త్వాం వినా సర్వలోకానాం దృష్టాదృష్ట్య ఫలప్రదమ్

యస్యోరస్యనిశం విభాతి జగతీ భాగ్యధాత్రీ రమా
ధత్తే యస్య పదావనేజనజలం మూర్ధ్నా పురారిః సదా
శ్రీమద్వేంకటశైల నిత్యనిలయం దేవోత్తమం త్వాం వినా
దృష్టాదృష్ట ఫలప్రదం కిమపరం దృష్టం క్షితౌ దైవతమ్".

(అరుంధతీకృత శ్రీవేంకటేశ్వరస్తుతి-గరుడపురాణం)

"త్వదీయంధామ వైకుంఠం నిరాపాయం నిరాకులమ్
సర్వప్రాణాధారం పరానందం వక్తవ్యం కిమతః వరమ్."

(దశరథుని శ్రీపతిస్తుతి-వరాహపురాణం)

"పాహిమాం వేంకటాధీశ ప్రణతార్తి ప్రభంజన
ఆత్మబంధో కృపాసింధో సతతం తే నమో నమః
నారాయణాద్రి కృతవాస హరే నమస్తే
నారాయణాఖిల జగత్పతయే నమస్తే
కారుణ్యపూర్ణ కమలాపతయే నమస్తే
కంజాక్షరక్ష కమనీయతనో నమస్తే."

(మార్కండేయుని శ్రీవేంకటేశ్వరస్తుతి-
మార్కండేయ పురాణం)

"నమస్తే దేవదేవేశ పురాణ పురుషోత్తమ
శ్రీధరానంత గోవింద జిష్ణవే విష్ణవే నమః".

(వాయుదేవుని శ్రీనివాసస్తుతి-వామనపురాణం)

"దేవదేవ జగన్నాథ ప్రసీద పురుషోత్తమ
పరిపాలయ మాం భక్తశరణాగత వత్సల."

(నారాయణ విప్రుడు-బ్రహ్మాండపురాణం)

"హోతవ్యం త్వం పావకానస్తు హోతా
హోతాచత్వం పావకోఽపి త్వమేవ

ఉద్దేశస్త్వం సిద్ధిరస్య త్వమేవ
త్వత్త్వః కిం చిన్నాన్యదత్రాస్తి దేవ"
(చక్రవర్తి-బ్రహ్మాండపురాణం)

"నమస్తే కమలాకాంత నమస్తే సుఖదాయినే
శ్రితార్తినాశినే తుభ్యం భూయో భూయో నమోనమః."
(భద్రమతి—స్కంధపురాణం)

"భక్తప్రియాయ దేవాయ దేవానాం పతయే నమః
ప్రణతార్తివినాశాయ శ్రీనివాసాయతే నమః."
(పద్మనాభుడు-స్కంధపురాణం)

"దయానిధే దయానిధే దయానిధే దయానిధే
నమో నమో నమో నమో నమో నమో నమో నమః.
శ్రీవత్స వక్షసం శ్రీశం శ్రీలోలం శ్రీకరగ్రహమ్
శ్రీమంతం శ్రీనిధిం శ్రీధ్యం శ్రీనివాసం భజేఽనిశమ్."
(దేవశర్మ—ఆదిత్యపురాణం)

"అప్రాకృతశరీరాయ శ్రీనివాసాయతే నమః
అనంతమూర్తయే నిత్య మనంత శిరసే నమః
అనంత బాహవే శ్రీమన్ననంతాయ నమో నమః
సరీసృపగిరీశాయ పరబ్రహ్మన్ నమోనమః."
(తొండమానుడు-భవిష్యోత్తరపురాణం)

ఈవిధంగా బ్రహ్మాది దేవతలు - పుణ్యపురుషులు పరమపురుషుడైన, పరమప్రాప్యుడైన శ్రీనివాసునకు మంగళానుశాసనాలు పలికి పుష్ప నీరాజనాలు అర్పించారు. మంగళప్రదమైన స్తోత్రాలుచేస్తూ మంగళమూర్తియైన శ్రీ వేంకటరమణమూర్తికి మంగళహారతులు సమర్పించారు.

## ఆళ్వార్లు - వేంగడం

పౌరాణిక కాలంనాటి నారద, ప్రహ్లాద, పుండరీకాది భక్తులవలె ఆళ్వార్లు వైష్ణవభక్తాగ్రేసరులు. శైవమందలి అరవైముగ్గురు నాయనారులవలె, జైనమందలి ఇరువదినలుగురు తీర్థంకరులవలె, వైష్ణవ సంప్రదాయంలో పన్నిద్దరాళ్వార్లు ముఖ్యులు. వీరిని భగవత్ప్రతినిధులుగా, భక్తిభావప్రవర్తకులుగా, ప్రపత్తియోగప్రచారకులుగా వైష్ణవులు స్వీకరించారు. వీరు క్రీ. శ. 3-8 శతాబ్దుల మధ్య ఉన్నవారని ఆధునిక చరిత్రకారుల ఉద్దేశం. ఆళ్వారు అంటే పరమాత్మనిధ్యానంలో నిమగ్నమైనవాడని, పరమేశ్వరానుభూతితో మనస్సును నింపుకొని వలిగేవాడని భావం. ఆళ్వార్లు దైవానుభూతి మత్తచిత్తులు. పరమేశ్వరానుభవసంజనిత ఆనందలగ్నహృదయులు. భగవదర్చావిగ్రహ సౌందర్య రసపానమత్తులు. వర్ణాశ్రమధర్మ విభేదాలు పాటింపక భగవదనుభూతిని, పరమేశ్వరసౌందర్య రసానుభూతిని అందరకు అందించిన, సత్వాలను పంచిన నిస్వార్థహరిసేవాపరాయణులు. వీరి దృష్టిలో జీవిత పరమావధి ఎక్కడో పరలోకంలో ప్రాప్తించే ముక్తి కాదు. అది ఇక్కడే, ఇప్పుడే ప్రాప్తమయ్యే శ్రీనివాససేవారూపమైన భక్తి. వారి అనుభవాలను, అనుభూతులను పాశురాలలో రచించి గానంచేసారు. అవే ద్రావిడదివ్యప్రబంధాలు. సుమారు ఇవి నాలుగువేల సంఖ్యలో ఉన్నాయి. వీనిని నాథముని దైవికశక్తితో సేకరించి, సంపాదించి, సంతరించాడు. దీనికి నాలాయిర దివ్యప్రబంధమని పేరు. "ద్రావిడవేద" మన్నదే దీని మరొకపేరు. పొయిగై, పుదత్త, పేయ, తిరుమళిశై, నమ్మ, మధురకవి, కులశేఖర, పెరియ, ఆండాళ్, తొండరడిప్పొడి, తిరుప్పాణ, తిరుమంగై ఆళ్వార్లు క్రమంగా పాంచజన్యం, గద, నందక, సుదర్శన, విష్వక్సేన, కుముద, కౌస్తుభ, గరుడ, భూదేవి, వనమాల

శ్రీవత్స, కార్ముకాంశలతో జన్మించినవారని వైష్ణవుల విశ్వాసం. మొదటి ముగ్గురు ఆళ్వార్లు పాశురశతకాలు రచించారు. వీరు కంచి, మహాబలిపురం, మైలాపూరులకు చెందినవారు. తిరుమలేశ ఆళ్వారు నారాయణ పారమ్యమునుగూర్చి వాదించే గ్రంథాలు రచించాడు. ఇతడూ, కంచిమండలానికి చెందినవాడే. అనాథగా, వేటగానిగా జీవించినవాడు. ఆగమ జైన, బౌద్ధమతాలు నేర్చి వైష్ణవం స్వీకరించాడు.

నమ్మాళ్వారు 'తిరువాయి మొళి' రచించాడు. దీన్ని నాథముని 'సహస్రశాఖోపనిషత్సమాగమం'– 'ద్రావిడవేదసాగరం'. అన్నాడు. శఠకోపయతిగా– పరాంకుశమునిగా ప్రసిద్ధుడైన నమ్మాళ్వారుని 'తిరువాయిమొళి,' నాలాయిరవు మూడవభాగం. పాండ్య దేశమందలి తామ్రపర్ణినదీసమీపానగల కురుకాపురి, ఇతని జన్మస్థానం. ఉదయనంగయార్, కారిమారులు నమ్మాళ్వారు జననీజనకులు. వామన స్వామిని వారుపుత్రుని ప్రసాదింపమని ప్రార్థింపగా విష్వక్సేనుని వీరి పుత్రునిగా జన్మింపమని స్వామి ఆదేశించాడు.

మధురకవి ఆళ్వారు బ్రాహ్మణవంశంలో తిరు 'కొక్కూయిలూరు' గ్రామంలో జన్మించాడు. ఉత్తరదేశయాత్రలు కావిస్తున్నసమయంలో మధురకవి ఒక దివ్యతేజస్సును అయోధ్యలో దర్శించాడు. దాన్ని అన్వేషిస్తూ తిరునగరికి వచ్చాడు. చింతచెట్టు తొర్రలోని నమ్మాళ్వారునుండి ఆ తేజస్సు ప్రసరించడం గమనించాడు. నమ్మాళ్వారు కన్నులు లేక చూడడంలేదని భావించి, మధురకవి పెద్దరాతిని నమ్మాళ్వారు ముందుపడవేసాడు. ఆధ్వనికి వారు కన్నులుతెరచి చూచినారు. "చచ్చినదాని కడుపులో పుట్టిన చిన్నది దేనిని తిని ఎక్కడనివసుంది" అని ఒక వేదాంతసంబంధమైన ప్రశ్నను మధురకవి నమ్మాళ్వారు మూగవాడా, మాట్లాడగలడా అన్న సందేహం నివృత్తి చేసికొన

దానికి అడిగాడు. "దాసినే తిని అక్కడే ఉంటుందని" వారు సమాధాన మిచ్చారు. మధురకవి నమ్మాళ్వారునకు శిష్యుడైన మధురకవి ఆళ్వారై ప్రసిద్ధుడయ్యాడు. అన్నామలై కొండలలోని నరసింహ గుహాలయ నిర్మాత 'మారన్ కారి' యే మధురకవి ఆళ్వారని కొందరి ఊహ.

పెరియాళ్వారు, ఆండాళ్ శ్రీ విల్లిపుత్తూరునకు చెందినవారు. విష్ణుచిత్తుడన్నది పెరియాళ్వారు నామాంతరం. వారు వటపత్రశాయి స్వామిని సేవించారు. 'పల్లాండు- పల్లాండు' రచయిత విష్ణుచిత్తుడు. ఆండాళ్ రచన 'తిరుప్పావు.' ఆండాళ్ మధురభక్తికి దృష్టాంతం. కులశేఖరాళ్వారు జన్మస్థానం షోళింగర్. ఇతడు దృఢవ్రతమహారాజు కుమారుడు. సంస్కృతంలో మహాకవి. గొప్పపండితుడు. 'ముకుంద మాల' రచయిత. "శ్రీనివాసా! నీసన్నిధానంలో నీదాసానుదాసుల పాదధూళి వహించేభాగ్యం కల్పించమని" కులశేఖరుడి కోరుకొన్నారట. అందుచేత స్వామివారి గడప "కులశేఖరపడి" గా వ్యవహరింపబడుతోంది. తొండరడిప్పొడి ఆళ్వారే విప్రనారాయణ. శ్రీరంగనాథుని భక్తుడు. "తిరుమందారక్కుడి" అనే గ్రామంలో పుట్టాడు. వైష్ణవకుల సంజాతుడు. విప్రనారాయణ దాస్యభక్తికి ప్రతీకం. తిరుప్పాణి ఆళ్వారు శ్రీనివాసుని దివ్యసౌందర్య సాక్షాత్కారానుభవానికి నిదర్శనం. యురయూరులోని హరిజనదంపతులు ఇతణ్ణి పెంచారు. "లోకసారంగ ముని" ఇతణ్ణి ఎత్తుకొని శ్రీరంగనాథాలయానికి కొనివచ్చాడట. ఇతడు పేముఅల్లే మేదరకులంలో పుట్టినవాడంటారు. తిరుమంగై ఆళ్వారు దేశదిమ్మరిగా ఉండగా శ్రీవేంకటేశ్వరుడు ఇతణ్ణి ఆకర్షించినాడట. ఇతడు సంతరించిన ఆరు తమిళ్‌గ్రంథాలు ద్రావిడవేదానికి షడంగాలుగా ప్రసిద్ధిపొందాయి. తిరుమంగై ఆళ్వారు సంకరించిన

(పరకాలస్వామి, నీలన్) "పెరియతిరుమొళి" "నాలాయిరము" లో ద్వితీయభాగంగా స్థానం సంపాదించుకొంది. ఆళ్వారులు వెంగడం పవిత్రత, అచ్చట వెలసిన స్వయంవ్యక్త అర్చావతారమూర్తి ప్రాముఖ్యంగూర్చి తమ దివ్యప్రబంధాలలో తన్మయత్వంతో వర్ణించారు.

పొయిగై ఆళ్వారు - మంగళాశాసనం

"వెంగడం (తిరుమల)పై వెలసిన విష్ణుమూర్తి తులసిమాలల దివ్యకాంతులతో ఒప్పారుతూంటాడు. భక్తుల లౌకిక పారలౌకిక వాంఛితాలు పూరిస్తాడు. నమ్మినవారికి గతజన్మలలోని పాపకర్మలను నిర్మూలిస్తాడు. పామరులేకాదు వేదవేదాంగాలు చదివినపండితులు కూడ వెంగడాన్ని సేవించి స్వామికి హారతి,జ్యోతి సమర్పించి పుష్పాలు, జలం అర్పించి స్వామివారి పాదాలముందల శిరస్సులుంచి పరతత్వాన్ని గ్రహిస్తున్నారు. పాంచజన్యశంఖం పూరించి అర్జునుని భయం తొలిగించిన స్వామి వెంగడనాథుడు. అతడే ప్రజలకు అభయమిస్తున్నాడు. శ్రీహరి మోహినీ అవతారం దాల్చి అసురుల్ని ఆకర్షించడానికై వెంగడం కొండను ఎన్నుకొన్నాడు. పాలకడలిపై పవ్వళించినస్వామి, భక్తపాలనకై ఈ కొండపై నిలిచాడు. మాయలేడిని పుట్టుపెట్టిన, రావణుణ్ణి తుదముట్టించిన శ్రీరాముని పుట్టుకకు వరం ఈకొండపై ఇవ్వబడింది. అందుచేత ఈకొండ రామునకు ప్రీతిపాత్రమైన కొండ. ఈ వెంగడంపై వెలసినవాడే తన త్రివిక్రమ చారుచరిత్రను చూపిన వామనుడు. శ్రీరాముడు. శ్రీకృష్ణుడు. ఈ వెంగడనాథుడే (శ్రీవేంకటేశ్వరుడే) దేవలోకాలకు అధినాయకుడు. జగన్నాథుడు. ఇతడే వేదవేద్యుడు. ముక్కోటిఏకాదశినాడు ముప్పదిమూడుకోట్ల దేవతల ఆరాధనలు పొందుతాడు. ఆనాడు అసంఖ్యాకంగా భక్తులు సమర్పించే

పూలహారాలు, మంగళహారతులు అందుకొని స్వామి అందరి జీవితాలు మంగళప్రదం కావిస్తాడు. ఈవిధంగా స్వామి వెంగడంపై వెదురుపొదలమధ్య, అడవి జంతువులనడుమ భక్తులకు వరాలివ్వడానికి కొలువై ఉన్నాడు" అని పొయిగై ఆళ్వారు తన 'ముదల్ తిరువందాది'' లో వెంగడాన్ని కీర్తించాడు. వెంగడనాథుని సంకీర్తనంకావించాడు. తన 'ముదల్ తిరువందాది' వందపాశురాలలో రచించాడు. పదకొండు పాశురాలలో ఐదు క్షేత్రాలనుగూర్చి వర్ణించాడు.

## పూదత్తాళ్వారు- మంగళాశాసనం

'ఇరండాం తిరువందాది' రచయిత పూదత్తాళ్వారు. అది వంద పాశురాలుగల శతకం. పదిహేడుగీతాలలో పన్నెండు క్షేత్రాలను గూర్చి వివరించాడు. వానిలో ఎనిమిది గీతాలలో వెంగడాన్ని, వెంగడపు దేవుణ్ణిగూర్చి ఈవిధంగా విశదీకరించాడు. "అత్యున్నతమైనపర్వత సానువులనుండి అతిలోతుగా ఉండే లోయలలోనికి ప్రవహించే కొండవాగుల నిలయం వెంగడం. ఆ కొండవాగుల కిరుప్రక్కలా పూలగుత్తులతో నిండి లతలు వింత ప్రకృతి శోభల్ని వెయ్యింతలు కావిస్తాంటాయి. కొండమీదకోతులు స్వామినిఅర్చించి మరలి వెళ్ళుతున్నాయా అన్నట్లు పూలగుత్తులు పట్టుకొని గుహాలలోకి పరుగెత్తుతుంటాయి. ఆకొండలరాయుడు ఒకపరి శ్రీరామునిగా కనిపిస్తాడు. బాలకృష్ణునిగా ముద్దులొలికే ముంగురులతో మనముందు నిలచి కనువిందుచేస్తాడు. దేవతలు తమ కిరీటకాంతులహారతులు దేవుని పాదాలకు అర్పిస్తారు. దేవతలకు దైవం అతడు. పాదాలచెంత తెల్లనిమల్లి పువ్వుల సరులతో, గళాన తులసి మాలల సువాసనలతో, మేనికి అలదిన చందన చర్చల పరిమళాలతో భక్తుల పూర్వజన్మల వాసనలు తరిమివేస్తాడు, ఆతిరుమలేశ్వరుడు ఈస్వామి ధనవంతుల గర్వం తొల

గిస్తాడు. నిరుపేదలకు బీదతనపు చింతను నిర్మూలిస్తాడు. క్షీరసాగరంపై శయనించే స్వామి, వైకుంఠంలో ఆసీనుడయ్యే స్వామి, శ్వేతరూపంలో పాదయాత్ర చేసేస్వామి నా హృదయంలో నిలిచాడు. వెంగడంపై వెయ్యి నామాలతో పూజలందుకోవడానికి వెలసాడు".

"దివ్యాయుధాలు ధరించే వెన్నుడే ఈ వెంకటేశ్వరుడు. లోకాలోకాల చుట్టుకొలతలు తెలిసిన వామనుడే ఈ శ్రీనివాసుడు. విశ్వమంతా వ్యాపించాడు. విశ్వంలోని ప్రతివస్తువూ తానే అయి ఉన్నాడు. అగ్నిలో, ఆకాశంలో, అష్టదిక్కులలో, జలరాసులలో, జీవకోటులలో, వేదమంత్రాలలో, మానిజనహృదయాలలో అన్నిటా, అంతటా అతడే నిండి ఉన్నాడు. అతడే వెంగడపు కొండకు అధినాయకుడు. హరి అతడే. హరుడతడే, చక్రపాణి- శూలపాణి అతడే! గంగోద్భవ శ్రీచరణుడూ- గంగాధరుడూ అతడే! శేషశయనుడు — శేషభూషణుడు అతడే! కిరీటధరుడు- జటాధరుడు ఈ తిరువెంగడనాథుడే! శ్రీనివాసుడై, అర్చావతార స్వరూపుడై, వెంగడంపై ఆవిర్భవించాడు" అని పేయాళ్వారు వెంగడంగూర్చి వెంగడనాథుని గూర్చి "మూన్రాం తిరువందాది"లో ప్రస్తుతించాడు. వందపాశురాలు గల "మూన్రాంతిరువందాది" లో 19 పాశురాలలో పన్నెండు దైవతామూర్తులను వర్ణించాడు. ఆ 19 గీతాలలో 10 గీతాలను వెంగడపు వర్ణనకు వినియోగించాడు.

## తిరుమలిశై ఆళ్వారు - వేంగడం

తిరుచ్చందవిరుత్తం, నాన్ముకన్ తిరువందాది అనే రెండు ... గ్రంథాలను రచించాడు. వానిలో

వెదురుపొదలతో, లతానికుంజాలతో, ..
లతో, ముత్యాలతో, విలువైనరత్నాలతో, బ్రహ్మరుద్రాది
సమూహాలతో, భక్తజన సంఘాలతో కలకలలాడే కొండ
ఓనమ్ సంబరాన్ని చూడడానికి వెళ్ళాలనుకొన్న నన్ను శ్రీ
నీముందు పిలిపించింది. నీ ముందువాకిలి వైకుంఠద్వారం. అన్ని
నుండి నిన్ను భక్తులు చూడగలుగుతున్నారు. నీపాదాలచెంత
సమర్పించే పుష్పాలు పుష్పాలు కావు. అవి భక్తులను వైకుం
నికి కొనిపోయే పుష్పక విమానాలు."

## నమ్మాళ్వారు-మంగళాశాసనం

'తిరువిరుత్తం', 'పెరియ తిరువందాది', 'తిరువాయి
దివ్య ప్రబంధాలను సంతరించిన కారణజన్ముడు నమ్మాళ్
పాశురాలున్న పెద్ద గ్రంథం "తిరువాయి మొళి." వావి
రాలలో తిరుమలను, తిరుమలేశ్వరునిగూర్చి తన్మయుడై
తిరువాయి మొళిలోని ఆరవశతకమందలి ఆరవదశక
యతి శ్రీ వేంకటేశుని తిరుచరణాలను శరణు పొందా
వెంగడం వెళ్ళాడు. త్రికరణశుద్ధిగా స్వామిని శరణాగ
శ్రీనివాసుని కరగించి, కదలించి, కరుణింపజేసే నమ
గతి అది. ఏభక్తుడైనా నమ్మాళ్వారు మాటలలో
రుని శరణాగతిని పొందాలి. శ్రీ వేంకటనాథుని
మందిరద్వారాల్ని తెరిపించే శరణాగతి పాశురాల
తిరువాయిమొళిలోని మూడవ శతకమందలి మూ
వేంకటాచలాధీశుని ప్రాభవాన్ని ప్రకటించాడు.

లోని మాటలలో తిరుమలదృశ్యాన్ని, తిరుమలేశుని దర్శనాన్ని మనకు ఈవిధంగా చూపుతున్నాడు.

"అదిగో తిరుమల. జలపాతాల- జలధారలగంభీర శబ్దాలప్రతి ధ్వనులతో గంభీరంగా నిలచిన తిరుమల అదిగో! కారణ కారణుడు, దేవతల పూజలందుకొనే ఆదిదేవుడు ఆకొండపై ప్రకాశిస్తున్నాడు. అట్టి తిరుమలేశుని సదా సేవించడమే మనకర్తవ్యం.

నీలిమేఘపు కాంతులీనే ఆనల్లని, చల్లని తిరుమలయ్య దేవతలు పూజించిన పువ్వులను తాను అందుకొని పరిమళాలను తిరుమల అంతా వ్యాపింపజేస్తున్నాడు. నిరంతరం దేవతలు పూజించచే విధంగానే తరతరాలుగా నావారు పూజిస్తున్నారు. నేను, నాసంతతివారం ఆవిధంగానే పూజించాలి.

మనం శిరస్సులు మనస్సులు శ్రీనివాసుని పాదాలమ్రోల నిలిపి గళం గళం కలిపి సేవించి సంకీర్తనం చేయాలి. స్వామి ప్రతిఫలంగా వ్యాధులు, బాధలు, వ్యాధులబాధలు, చావుపుట్టుకలు మనకు నివారిస్తాడు.

శ్రీవేంకటేశ్వరుడు, లేనివారిని అనుగ్రహిస్తాడు. దుర్గుణాలులేని దేవతలను అనుగ్రహిస్తున్నాడు. సుగుణాలులేని నన్ను, నిన్ను, మనల్ని అనుగ్రహిస్తాడు.

స్వామి శ్రీవేంకటగిరి నాయకుడు. వేదగానలోలుడు. వేదవిధులపూజలు అందుకొంటున్నాడు. నిఖిల సద్గుణ పరిపూర్ణుడు. ఆది ఆద్యుడు.

గతంలో చేసిన పాపాలతో, ముందుచేయబోయే పాపాలతో మనం కృంగిపోయాము. కృంగిపోతాము. శ్రీనివాసుని సేవిస్తే మన పాపములు భస్మమవుతాయి. జీవితబంధాల నుండి విముక్తి, శ్రీవేంకటేశ్వరుని పాదసన్నిధిలో ముక్తి సిద్ధిస్తుంది.

శ్రీదేవిని హృదయంలో నిలుపుకొని శ్రీనివాసుడు ఈ తిరుమలపై విహరించి, క్రీడించడంవలన ఈకొండ కొండంత పవిత్రతను సంతరించుకొంది. అందు చేతనే నిత్యం దేవతలు ధూపదీపహారతులతో, అభిషేకాలు అర్చనలు శ్రీనివాసునకు చేస్తున్నారు. స్వామి భక్తుల కాపరిగా ఆకొండపై ఉన్నాడు.

కొండ గొడుగుగాపట్టి గోవుల్ని గోపాలకులను కాపాడిన ఆ గోవిందుడే, బలిని పాతాళానికి పంపి లోకాన్ని కాపాడిన ఆ వామనావతార స్వరూపుడే, మనల్ని ఉద్ధరించడానికి ఈ వేంకటగిరిపై శ్రీ వేంకటేశ్వరునిగా అవతరించాడు.

ఇప్పుడే ఈక్షణంలోనే మనం తిరుమల చేరాలి. శ్రీనివాసుని పాదాలను ఆశ్రయించాలి. ముసలితనం మనల్ని కాలకింకరుల పాలికి తరుమకముసుపే, ముందు చూపుతో శ్రీనివాసనగరికి– శ్రీవేంకటగిరికి వెళ్ళాలి. సాంద్రవృక్షసముదాయంతోనిండిన కొండ ఎక్కాలి. శీతల వాయువులతో, అతిశీతలజలాలతో ప్రవహించే ఆ కొండవాగులతో కూడిన శేషశైల శిఖరాగ్రభాగాన వెలసిన శేషాద్రి శిఖరవాసుని మనస్సుని వేయికన్నులు చేసికొని చూడాలి. ఆ పద్మనేత్రుని, ఆ సుందరవదనారవిందుని, ఆనీలదేవుని, ఆ ఆనంద స్వరూపుని చేరాలి– చూడాలి– స్వామివారి పాదాలపై పువ్వులుజల్లాలి. ఇట్టి భక్తి భావనతో వర్తించే వారి హృదయాలలో ముక్తికాంత నర్తిస్తుంది." ఇది శ్రీనివాసునకు నమ్మాళ్వారు కావించిన భక్తిరస భరితమైన, ప్రపత్తి పూరితమైన మగళానుశాసనం.

## కులశేఖరాళ్వారు ఆకాంక్ష

"ముకుందమాల"ను, "తిరుమొళి"ని రచించడంద్వారా సుప్రసిద్ధుడయ్యాడు కులశేఖరాళ్వారు. కులశేఖరుల "తిరుమొళి"ని "పెరుమాళ్ళ తిరుమొళి" అంటారు. దానిలో 105 పాశురాలున్నాయి. కుల

శేఖరాళ్వారు వెంగడాన్ని గూర్చి ఈవిధంగా ప్రకటించారు.
అదే స్వామి పుష్కరిణి. దానిసరసనే తుంబక చంపకవృక్షాల కల
నిర్మింపబడిన అందమైన కోనెల ఉంది. దానిలో శ్రీనివాసుడు
కొని ఉన్నాడు. స్వామి నిత్యసేవకు బ్రహ్మ, రుద్ర, ఇంద్రా
తలు వస్తారు. స్వామివారికి అర్చకస్వామి నిత్యార్చనలు సలుపు
స్వామివారిని దర్శించి, సేవించడానికి వచ్చేభక్తులు స్వామివారి
ద్వారపు గడపముందు నిలుస్తారు. అట్టి స్వామివారి మందిర
గడపనై నిలచి భక్తులపాదధూళితో పునీతంకావాలన్నదే నా
నా అభిమతం."

పెరియాళ్వారుచేసిన తిరుమలేశ్వరుని తిరుపల్లాండు

పెరియాళ్వారు శ్రీవిల్లిపుత్తూరులోని వటపత్రశ
స్వామిని సేవించి ధన్యుడైన విష్ణుచిత్తుడు. పాండ్యరాజు
శ్రీమన్నారాయణుడే పరమ ప్రాప్యుడని నారాయణుని
నిరూపించాడు. బహుమానంగా బంగారునాణాలసంచి
కొన్నాడు. రాజలాంఛనాలతో గజరాజుపై ఊరేగింప
కొన్నాడు. ఆ ఊరేగింపుసమయంలో గరుడవాహనారూ
భూదేవులతో శ్రీమన్నారాయణుడు విష్ణుచిత్తునకు
ఊరేగింపులో ఏనుగుప్రక్కలను వ్రేలాడుతూన్న గంట
ప్రప్రథమంగా పల్లాండు పాటలు పాడాడు. అతని దివ
నికి ఆ సంఘటన ఆలంబనమైనది. విష్ణుచిత్తుడురచించిన
గల దివ్యప్రబంధం "పెరియాళ్వారు తిరుమొళి"గా ప్ర
యిర ద్రావిడవేదపు ప్రథమభాగంగా స్థానం సంపాదిం
యాళ్వారు ఏడుపాశురాలలో ఏడుకొండలస్వామిని
స్వామి గుణగణాలను కొనియాడుతూ పాడుకొన్నాడు

“జాబిల్లీ! మా బాలకృష్ణునివద్దకు రావాలి. వచ్చావా? దూరం నుండి చూస్తే ఆకాశంలో అందంగా కనిపించావు. మా బాలకృష్ణుని నా ముద్దుల చిన్నికృష్ణుని మోము నీ వదనంకన్న అందంగా ఉంది. అందరిముద్దూ చెల్లిస్తాడు. అందరికోర్కెలు నెరవేరుస్తాడు మా ముద్దు కృష్ణుడు. ఇలా మురిసిపోయింది యశోద బాలకృష్ణుణ్ని చూచి, జాబిలిని పిలిచి. ఆ బాలకృష్ణుడే ఈ వెంగడపు దేవుడు.

బలి వామనునకు మూడడుగులస్థలం దానమిచ్చాడు. వామనుడు త్రివిక్రముడై ఆకాశాన్ని, భూమిని ఆక్రమించాడు. నముచి తండ్రితో వామనుడు వేషంమార్చి మోసంచేసాడని చెప్పి “మూడవ అడుగు స్థలం ఇవ్వద్దు” అన్నాడు. బలి మాట తప్పలేదు. తండ్రిని పాతాళానికి, నముచిని ఆకాశంలోనికి, ఇరువురూ కలవడానికి వీల్లేకుండా పంపించాడు వామనుడు. త్రివిక్రమ చారుచరిత్రుడైన వామనుడే ఈ వెంగడపు దేవుడు.

“కాకమ్మా! మా బాలకృష్ణుడు గోవుల్ని మేపడానికి పొలాలకు వెళ్ళాలి. అతనికొక పుల్ల, గోవుల్ని అదలించడానికి పట్టుకొనిరా, లేకపోతే తెలుసా? శ్రీరాముని బాణంతో ఒక కన్ను పోగొట్టుకొన్నావు ఉన్న ఒక్క కన్నుకాపాడుకో”. ఈవిధంగా యశోద బాలగోపాలునకు పుల్ల తెమ్మని కాకితో చెప్పి సంబరపడింది. ఆ బాలగోపాలుడే. యశోదకథలోని ఆ కోదండరాముడే ఈ తిరువెంగడపు దేముడు.

బాలకృష్ణుడు కాలునిలిపి ఎక్కడా ఉండేవాడు కాదు. గోపికల మందిరాలలోదూరి వారి విలువైన వలువల్ని పాడుచేసేవాడు. ఆ గోపికల్ని నానా ముప్పుతిప్పలు పెట్టేవాడు తన కొంటెపనులతో. ఎక్కడా నిలవని బాలగోపాలుణ్ణి యశోద నిలబెట్టి అతనిముంగురులు ·ంగడాలు కట్టేది. ఎక్కడా నిలవని ఆ బాలకృష్ణుడు

గోపికలు, గోపాలుడు అల్లరివాడని యశోదవద్ద అల్లరి పెట్టారు. వారికి సమాధానాలు చెప్పమని బాలకృష్ణుణ్ణి యశోద పిలిచింది. వారికి సమాధానాలు చెప్పిన ఆ బాలకృష్ణుడే భక్తులను సముదాయించడానికై వేంకటగిరిపై, శ్రీవేంకటేశ్వరుడై వెలసాడు.

"గోపాలుడు నీడపట్టున ఉండడు. ఎండలో అడవులలో తిరుగుతాడు. గొడుగు ఉపయోగించడు. పాదుకలు సరేసరి. పిల్లనగ్రోవి పట్టుకొనిపోతాడు. అసలే నల్లనయ్య. ఎండలో, అడవులలో తిరిగి తిరిగి మరీ నల్లపడిపోయాడు" అని యశోద బాధపడేది. అడవులలో తిరగడానికి అలవాటుపడిన ఆ బాలకృష్ణుడు అడవులతో నిండిన ఏడు కొండలపై శ్రీనివాసుడై ఎక్కి దొరవలె కూర్చున్నాడు.

ఎత్తైన శిఖరాలు - లోతైన లోయలు - పవిత్ర జలధారలు - శుభోదయ శీతలవాయు ప్రసారాలు వీనిమధ్య నీది నివాసం. ఓ శ్రీనివాసా! స్వర్గానికి చేరాలని పాతాళంలోఉన్న నేను నీ పవిత్ర పాదాలను పట్టుకొని ఆశ్రయిస్తున్నాను. నాకు శరణాగతి ప్రసాదింపుము స్వామీ!" ఇదే పెరియాళ్వారు శ్రీనివాసునకు కావించిన పల్లాండు। తిరుమలేశ్వరునకు చేసిన తిరుపల్లాండు।

## ఆండాళ్ చేసిన శ్రీనివాస గానం

ఆండాళ్ "తిరుప్పావు", "తిరుమొళి" రచనలు భక్తులు నిత్యం అనుసంధానంకావించుకొనే పారాయణగ్రంథాలు. తిరుప్పావులో 30 పాశురాలు ఉన్నాయి. పరమేశ్వరుని విభవావతార వైభవం ఆవిష్కరించిన గీతమంజరి తిరుప్పావు. అర్చావతార సౌలభ్యాన్ని. మధుర భక్తిభావంతో ఆండాళ్ 143 పాశురాలున్న "తిరుమొళి"లో కీర్తించింది. ఆండాళ్ "తిరుమొళి"ని "నాంచార్ తిరుమొళి" అంటారు. పదహారు పాశురాలలో శ్రీనివాసుని సంకీర్తించింది. వానిలో

ఆరుపాశురాలు తిరుమొళిలో అక్కడక్కడ ఉన్నాయి. తిరుమొళి ఎనిమిదవ భాగంలో శ్రీనివాసుని దివ్యగానంచేసే పదిపాశురాలు ఒకేచోట ఉన్నాయి. శ్రీనివాసుని తనహృదయేశ్వరునిగా భావించి, తనప్రణయభావాన్ని వానిలో నివేదించుకొంది. ఈవిధంగా ఆండాళ్ తనపాటలలో శ్రీనివాసునిగూర్చి పాడుకొంది.

"ఓ పూవిలుకాడా ! మన్మథమూర్తీ! మార్గళినోము ముగించాను. వాతావరణంమూలంగా శీతలత్వం వచ్చింది. మనస్సులోమంట పోలేదు. శరీరం, మనస్సు వేడిగా ఉన్నాయి. నా ఈపరిస్థితిని శ్రీనివాసునకు నివేదింపవయ్యా పూవిలుకాడా! శ్రీనివాసుడు ప్రేమించే పువ్వులు సమర్పిస్తున్నాను. అయినా శ్రీపతి నన్నుపతిగా స్వీకరించడం లేదు. ప్రతిపువ్వుపైన 'గోవింద' అని చెక్కి బాణాన్నిఎక్కుపెట్టి గోవిందునిపై సంధించవయ్యా! ప్రేమికులజంటలను కలపడమే నీకర్తవ్యం. ఆ కర్తవ్యం విస్మరించకు. కామదేవా! నీవు విఫలుడవయ్యావు. ఓ కోకిలా ! నీవు తిరుమలకు వెళ్ళు. నల్లని విగ్రహంతో తెల్లనిశంఖం పట్టుకొని ఉంటాడు. తియ్యనిపాటలుపాడు. స్వామి వింటాడు. నన్ను వేగమేవచ్చి అనుగ్రహింపమని చెప్పు. అదివిని నాస్వామి నాచెంతకు వస్తాడు. నాకు స్వంతమైపోతాడు. ఓపాడుపక్షీ! చెప్పినపని చెయ్యలేక పోయావా? వెళ్ళు. నీకు గీతాలు పాడడం రాదు. కూతలు కుయ్యడమే నీవిద్య. నీ పక్షిజాతికిచెందిన గరుడుని శ్రీనివాసునివద్దకు తీసుకొని వెళ్ళు. అన్నిప్రయత్నాలు వృథా అయ్యాయి. నీలిమేఘాల్లారా! మీరు నా స్వామికి ప్రణయసందేశం అందించండి. నా హృదయాన్ని శ్రీనివాసుడు తనప్రణయజ్వాలలు కురిపించి కరిగించాడు. నీలిమేఘాల్లారా! వానజల్లులతో స్వామిని చల్లబరచి, నా హృదయాన్ని చల్లబరచడానికి స్వామిని తోడ్కొనిరండి ! మీరంగులోనే తిరుమలపై

ఉంటాను. నా శ్రీనివాసుడు. చల్లని కబురు తెచ్చారా ? నా స్వామి కోసం. స్వామి రాకకోస ఎదురుచూస్తున్నాను. చేతిగాజులు జారి పోయాయి. నివసిక దూరమయ్యాను. బక్కచిక్కిపోయాను. కళ్ళల్లో ప్రాణాలు నిలుపుకొని స్వామిజాడకై ఎదురుచూస్తున్నాను. చల్లని పిల్లవాయువులు పీలుస్తూ, కొండవాగుల్లోని శీతలోదకాలు సేవిస్తూ కొండపై చక్కగా శ్రీనివాసుడున్నాడు. నా గుండెబరువు దింప డానికై కొండపై నుండి దిగి నావద్దకు రావాలి. లక్ష్మిని, తనహృద యంలో నిలుపుకొన్నాడు. నన్ను అలక్ష్యానికి గురిచేస్తున్నాడు. స్వామి బిగికౌగిలికై ఎదురుచూస్తున్నాను. మేఘాల్లారా! మీలో విద్యుత్తు ఉంది. ఆకాంతిలో నాకాంతున్ని గుర్తించండి. ఏకాంతంగా ఎదురు చూస్తూన్న నాచెంతకు చేర్చండి. ఈపుణ్యంకట్టుకోండి. ఉగ్రనరసింహం రూపం ధరించి విజృంభించి, వర్షించండి. దొంగిలించిన నాగాజులు నాకు అందించమని శ్రీనివాసునకు గట్టిగా చెప్పండి. నా పరిస్థితి స్వామికి నివేదించండి. స్వామి కూర్మావతారుడు. కదలనివాడు. వామనావ తారుడు. బహుయుక్తిపరుడు. శ్రీనివాసుడై కొండపై ఉన్నాడు. ఒక్కసారి దయచేస్తేచాలు. ఒకపూట ఉంటే అదే పదివేలు. ఎదురు చూచే మనస్సుతో, కన్నులతో ఆండాళ్ నిలచిందని చెప్పండి. పండు టాకులా నేలరాలిపోవడానికి సిద్ధంగా ఉందని తెలపండి. ఈక్షణంలోనే నాస్వామిని నా శ్రీనివాసుని నన్ను చేరమని విన్నవించండి. నేను అబ లను. స్వామిమాటలను నమ్మి మోసపోయిందనే అపఖ్యాతి స్వామికి [illegible]. నామాటగా ఈమాటను స్వామికి చెప్పండి. శ్రీనివాసుని ఆకొండపై నుండి నాగుండెలోనికి దిగిరమ్మని చెప్పండి. వెళ్ళండి. నీలి మేఘాల్లారా! తిరుమలపైకి వెళ్ళి నామనస్సు తెలుపండి." ఆండాళ్ శ్రీనివాసుని ఆహ్వానించినట్లే ప్రతిభక్తుడు మధురహృదయంతో, శరణాగతి భావంతో తనమనోమందిరంలోనికి స్వామిని రమ్మని స్వాగ

తం చెప్పాలి. ఆండాళ్ పాడిన శ్రీనివాసస్వాగతగీతంతో, సంకీర్తనంతో మనం ఆ శ్రీనివాసుని ఆహ్వానించడం నేర్చుకోవాలి. ఆండాళ్ మనలో అట్టి శ్రీనివాస భక్తిభావతీవ్రతను నెలకొల్పుతుంది.

తిరుప్పాణాళ్వారు మంగళాశాసనం

కనకదాసు, నందనారులవంటివాడు తిరుప్పాణాళ్వారు. "ముని వహనాన్" ఇతనినామాంతరం. శ్రీరంగనాథుని దివ్యదర్శనభాగ్యం లభించడంతో తిరుప్పాణాళ్వారు తన్మయుడై పది పాశురాలుగల "అమలనాదిప్పిరాన్" ఆశువుగా గానంచేసాడు. ఆ పది పాశురాలలో శ్రీనివాస సంకీర్తనం కావించాడు. 1, 3 పాశురాలను శ్రీనివాసునకు అంకితం కావించాడు.

"పరమాత్ముడు పవిత్రులలో మహాపవిత్రుడు. సకల చరాచర జీవకోటిసృష్టికి కారణుడు. అందరకు ఆరాధ్యుడు. నిత్యసూరులకు, స్వర్గలోకజీవులకు అధినాయకుడు. పరమదయాసముద్రుడు. భక్తుల పాలిట అమృతహృదయుడు. ఆతడు సర్వజ్ఞుడు. సర్వవ్యాపకుడు. సార్వభౌములకు సార్వభౌముడు. నాకు భక్తులసన్నిధానం అనుగ్రహించిన వాడు ఆ పరమాత్ముడే. అట్టి అనంతకల్యాణగుణసంపన్నుడైన పరమేశ్వరుడు వైకుంఠంనుండి దిగివచ్చి వెంగడంపై అర్చావతారస్వరూపుడై అవతరించాడు. అట్టి శ్రీనివాసుని పాదాలను ప్రప్రథమంగా దర్శించి సేవించాలి.

తమిళదేశపు ఉత్తరపు సరిహద్దులో వెంగడం ఉంది. ప్రకృతి సౌందర్యానికి మరోపేరు వెంగడం. శ్రీరంగంలోని స్వామి శయన మూర్తి. తిరుమలపై స్వామి నిలచియున్నాడు. మానవులు, ముక్తులు సేవించేక్షేత్రం శ్రీరంగం. ఉభయసంధ్యాసమయాలలో ఎక్కువగా దేవతలు శ్రీనివాసుని సేవిస్తారు. క్రమం తప్పకుండా దేవతలు అభయ

సంస్కారవతు రూలలో తెలుసుకొన్నై ఉంటాయి" అని తిరుప్పాణాళ్వారు తన "అమలనాదిపిరాన్" లో శ్రీనివాసుని స్తుతించాడు. వేంకటా చలాన్ని సంస్తుతించాడు.

## తిరుమంగై ఆళ్వారు మంగళాశాసనం

చివరి ఆళ్వారు తిరుమంగై ఆళ్వారు. తంజావూరు జిల్లాలోని తిరుక్కురైయలూరు ఇతని జన్మస్థానం. ఇతని మొదటిపేరు నీలన్. చోళ చక్రవర్తి వద్ద స్థానిక నాయకునిగా ఉండేవాడు. మహా సౌందర్యవతి యైన కుముదవల్లి అనే వైష్ణవ వనితను గాఢంగా ప్రేమించాడు. వివాహం చేసుకోవాలని నిర్ణయించుకొన్నాడు. దానితో నీలన్ జీవితంలో మొదటి మార్పు వచ్చింది. కుముదవల్లి నీలన్‌ను పరిణయ మాడటానికి కొన్ని నియమాలను విధించింది. నీలన్ వైష్ణవుడు కావా లని, నిత్యం 1008 మంది వైష్ణవులకు సమారాధనం కావించాలని, కుముదవల్లి కోరింది. నీలన్ అంగీకరించాడు. ఫలితంగా యువప్రేమి కుడు ఆర్థికచిక్కులకు లోనయ్యాడు. ప్రభుత్వ ధనం అపహరించి వైష్ణవ సమారాధనం సాగించాడు. కంచి శ్రీ దేవరాజ సహాయం పొంది అపహరించిన రాజద్రవ్యాన్ని సరిపెట్టాడు. భార్యకిచ్చినమాట నిలబెట్టుకొని వైష్ణవసమారాధన కొనసాగించడానికై దారితోచక దారి దొంగగా మారిపోయాడు. నిత్యం దారిదోపిడీలు చేసేవాడు. కొల్లగొట్టిన ధనంతో 1008 మంది శ్రీ వైష్ణవులకు విందు కావించే వాడు.

ఆ సమయంలో నీలన్‌కు శ్రీనివాసుని అనుగ్రహం లభించింది. శ్రీసతి, శ్రీపతి యువదంపతులై ప్రయాణం సాగిస్తున్నారు. నీలన్ ఆ దంపతులను చూచాడు. వారిని కొల్లగొట్టాడు. వారి ఆభరణాలు అప హరించాడు. మూటకట్టిన సొమ్ములు ఎత్తుకొంటున్న సమయంలో నీలన్ ఆ యువకుని కాలిబొటనవ్రేలికున్న వజ్రపుతొడుగు చూచాడు. ఎంత

ప్రయత్నించినా నీలన్‌కు అది లభించలేదు. అతని పాదంపైని ప్రాలి చేతులతో పాదాన్ని గట్టిగా పట్టుకొని నోటితో బొటనవ్రేలు పెట్టుకొని శిష్యసహాయంతో ఆ వజ్రపు బంగారుతొడుగును స్వాధీనం కావించుకొన్నాడు. దానిని మూటలో వేసి ఆ మూటను ఎత్తుకొనడానికి ప్రయత్నించాడు. బలశాలురైన, వారిదొంగలనాయకుడూ ప్రయత్నించి విఫలుడయ్యాడు. "నువ్వు మంత్రవేత్తవు. నీమంత్రపుమహిమవల్ల ఈ బంగారువస్తువులమూటను ఎత్తలేకపోతున్నాము. దీన్ని సులభంగా స్వాధీనంచేసికొనడానికి సంబంధించిన మంత్రం నాకుపదేశించు" మని నీలన్ ఆయువకుణ్ణి అడిగాడు. ఆయువకుడు నీలన్ చెవిలో 'ఓం నమో నారాయణాయ' అనే అష్టాక్షరీ మహామంత్రాన్ని మందంగా వినిపించాడు. అంతే! నీలన్ తిరుమంగై ఆళ్వారుగా మారిపోయాడు. ఆసేతుశీతనగపర్యంతంపర్యటించి 108 దివ్య తిరుపతి క్షేత్రాలలో 85 క్షేత్రాలను సేవించాడు.

"నాలాయిర దివ్య ద్రావిడవేదం" పన్నిద్దరాళ్వారులు సంతరించిన 23 దివ్యప్రబంధాల సంపుటం. పొయిగై, పూదత్త, పేయు, కులశేఖర, పెరియు, తిరుప్పాణా, మధురకవి ఆళ్వార్లు ఒక్కొకరు ఒక్కొక దివ్యప్రబంధం సృష్టించారు. తిరుమలిశై, తొండరడిప్పొడి ఆళ్వార్లు, ఆండాళ్ మూడు దివ్యప్రబంధాలవంతున సంతరించారు. నమ్మాళ్వారు నాలుగు దివ్యప్రబంధాలు అందించాడు. అవి నాలుగు వేదాలసారం. తిరుమంగై ఆళ్వారు ఆరు దివ్యప్రబంధాలు రచించి గానంచేసి సమర్పించాడు. నమ్మాళ్వారు కావించిన మొత్తం పాశురాలు 1296. తిరుమంగై ఆళ్వారు 1361 పాశురాలు రచించాడు. 4000 పాశురాలున్న నాలాయిరములో ఇతని పాశురాల సంఖ్య ప్రథమ స్థానం వహించింది. ఇతని రచనల సంపుటం 'పెరియ తిరుమొళి' గా, నాలాయిరము ద్వితీయభాగంగా ప్రాచుర్యం సంపాదించుకొంది. తిరుమంగై ఆళ్వారు శ్రీనివాస వైభవాన్ని ప్రస్తావిస్తూ,

తిరుమల మహిమను ప్రస్తుతిస్తూ సుమారు 62 పాశురాలు సంతరించాడు. "పెరియ తిరుమొళి" లో 55 పాశురాలలోను, "తిరుక్కుఱుంతాండకం"లో 1 పాశురంలోను, "తిరునెడుం తాండకం"లో 3 పాశురాలలోను, "శిఱియతిరుమడల్" లో 1 పాశురంలోను, "పెరియ తిరుమడల్" లో 2 పాశురాలలోను– ఈవిధంగా 62 పాశురాలలో శ్రీనివాసవైభవం వివరింపబడింది. ఈ 62 పాశురాలలో తిరుమంగై ఆళ్వారు వేంకటాద్రి ప్రకృతి రమణీయతను, వేంకటేశ్వరు వివిధ అవతారలీలలను, స్వామివారి అర్చావతార మహిమను వివిధరీతులలో, భక్తిప్రపత్తి భావంతో, కళాదృష్టితో, కవితాదృష్టిలో గానంచేసి ధన్యుడయ్యాడు.

ద్వాదశాళ్వారులలో పదిమంది ఆళ్వారులు తమ దివ్య ప్రబంధాలలో వేంకటాచలవైభవాన్ని, శ్రీ వేంకటేశ్వర విగ్రహ సౌందర్యాన్ని భక్త్యావేశంతో, విపులంగా వర్ణించారు. వీరిలో కొందరు వెంగడాన్ని ప్రత్యక్షంగా సేవించి, శ్రీనివాసుని దర్శించి వర్ణించారు. మరికొందరు తమ మనోనేత్రాలతో వీక్షించి శ్రీ గిరి స్వరూపాన్ని, శ్రీనివాసుని అర్చావతారరూపాన్ని అభివర్ణించారు. ఈ ఆళ్వారులు ముక్తకంఠంతో శ్రీనివాసుడు వైకుంఠంనుండి దిగివచ్చి, ప్రప్రథమంగా స్వయం వ్యక్త ఆర్చావతారస్వరూపం ఈ తిరుమల కొండపైనే వహించాడని ప్రకటించారు; కాదు నిర్ణయించారు. ప్రపత్తిమార్గంలో సులభంగా సిద్ధి పొందడానికి అనువైనక్షేత్రం తిరుమల అని, తనపాద సేవలో శరణాగతి పొందినవారికి సత్వరంగా తరణోపాయం చూపే దివ్యసుందరమూర్తి, కరుణాసాగరమూర్తి, శ్రీవేంకటరమణమూర్తి అని ఆళ్వారులు తమ ద్రావిడ దివ్యప్రబంధాలలో మంగళాను శాసనాలు చేశారు. ఋగ్వేదంలోనే కాదు ఆవిధంగా ద్రావిడ వేదంలోను శ్రీనివాసుడు ప్రశంసాగానం అందుకొన్నాడు.

"ఏమి వలసిన నిచ్చు నెప్పుడైనను
యేమరక కొలచిన నితడే దైవము

ఘనముగా నందరికిఁ గన్నులిచ్చుఁ గాళ్ళిచ్చు
పనిసేయు జేతులిచ్చు బలియుఁడై
తను గొలువుమని చిత్తము లిచ్చుఁ గరుణించి
వొనర లోకానకెల్ల నొక్కడే దైవము

మెచ్చిక తను గొలువ మనసిచ్చు మాటలిచ్చు
కచ్చితము లేని కొడుకుల నిచ్చును
చొచ్చినచోటే చొచ్చి శుభమిచ్చు సుఖమిచ్చు
నిచ్చలు లోకానకెల్ల నిజమైన దైవము

పంతమాడి కొలిచిన ప్రాణమిచ్చు ప్రాయమిచ్చు
యెంతటి పదవులైన నిట్టే యిచ్చు
వింత వింత విభవాల వేంకటేశుడిదే మా
యంతరంగమున నుండే అరచేతి దైవమా!"

— శ్రీ అన్నమాచార్య సంకీర్తన



| | 4గురు చెలికత్తెలు | గజలక్ష్మి | | 4గురు చెలికత్తెలు |
|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 |
| 1వ వరుస | శంఖం | శ్రీనివాసుడు | ఆదిశేషునిపై నారాయణుడు | చక్రం |
| 2వ వరుస | వాసుదేవుడు | సంకర్షణుడు | ప్రద్యుమ్నుడు | అనిరుద్ధుడు |
| 3వ వరుస | కేశవుడు | గోవిందుడు | త్రివిక్రముడు | హృషీకేశుడు |
| 4వ వరుస | నారాయణుడు | విష్ణువు | వామనుడు | పద్మనాభుడు |
| 5వ వరుస | మాధవుడు | మధుసూదనుడు | శ్రీధరుడు | దామోదరుడు |
| 6వ వరుస | మత్స్య | కూర్మ | వరాహ | నారసింహ |
| 7వ వరుస | వామన | పరశురామ | శ్రీరామ | బలరామ |
| 8వ వరుస | శ్రీకృష్ణ | పద్మం | పద్మం | కల్కి |

1వ అడ్డవరుసలో 3వ స్థానం : పరమూర్తి - 1

2వ అడ్డవరుసలో 1, 2, 3, 4 స్థానాలలో : వ్యూహమూర్తులు - 4
అడ్డవరుసలు 3, 4, 5లో 1, 2, 3, 4 స్థానాలలో:- ఉపవ్యూహ మూర్తులు - 12

6వ అడ్డవరుసలో 1, 2, 3, 4 స్థానాలలో : విభవమూర్తులు — దశావతారాలు : మత్స, కూర్మ, వరాహ, నారసింహ మూర్తులు - 4

7వ అడ్డవరుసలో 1. 2, 3, 4 స్థానాలలో : విభవమూర్తులు — దశావతారములు: వామన, పరుశురామ, బలరామమూర్తులు - 4

8 అడ్డవరుసలో 1, 4 స్థానాలలో : విభవమూర్తులు దశావతారాలు : శ్రీకృష్ణ, కల్కిమూర్తులు - 2

8వ అష్టవరుసలో 2, 3 స్థానాలలో : అంతర్యామి సంకేతాలు :
రెండు పద్మాలు 2

1వ అష్టవరుసలో 2వ స్థానంలో : అర్చావతారమూర్తి
శ్రీనివాసమూర్తి 1

1వ అష్టవరుసలో 1, 3 స్థానాలలో : అర్చావతారమూర్తి
ఆయుధాలు శంఖం, చక్రం 2

పరమపదంలోని యే పరమూర్తి వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చామూర్తులుగా భక్తుల సౌలభ్యంకోసం అవతరిస్తున్నాడో, ఆ శ్రీమన్నారాయణమూర్తి శ్రీ వేంకటరమణమూర్తియై కలియుగ మానవుల ఉద్ధరణకై తిరుమలపై అర్చావతారమూర్తిగా ఆవిర్భవించాడు. వైకుంఠాన్ని చేరి చూడలేని కలియుగమానవులకోసం ఆ వైకుంఠాన్ని తిరుమలకు తరలించి, తిరుమలపై నెలకొల్పాడు. తిరుమలేశుని నిలయమే వైకుంఠం. వైఖానస, పాంచరాత్ర ఆగమాలు శ్రీ వైష్ణవసంప్రదాయం ప్రతిపాదించినరీతిలో శ్రీనివాసుని భూలోక వైకుంఠద్వారాలు రూపొందింపబడ్డాయి. ఆ 32 బంగారుచిత్రాలను చూస్తూ బంగారు వాకిలిముంగిట నిలచినభక్తునకు భూలోకవైకుంఠం లోనికి, ప్రవేశించేభాగ్యం లభించిందనే పవిత్రభావన కలుగుతుంది. మూసిన బంగారువాకిలి దివిలోని దేవతలు సేవించే వైకుంఠం. తెరచిన బంగారువాకిలి భూలోకవాసులు సేవించే కలియుగవైకుంఠం. కన్నుల వైకుంఠం. భూలోకవైకుంఠం.

## సుప్రభాత సేవ

ఆ బంగారువాకిలి భూలోకవైకుంఠపుద్వారం. ఆద్వారం తెరవాలి. వైకుంఠనాథుడైన శ్రీ వేంకటనాథుని విశ్వరూపదర్శనభాగ్యం భక్తులకు కలగాలి. ఆ ద్వారం తెరవాలంటే అర్చకస్వాములు, ఆచార్య

స్వాములు, శ్రీ వైష్ణవస్వాములు, ఏకాంగులు, ఆంతరంగికభక్తులు, పరిజనాలు, పరివారజనాలు, దైవసేవకులైన అధికారికపురుషులు - అందరూ బంగారువాకిలిముంగిట నిలవాలి. అందరూ ఆనందనిలయా నికి ప్రదక్షిణంచేసి బంగారువాకిలిముందుగల తిరుమామిణిముఖమండ పంలో బారులుతీరి నిలుస్తారు. దివిటీతో, పరిచారకునితో, ఆలయ మర్యాదతో, శిరస్సున సన్నిధియంత్రికతో ముందునిలచిన అర్చక స్వామి సమంత్రికంగా లోపలిగడియ తీస్తాడు. అధికారులు సీళ్ళువేసిన రెండుతాళాలను శ్రీనివాసుని కైంకర్యపరుడైన యాదవుడు తీస్తాడు.

"కౌసల్యా సుప్రజారామ పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్"

ఈ శ్లోకం పఠిస్తూ అర్చకస్వామి పరిచారకునితోను, గొల్లవాని తోను స్వామివారి ఆలయంలోనికి ప్రవేశిస్తాడు. బంగారువాకిలి తలు పులు మూయబడతాయి. బంగారువాకిలి ముంగిట శ్రీ వేంకటేశ సుప్ర భాత, స్తోత్ర, ప్రపత్తి, మంగళాశాసనాలపఠనం సాగుతుంది. అర్చకుడు అతోదేవామంత్రం పఠించి, శ్రీనివాసుని పాదసేవ చేసి అనుమతి తీసి కొని భోగశ్రీనివాసమూర్తి శయనస్థానానికి వస్తాడు. కరతాళ ధ్వానంతో, ఓంకారనాదంతో, మంత్రపఠనంతో భోగశ్రీనివాసుని మేల్కొలిపి శ్రీనివాసునివద్దగల జీవస్థానానికి చేరుస్తాడు. పరిచార కుడు సమ్మార్జనం, గొల్లవాడు దీపారాధన చేస్తారు. స్వామివారి శయనపరికరాలను యథాస్థానాలకు వారు చేరుస్తారు. స్వామికి నవనీత నివేదనం, తాంబూలసమర్పణం,నీరాజనం జరుగుతాయి. బయట మంగ ళానుశాసనం ముగుస్తుంది. బంగారువాకిలి తలుపులు తెరచుకుంటాయి. అర్చకస్వామి కావించే మంగళహారతికాంతిలో స్వామి తమ విశ్వరూపం చూపుతారు.

ఈవిధంగా స్వామివారికి సుప్రభాతసేవ జరుగుతుంది. తరువాత వేదపారాయణం జరుగుతుంది. ఈ సుప్రభాతసేవ క్రీ. శ. 14వ శతాబ్దం చివరభాగంలో కాని, 15 వ శతాబ్దం ప్రారంభంలోగాని ప్రారంభమై నేటికీ అవిచ్ఛిన్నంగా సాగుతోంది. వీరప్రతాప వీరమహారాయలు అనే రెండవ దేవరాయ మహారాజుకాలంలో క్రీ. శ. 1430 సం॥లో శ్రీనివాసుని సన్నిధానంలో వేదపారాయణానికి యేర్పాటు చేయబడింది. క్రీ.శ. 16 వ శతాబ్దంలో తాళ్ళపాకవంశంలోని తిరుమల అయ్యంగారు తిరుమలను నివాసకేంద్రంగా జేసికొన్న సమయంలో అన్నమయ్య రచించిన శ్రీ వేంకటేశ్వరస్వామి మేలికొలుపు పాటలుపాడే సంప్రదాయం వచ్చిందని అభిజ్ఞులు ప్రకటిస్తున్నారు. క్రీ. శ. 1434 లో ప్రపథమంగా శుభోదయసమయంలో స్వామికి ప్రసాదనివేదన చేసే యేర్పాటు జరిగింది.

## తోమాల సేవ

సుప్రభాతసేవ తరువాత బంగారువాకిలి శుద్ధిచేయబడుతుంది. నిర్మాల్యశోధన జరుగుతుంది. వెదురుగంపలో యామునుంతరి నుండి శ్రీ జియ్యంగారు పుష్పమాలలు, పుష్పాలు, తులసిదళాలు తెచ్చి స్వామి సన్నిధానంలో ఉంచుతారు. మూలవరులకు పాదాభిషేకం జరుగుతుంది. పురుషసూక్తపఠనం జరుగుతూండగా భోగశ్రీనివాసమూర్తిని రజిత పీఠంపై నిలిపి సుగంధతైలం పూస్తారు. నీటితో అభిషేకిస్తారు. గోక్షీరంతో, గంధధారతో, మధువుతో, హరిద్రోదకంతోను– ఆకాశగంగా తీర్థంతోను, సహస్రధారా స్నానంతోను విధివిధానంగా అభిషేకం కావించి యథాస్థానంలో నిలుపుతారు. పిమ్మట స్వామివారి స్వర్ణపాదాలకు, సన్నిధిలోని సాలగ్రామమూర్తులకు అభిషేకం జరుగుతుంది. ఈ అభిషేకకార్యక్రమం సాగుతూన్న సమయంలోనే విప్రనా

రాయసు 60 పాశురాలలో రచించిన తిరుప్పళ్ళి ఎళుచ్చి దివ్యప్రబంధగానం చేయబడుతుంది. ఈ విధంగా మంత్రాసనం, స్నానాసనం ముగిసినపిమ్మట అలంకారాసనం జరుగుతుంది. అదే తోమాలసేవ. పూలమాలలతో స్వామిని అలంకరించే సేవ తోమాలసేవ శ్రీవైష్ణవులు ఆండాళ్ తిరుప్పావు పఠిస్తూండగా స్వామివారికి పుష్పమాలాలంకారకైంకర్యం జరుగుతుంది. ఆళ్వారుల కాలంనుండి తిరుమలేశ్వరుడు తోమాలసేవాప్రియుడే! స్వామిని చేరిన పూలమాలలు వింతఅందాన్ని, కొత్తసౌందర్యాన్ని సంతరించుకొంటాయి.

తిరుమలనంబి సంతతికి చెందిన వ్యక్తి మూడు బిందెల ఆకాశ గంగాతీర్థం కొనివస్తాడు. దానిలో ఒక బిందెడు నీరు, తోమాలసేవకు, వినియోగింపబడుతుంది. రాత్రిపూజకు ఒక బిందెడు నీరు, బ్రహ్మదేవుని అర్చనకు ఒకబిందెడు నీరు కేటాయింపబడతాయి. ఈ అలంకారాసనం, తోమాలసేవ సుమారు 500 సం॥ముల నుండి జరుగుతున్నాయి. శ్రీవారి నిత్యతోమాలసేవ పిమ్మట మంత్రపుష్ప నీరాజనాలు జరుగుతాయి.

## కొలువుసేవ

అలంకారాసనం పిమ్మట మాత్రాదానం జరగాలని భృగుమహర్షి నిర్దేశించాడు. శ్రీనివాసుని దర్బారుసేవలో భాగంగా మాత్రాదానం జరుగుతుంది. తోమాలసేవ అనంతరం శ్రీనివాసునికి కొలువు సేవ జరుగుతుంది. బంగారువాకిలి ముందుగల తిరుమామణి మండపంలో వెండిసింహాసనంపైన కొలువు శ్రీనివాసమూర్తిని నిలుపుతారు. ఛత్రి, చామర, వింజామరాది మహారాజ మర్యాదలు పొందు కొలువు శ్రీనివాసుడు అందుకుంటాడు. దర్బారు శ్రీనివాసునకు అర్ఘ్య, పాద్య, ఆచమనాది అర్చనాక్రమం జరుగుతుంది. తిలాఫలాదులతో దక్షిణ,

తాంబూలాదులతో కావించే తండుల దానానికి మాత్రాదానం అన్నది భృగువచనం. కొలువు శ్రీనివాసస్వామి అర్చకస్వామికి అట్టి మాత్రా దానం చేస్తారు. దానం స్వీకరించిన అర్చకుడు స్వామికి మంగళాశాస నం చేస్తారు. ముందునాటి ఆదాయం స్వామికి నివేదింపబడుతుంది. ఆనాటి, మరుసటినాటి తిథి వారనక్షత్ర యోగకరణాది శుద్ధి ప్రకటింప బడుతుంది. శొంఠిపొడెం, బెల్లంతో కలిపిన నువ్వులపిండి స్వామికి నివేద నగా సమర్పింపబడుతుంది. మంగళహారతి స్వీకరించి కొలువు శ్రీనివాసుడు యథాస్థానం అలంకరిస్తాడు. క్రీ. శ. 1800 తరువాత ఈదర్బారుసేవ ప్రారంభమై నేటికీ యథావిధిగా జరుగుతోంది.

సహస్రనామార్చన

శ్రీవారికి కొలువుసేవ పిమ్మట సహస్రనామార్చన జరుగు తుంది. 'ఓం శ్రీవేంకటేశాయ నమః' అనే నామంతో ప్రారంభ మయ్యే బ్రహ్మాండపురాణాంతర్గతమైన శ్రీవేంకటేశ్వర సహస్రనామా లతో స్వామికి సహస్రనామార్చన జరుగుతుంది. ఈ సహస్రనామాలు మిరాశిదారు పఠిస్తూండగా కూర్మాసనంపై ఆసీనుడైన అర్చకస్వామి శ్రీహరి పాదాలపై తులసిదళాలు, నానావిధములైన పుష్పాలు సమర్పిస్తూ శ్రీనివాససహస్రనామార్చన కావిస్తాడు. పిమ్మట శ్రీభూదేవులకు వరాహపురాణమందలి లక్ష్మీనామాలతో పూజ జరుగుతుంది. తరువాత స్వామివారికి, అమ్మవార్లకు మంగళహారతులు సమర్పింపబడతాయి, శ్రీనివాసుని సహస్రనామార్చన 'ప్రథమార్చ నగా' వ్యవహారప్రసిద్ధిని పొందింది. బ్రహ్మదేవుడు స్వామికి ప్రప్రథ మంగా సహస్రనామార్చన కావించాడు. రాత్రిసమయంలో శ్రీవారికి బ్రహ్మ నిత్యం సహస్రనామార్చన, అష్టోత్తర నామార్చన కావిస్తాడని

జనులు నమ్ముతారు. రాత్రిసమయం బ్రహ్మార్చనకాలంగా భావించి అర్చకులు నేటికీ యేర్పాట్లు చేస్తున్నారు. పురాణపురుషులలో తొండమానుడు శ్రీనివాసునకు నిత్యం స్వర్ణతులసీదళాలతో పూజ కావించాడు. తన అహంకార మమకారాలను తొలగించుకొన్నాడు. పాపాల నుండి విముక్తుడై, శ్రీనివాసానుగ్రహానికి పాత్రుడై శ్రీనివాస సహస్రనామార్చన ఫలితంగా మోక్షం పొందాడు.

క్రీ. శ. 1491 సం॥లో పసింది 'వేంకటత్తురయివర్' అనే పండితుడు అష్టాదశపురాణాలలోని వేంకటాచలపు గాథలను, శ్రీ వేంకటేశ్వరుని లీలలను సేకరించి 'శ్రీ వేంకటాచల మాహాత్మ్యం' సంకలనం కావించాడు. దానిని శ్రీనివాసుని సన్నిధానంలో పఠించేవాడు. దాని ప్రభావం మూలంగా బ్రహ్మాండపురాణాంతర్గతమైన శ్రీ వేంకటేశ్వర సహస్రనామాలు – వానిని వివరించే పురాణగాథలు బహుళప్రచారం పొందిన ఫలితంగా శ్రీవారి సన్నిధానంలో స్వామివారి సహస్రనామార్చనకు అంకురార్పణ జరిగింది. క్రీ. శ. 1517 సం॥ నాటి శాసనం సహస్రనామార్చనగూర్చి మొదటిసారిగా ప్రకటించింది. 10-8-1527లో శరణుశెట్టి శ్రీనివాససహస్ర నామార్చనకు దానం కావించాడు. 31-1-1533 తేదీన విజయనగరచక్రవర్తి అచ్యుతరాయలు సువర్ణ పుష్పాలతో ఆచార్యపురుషుడు నామాలు పఠిస్తూండగా స్వయంగా శ్రీనివాసునకు సహస్రనామార్చన కావించాడు. సదాశివరాయలు కాలంలో సూరప్పనాయకర్ శ్రీదేవిభూదేవి సమేతుడైన మలయప్ప స్వామికి త్రిరాత్రదీక్షతో సహస్రనామార్చన మహోత్సవం కావించడానికి యేర్పాటుచేసాడు. 15 బంగారు దేవతామూర్తులను చేయించాడు. ఈదీక్ష అంకురార్పణ, అధివాసం, శాత్తుమొఱలతో కూడిన మూడుదినాల కార్యక్రమంగా విభజింపబడింది. అంకురార్పణలో 15

దేవ శామూర్తులను వినియోగింపజేసాడు. ఎర్రతామర, తెల్లతామర, మల్లెపూవులతో మలయప్ప పెరుమాళ్ళునకు సహస్రనామార్చన చేయించాడు. శ్రీవారికి, వరాహస్వామికి నివేదనలు అర్పించాడు. గరుడ, శేష వాహనాలలోను. పల్లకీలోని శ్రీదేవి, భూదేవిసమేతుడైన మలయస్వామికి తిరువీధులలో ఊరేగింపులు జరిపించాడు. అది చరిత్ర కాలంనాటి విషయం. నేడు నిత్యంస్వామికి పూజలో భాగంగా సహస్ర నామార్చన జరుగుతోంది.

శాత్తుమొఱ-ద్వితీయార్చన

అర్చన తరువాత శుద్ధి మొదటి ఘంట జరుగుతాయి. ఒకపరిచారకుడు తిరుమామిణి మండపంలోగల రెండు పెద్దఘంటలమధ్య కూర్చొని వానిని ప్రయోగిస్తాడు. వానిలో ఓంకారనాద పరంపరలు వెలువడి, దశదిశలూ వ్యాపిస్తాయి. ఆసమయంలో స్వామివారికి ప్రసాదనివేదనం జరుగుతుంది. తరువాత హోమశాలలో హోమం జరుగుతుంది. విష్వక్సేనునకు, గరుడునకు, తదితర బలికాంక్షులకు బలి సమర్పింపబడుతుంది. మిగిలిన బలి ఐదుబలిపీఠాలపై సముత్రంగా అర్పింపబడుతుంది. అవి ధ్వజస్తంభవద్ద ఉన్నాయి. స్వామివారికి మంగళాశాసనం (శాత్తుమొఱ), 'తిరుప్పావు' లోని చివరి రెండుపాశురాలు చదవడంతో జరుగుతుంది. ఈవిధంగా భోజ్యాసనం, యాత్రాసనం స్వామికి జరుగుతాయి.

శ్రీవారికి ద్వితీయార్చనలో వరాహపురాణాంతర్గతమైన శ్రీవేంకటేశ్వర అష్టోత్తరశతనామావళితో పూజ జరుగుతుంది. శ్రీభూదేవులకు లక్ష్మీనామాలతో అర్చన జరుగుతుంది. నివేదన, నీరాజనాదులు సమర్పింప బడతాయి. సృష్టి ఆరంభానికి ముందు బ్రహ్మదేవుడు శ్రీవారికి అష్టోత్తరశతనామ పూజ కావించాడు. ఆదిశేషుడు, కపిల

మహర్షి ఆదిగాగలవారు శ్రీవేంకటేశ్వర అష్టోత్తరశతనామపూజ చేసి తరించారు. పిమ్మట స్వామివారికి రాత్రి కైంకర్యం జరుగుతుంది. పూలమాలల సమర్పణం, అలంకరణం శ్రీవారికి జరుగుతాయి. ఈ తోమాలసేవ పిమ్మట మంత్రపుష్పనీరాజనాలు సమర్పింపబడతాయి. శ్రీనివాసునకు అష్టోత్తరపూజ, అమ్మవార్లకు లక్ష్మీనామపూజ నిర్వహింపబడతాయి. శుద్ధి, ఘంటానాదం, నివేదనం, శాత్తుమొఱ కార్యక్రమాలు, రాత్రి కైంకర్యంలోని ముఖ్యమైన భాగాలు, యథావిధిగా సాగిపోతాయి.

## షట్కాలపూజ

పూజావిధిలో మంత్ర, స్నాన, అలంకార, భోజ్య, యాత్రా, శయనాసనాలు ముఖ్యమైనవి. సుప్రభాతసేవ మంత్రాసనం. తోమాల సేవ స్నాన, అలంకారాసన సమన్వితమైనది. ప్రథమార్చనానంతరం శ్రీవారికి జరిగేనివేదనం భోజ్యాసనం. బలినివేదనం యాత్రాసనం. రాత్రి 12-30 గంటలకు శ్రీవారికి జరిగే ఏకాంతసేవ శయనాసనం లేక పర్యంకాసనంగా భావింపబడుతోంది. పాంచరాత్రాగమం, భగవానునికి ద్వాదశపూజాసమయాలను నిర్ణయించింది. వైఖానసాగమం షట్కాలపూజను ప్రతిపాదించింది. తిరుమలలో ఆదినుండి వైఖానస ఆగమ అర్చనాపద్ధతి అమలు జరుగుతోంది. ప్రత్యూష, ప్రాతఃకాల, మాధ్యాహ్నిక, అపరాహ్ణ, సంధ్యా, నిశా సమయాలలో జరిగే పూజలకు షట్కాలపూజలని పేరు. శ్రీనివాసుని సన్నిధానంలో షట్కాలపూజలు, పూజలుగా, సేవలుగా జరుగుతున్నాయి. ఉషఃకాల పూజవలన ప్రజాభివృద్ధి, ప్రాతఃకాల పూజవలన జపహోమాభివృద్ధి, మాధ్యాహ్నిక పూజవలన రాజ్య, రాష్ట్రాభివృద్ధి, అపరాహ్ణ పూజవలన దేవతాభివృద్ధి, సాయంసంధ్యాసమయపూజవలన సస్యాభివృద్ధి, నిశాసమయపూజవలన పశువృద్ధి సిద్ధిస్తాయి. సమాజానికి,

రాష్ట్రానికి, దేశానికి, లోకానికి శ్రీనివాసుని చల్లనిచూపులవలన ఏవంవిధమైన శుభఫలితాలు సదాలభిస్తున్నాయి.

శ్రీవారి సుప్రభాతసేవకు రాత్రి 3 గంటలకు తెరచిన బంగారు వాకిలి తలుపులు రాత్రి 1 గంటకు ముగిసిన ఏకాంతసేవ పిమ్మట మూయబడతాయి. రోజుకి సుమారు 22 గంటలు స్వామివారి కోవెల తెరచి ఉంటుంది. శుక్రవారంనాడు 13 గంటలపాటు, మిగతారోజులలో 14 గంటలపాటు శ్రీవారు భక్తులకు దర్శనభాగ్యం ప్రసాదిస్తారు. నిత్యం సుమారు 8 గంటలకాలం శ్రీవారి సేవలకు, పూజలకు, నివేదనలకు, కైంకర్యాలకు కేటాయింపబడింది.

కురులు పుచ్చుకొని సిరులిచ్చే స్వామి

శ్రీవారిని నిత్యం సుమారు పాతికవేలమంది భక్తులు దర్శిస్తుంటారు. వారిలో అత్యధికసంఖ్యాకులు తల నీలాలమొక్కుబడులు చెల్లించుకొనేవారే! సర్వపాపాలు తలవెంట్రుకలను పట్టుకొని ఉంటాయని మనవారి నమ్మకం. క్షేత్రానికి వెళ్ళి, తీర్థం సేవించినసమయంలో శిరోముండనం కావించుకోవడమన్నది హిందూసంప్రదాయం. తిరుమలపై తల నీలాలమొక్కుబడులు చెల్లించుకొనేవారికి వారి కేశాలను ఆశ్రయించిన పాపాలు తొలగిపోతాయి. తల్లిదండ్రులు పెట్టని సొమ్ములు పెన్నెరులు కదా! అందునా నేటి యువజనత తమసౌందర్యం, జీవితమాధుర్యం, సంపద తమ కేశసంపదలో ఉందని భావిస్తోంది. నవనాగరిక వ్యామోహపరులైన ఎందరో యువకులు వినమ్రంగా తమ కురులిస్తారు. అపూర్వసౌందర్యవతులైన ఎందరో యువతులు. మహిళలు తమ పెన్నెరులను 'కళ్యాణకట్ట'లో సమర్పిస్తారు. స్వామి కేవలం భక్తుల కురులు పుచ్చుకొని సిరులిస్తాడు. శిరోజాలతో సంతృప్తుడై సర్వసంపదలు స్వామి అనుగ్రహిస్తాడు. మొక్కుకొని మొక్కులు తీర్చనివారికి విడనిశిరోజాల చిక్కులవంటి ప్రబలమైన జీవితసమస్యలను

సృష్టిస్తున్నాడు. సామాన్యంగా కొందరు పిల్లలకు, పెద్దలకు జుట్టుజడలు కట్టడం చూస్తూంటాము. దానికి వైద్యశాస్త్రం సహితం సహేతుకమైన కారణం చూపలేకపోతోంది. దాన్ని నివారించనూలేకపోతోంది. కాని అట్టివారు శ్రీవారి సన్నిధానంలో తలనీలాలు సమర్పించి, స్వామివారిని సేవిస్తే వారికి మళ్ళీ జడలు కట్టవు. ఈ సామాన్యవిషయంద్వారా శ్రీవారి అనన్యసామాన్యమైన శక్తి, మహిమ వ్యక్తమవుతున్నాయి. స్వామికై శిరోజాలు పెంచుకొన్నవాడు, శిరోముండనం చేయించుకొన్నవాడు, శ్రీనివాసుడు ఆపన్నప్రసన్నుడని, చెప్పక చెప్తాడు. స్వామి మహిమను ప్రకటించే ఉత్తమప్రచారకుడవుతాడు. శిరస్సుపై స్వామివారి పాదాలు ధరించి, సేవించే భాగ్యం పొందుతాడు.

ఇంకొక చిత్రమైన కథ బహుళప్రచారంలో ఉంది. బీబీనాంచార్ యాదుగిరిలక్ష్మి. ఆమె ఢిల్లీసుల్తాన్ కుమార్తెట. ఔరంగజేబు కాలంలో హైదరాబాద్‌లో నివసించి శ్రీనివాసుని గాఢంగా ప్రేమించిన భక్తురాలని కొందరంటారు. యవనులకు శని అధిపతి అందుచేతనే స్వామికి శనివారం ప్రీతిపాత్రమైన దినం అయిందట, బీబీనాంచార్ మూలంగా. కొండపై శ్రీనివాసుని ప్రియురాలుగాఉన్న బీబీనాంచార్ "భక్తులు కొండకు వచ్చేటప్పుడు నావాళ్ళు, వెళ్ళేటప్పుడు నీవాళ్ళు" అని పద్మావతితో అన్నదట. ఇదే ఆ చిత్రమైన కథ. పెరిగిన శిరోజాలు, గెడ్డాలు,మీసాలతో కొండకువచ్చే భక్తులు మహమ్మదీయరూపాలలో ఉంటారు. శిరోముండనం చేయించుకొని పద్మావతిని హిందువుల రూపాలలో చూస్తారని దానిఅర్థం. ఈ కథ తిరుమలక్షేత్రం హిందూ మహమ్మదీయ సమైక్యతా కేంద్రమని, మతసామరస్య నిలయమని నిరూపిస్తోంది అన్నమా[illegible] అని నాపలువారు, అన్ని దేశాల

వారు ఇక్కడకు వస్తారు. అందుచేత తిరుమల జాతీయసమైక్యతా పీఠంగా, విశ్వశాంతినిలయంగా వర్ధిల్లుతోంది.

తిరుమల యాత్రికునిదృష్టి మూడు ముఖ్యమైన కార్యాలపై కేంద్రీకృతమవుతుంది. తలనీలాలు సమర్పించుకోవడం, శ్రీవారి దర్శనం కావించుకోవడం, హుండీలో ముడుపులు, మొక్కుబడులు' కానుకలు అర్పించుకోవడం అనే అంశాలపై భక్తునిమనస్సు లగ్నమవుతుంది. తలనీలాలు తీయించుకొన్న భక్తుడు సర్వదర్శనం క్యూలో నిలుస్తాడు స్వామిని మనసారా చూడాలని. తొందరగా దర్శనం చేసికొని తిరిగి పోదామనుకొనేవారు, కాస్త ఆర్థికస్తోమత ఉన్నవారు రూ. 25/-లు చెల్లించి సత్వరంగా దర్శనం చేసికొనే సదుపాయం వినియోగించుకొంటారు. నిరీక్షించి, నిరీక్షించి స్వామివారి బంగారువాకిలి ముందుగల తిరుమామిణి మండపంవద్దకు భక్తుడు చేరుకొంటాడు.

పరకామణి

స్వామిని చూడడానికి ముందుగా స్వామికి భక్తులు సమర్పించిన కానుకల లెక్కింపు సందడిని అతడు చూడగలుగుతాడు. దాన్ని 'పరకామణి' అంటారు. ఒకప్పుడు శ్రీ వేంకటేశ్వరుని సోదరుడు గోవిందరాజుస్వామి శ్రీనివాసుని డబ్బు కుంచంతో కొలిచీ, కొలిచీ అలసిపోయి నిద్రపోయాడని ఒక కథ ఉంది. సూర్యోదయంనుండి సూర్యాస్తమయంవరకూ అసంఖ్యాకమైన దేవస్థానపు ఉద్యోగులు జల్లెడలు, చేటలు ఉపయోగించి లెక్కలు పెడుతుంటారు. స్వామివారి హుండీలో ఆభరణాలు, నోట్లకట్టలు, బంగారం, వెండి, నాణేలూ, డాలర్లు, పౌండ్లు, విదేశీకరెన్సీ, ఇంకా ఇంకా ఎన్నో అండలలో పడతాయి. ముఖ్యంగా అరబ్ దేశాల, శ్రీలంక, మలేసియా ఆదిగాగల దేశాల కరెన్సీనోట్లు ఉంటాయి. వజ్రాలు, రత్నాలు, ప్లాటినం

డతాయి. నిత్యం వందలసంఖ్యలో మంగళసూత్రాలు హుండీలో పడతాయి. నోట్లు లెక్కపెడతాయి. నాణేలు జల్లెడలతో జల్లిస్తారు. బంగారం, వెండివస్తువులను, రూపాయి, పదిరూపాయిలు, పదిపైసల బిళ్లలను మొదటి, రెండు జల్లెడలతో వేరుచేస్తారు. మూడవజల్లెడలో అర్ధరూపాయి, పదిపైసల ఇత్తడిబిళ్లలు వేరు అవుతాయి. మిగతా వానిని లెక్కపెట్టి వేరు చేస్తారు. నిశితదృష్టిగల గరుడునిసన్నిధిలో ఈ పరకామణి జరుగుతుంది. ఒక్కొక్కసారి లక్షలకట్టలు లెక్కింపులోనికి వస్తాయి.

తిరుమలేశునిహుండీ నిత్యం రెండు మూడు సార్లయినా నిండుతుంది. విశేషమైన పర్వదినాలలో, బ్రహ్మోత్సవసమయాలలో ఐదారు సార్లు హుండీ అండలు మార్చవలసివస్తుంది. తనపెళ్ళికి కుబేరునివద్ద చేసినఅప్పు తీర్చడానికి శ్రీనివాసుడు వడ్డికాసులవాడై కోట్లాదిరూపాయలను సంపాదిస్తున్నాడన్నది ఒక పౌరాణికగాథ. కలియుగాంతం వరకూ ఈవిధంగానే సంపాదిస్తాడట. 'పరకామణి'లో లభించే బియ్యం గొల్లమిరాసిదారునకు చెందుతాయి. కేశాలు కళ్యాణకట్టకు చేరుతాయి. ముడుపులు విప్పి అవతలవేసే గుడ్డపీలికలను తీసికొనివెళ్ళే వ్యక్తిని 'కైకాలరెడ్డి' అంటారు. హుండీలోపడ్డ ముడుపులుకట్టిన గుడ్డముక్కలు 'కైకాలరెడ్డి'కి లభిస్తాయి. వారు వంశపారంపర్యంగా అనుభవిస్తున్నహక్కులు అవి. 1933లో 11లక్షలు, 1940లో 14లక్షలు 1950లో 30 లక్షలు, 1960లో 70 లక్షలు, 1961లో కోటి రూపాయల సాలీనా ఆదాయాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం సంపాదించింది. 1961లో కోటిరూపాయలు ఆదాయంగల ఈ దేవస్థానం 1981లో 25 కోట్లరూపాయల అదాయం సంపాదిస్తుందని అంచనా వేసారు.

## భక్తుల బరువుల బాధలు నివారించే శ్రీవారి హుండీ

ఈ పరకామణిదృశ్యం తిలకించిన యాత్రికుడు బంగారువాకిలి దాటి 'కులశేఖరపడి'వద్ద శ్రీవారి సన్నిధానంలో నిలుస్తాడు. అపార

కారుణ్య, ఔదార్య, వాత్సల్యాది అనంతకళ్యాణగుణపరిపూర్ణుడైన, కామితార్థవరప్రదుడైన శ్రీ వేంకటరమణుని దివ్యదర్శనం కావిస్తాడు. అవ్యక్తమధురమైన దివ్యానుభూతిని పొందుతాడు. మనస్సు స్వామి వారి పాదాలవద్దనే ఉంటుంది. కాని మనిషిమాత్రం బయటకు వస్తాడు. ద్వాపరయుగంలో గోపికల చిత్తాలను దోచుకొన్న ఆ శ్రీకృష్ణుడే శ్రీ వేంకటేశ్వరుడై నేడు భక్తులహృదయాలను దొంగిలిస్తున్నాడు. ప్రసాదం తీసికొని విమానప్రదక్షిణం చేసివచ్చే యాత్రికునకు కుబేర స్థానంలో ఆరు అడుగుల ఎతుగల హుండీ కనిపిస్తుంది.

భక్తునకు తలనీలాలు ఇవ్వడంతో తలపై బరువు తొలగుతుంది. శ్రీవారి దర్శనంతో పాపపుమూటల బరువు తగ్గుతుంది. హుండీముందు నిలచి మొక్కులు, కానుకలు సమర్పించడంతో గుండెలోని బరువు తీరుతుంది. సంపన్నులకు, సామాన్యులకు సమానంగా ఆనందం అందించే శక్తిగలది ఆ దేవుని హుండీ. ఎన్నికోట్లజనుల హస్తాల నుండి, వినమ్రభక్తజనుల హస్తాలనుండి – ఎన్నివందల సంవత్సరాల నుండి కానుకలు స్వీకరించిందో? కోట్లకొలది విలువచేసే కానుకలు అందుకొంటోంది. వెలలేని పసుపుగుడ్డ పీలికలను, వెలగల వజ్రవైఢూర్యాలను సమతాభావంతో స్వీకరిస్తోంది. భక్తికే విలువనిస్తోంది. కానుక సమర్పించినహృదయం కానుకకంటే విలువైనది అనేభావంతో స్వీకరిస్తుంది. ఆ స్వామివారి హుండీ! ఎంతమంది మనస్సులను తేలిక పరచిందో! ఎంతమంది కన్నులలో ఆనందబాష్పాలను కల్పించిందో! ఎంతమంది భక్తుల భావాలను తేనెవాగులను చేసిందో! ఎంతమంది బాధలను, వ్యథలను, చిక్కులను, చీకాకులను, సమస్యలను, సంఘర్షణలను నివారించిందో! ఎంతమంది కన్నులలో, మనస్సులలో, జీవితాలలో కాంతిరేఖలను ప్రసరింపజేసిందో! స్వామికి హుండీలో నిలువు

దోపిడి ఇస్తారు. పిల్లలు లేనివారు పిల్లల్ని కన్నతరువాత వారిని బంగారంతో తూచి దాన్ని హుండీలో వేస్తారు. స్వామివారి హుండీలో కానుకలు, ముడుపులు చెల్లించుకోగలగడం భక్తులు తమకులభించిన ప్రత్యేకవరంగా భావిస్తారు. అన్నమాటకు కట్టుబడి ఉండాలి, సత్యాన్ని నిలబెట్టడానికి పాటుపడాలి అనే దివ్యసందేశం సదా ప్రసారం చేస్తుంది శ్రీవారి హుండీ. మనిషిలో అద్వైతభావనను నెలకొల్పుతుంది. తిరుమలపై భక్తులకానుకల సమర్పణలతో శ్రీవారి హుండీ గల గల లాడినంతకాలం లోకం కళ్యాణవేడుకలతో కల కల లాడుతుంది.

## ఏకాంతసేవ

తనకు సేవలు, పూజలు, అర్చనలు, నివేదనలు చేసి అలసిపోయిన అర్చకులకు, భక్తులకు సేవలు చేసి విరామం లేని పరిచారానికి, ఉద్యోగులకు, తనదర్శనంకోసం నిరీక్షించి నీరసించిన భక్తులకు విశ్రాంతిని ప్రసాదించడానికి, రాత్రి బ్రహ్మాది దేవతలు తననుపూజించే అవకాశం వారికి లభింపజేయడానికి, స్వామివారు రాత్రి 12-30 గంటలకు ఏకాంతసేవ పొందుతారు. శ్రీవారి గర్భాలయం ముందుభాగంలో వెండిగొలుసులతో బంగారపుమంచాన్ని పరిచారకులు అమరుస్తారు. పరుపులు, దిండ్లు, శాటీలు అన్నీ పట్టుతో తయారుచేసినవి, బంగారు మంచంపై పరుస్తారు. వేడి ఆవుపాలు, ఫలాలు, పలువిధములైన నివేదనవస్తువులు, తాంబూలం బంగారుమంచంవద్ద సిద్ధపరుస్తారు. అర్చకస్వామి స్వామి నివేదన కావించి తాంబూలం అర్పించి, కర్పూర హారతి సమర్పిస్తాడు. శ్రీపాదాలను సేవించి, అపరాధక్షమాపణ మంత్రం పఠించి భోగశ్రీనివాసమూర్తిని బంగారుమంచంపైన పట్టు పరుపుపై పవ్వళింపజేస్తాడు. అన్నమాచార్యుని శృంగారసంకీర్తనం జరుగుతుంది. నాదస్వరవాద్యం మృదులంగా సాగుతుంది. వేణు,

వల్లకీ, వీణానాదాల ప్రసారం జరుగుతుంది. సమవాయిహృదయం శ్రీ భోగ శ్రీనివాసమూర్తికి ఈ అంగరంగభోగాలు కల్పించింది. కల్పిస్తోంది అనే పవిత్రభావం శ్రీవారి ఏకాంతంచూసిన ప్రతిభక్తునకు కలుగుతుంది. ధనుర్మాసంలో మాత్రం శ్రీ కృష్ణమూర్తి ఈ ఏకాంత సేవావైభవం అందుకుంటాడు. మిగతా పదకొండు నెలలూ భోగ శ్రీనివాసమూర్తి ఈ సేవను పొందుతాడు. ఏకాంతసేవానంతరం, తరికొండ వెంకమాంబ పేరుమీదుగా ముత్యాలహారతి జరుగుతుంది.

పిమ్మట అర్చకస్వామి రాత్రి శ్రీనివాసుని బ్రహ్మార్చనకు ఆకాశగంగా తీర్థంతో నాలుగు పాత్రలను నింపి గర్భాలయంలో నాలుగు మూలలలో ఉంచుతాడు. ఇంకొకపాత్రను ఆతత్థంతో శ్రీనివాసుని పాదాలచెంత ఉంచుతాడు. శ్రీనివాసునిపాదాలను సుగంధతైలంతో సేవిస్తాడు. చందనం శ్రీపాదాలపై, అలర్మేల్ మంగతాయారుపై. భోగశ్రీనివాసమూర్తి హృదయపీఠంపై ఉంచుతాడు. సుప్రభాత సేవతో ప్రారంభమైన శ్రీనివాసుని నిత్యార్చన ఏకాంతసేవతో ముగుస్తుంది.

శ్రీకృష్ణదేవరాయుని దేవేరులైన చిన్నాదేవి, తిరుమలదేవి ఒక్కొక్కటి 374 తూకముల బరువుగల రెండు బంగారుగిన్నెలను వేడి ఆవుపాలతో నింపి భోగశ్రీనివాసమూర్తికి ఏకాంతసేవాసమయంలో నివేదించడానికై క్రీ. శ. 1513 సం॥లో భక్తిపురస్సరంగా సమర్పించి ధన్యులయ్యారు. శ్రీవారికి ఈ ఏకాంతసేవ సుమారు ఐదుశతాబ్దుల ముందు నుండి కూడా జరుగుతోన్నట్లు భక్తులు గ్రహించి ఆనందింప వచ్చును. పాలకడలిపై శేషశయనుడై పవ్వళించే స్వామికి బంగారపు ఉయ్యాలమంచంలోన పట్టుపరుపుపై నిద్రపట్టడానికి– స్వామిని నిద్ర పుచ్చడానికి అన్నమయ్య జోలపాట పాడాలి!

"జో అచ్యుతానంద జోజో ముకుంద
రావె పరమానంద రామగోవింద
అంగజునికన్న మాయన్న యిటు రారా
బంగారుఁగిన్నెలో పాలు పోసేరా
దొంగనీవని సతులు పొంగుచున్నారా
ముంగిట నాడరా మోహనాకారా
గోవర్ధనంబెల్ల గొడుగుగాఁ బట్టి
కావరమ్మున నున్న కంసుఁబడఁగొట్టి
నీవు మధురాపురము నేలఁ జేపట్టి
ఠీవితో నేలిన దేవకి పట్టి
అలిగి తృణావర్తు నవనిఁగూల్చితివి
బలిమిమైఁ బూతనఁబట్టి పీల్చితివి
చెలఁగి శకటాసురునిఁ జేరి డొల్చితివి
తలచి మద్దులు రెండు ధరణిఁ వ్రాల్చితివి."



# శ్రీ పాదతీర్థం

"శ్రీ వేంకటగిరి దేవా!

నా దేహంబు నీవుండెడి నిత్యనివాసంబు

నాజ్ఞానవిజ్ఞానంబులు నీయుభయ పార్శ్వంబుల దీపంబులు

నాముకుళితకరముల యూర్పులు నీ యిరుదెసలంబట్టెడి ఆల వట్టంబులు

నామనోరాగంబు నీకు చంద్రకావి వలువ

నీకు మ్రొక్క నెత్తిన నాచేతులు రెండును మకరతోరణంబులు

నాభక్తియె నీకు సింహాసనంబు

నామేనం బొడమిన పులకలు నీకు గుదులుగ్రుచ్చి యర్పించిన పూలదండలు

నేను నిన్ను నుతియించిన నుతులయక్షరరవంబులు

నీకు భేరీభాంకారఘంటానినాదంబులు

నాపుణ్యపరిపాకంబులు నీకు నైవేద్య దాంబూలాదులు

మదీయ నిత్యసేవాసమయ నిరీక్షణంబు నీకు సర్వాంగంబుల నలందిన తట్టుపునుంగు

నా సాత్త్వికగుణంబు నీకు ధూపపరిమళంబు

నీవు దేవుండవు— నేవర్చకుండను

ఈరీతిని నిత్యోత్సవంబు నాయందు నవధరింపవే

శ్రీ వేంకటేశ్వరా"

— శ్రీ తాళ్ళపాక పెదతిరుమలాచార్యుని శ్రీ వేంకటేశ్వర వచనము.

## ఆర్జిత సేవలు

శ్రీ వేంకటగిరిదేవుడైన శ్రీ వేంకటేశ్వరుడు నిత్యోత్సవ, వారోత్సవ. పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాది వివిధోత్సవకృతా

నందుడు. ఆ సేవలను, ఉత్సవాలను తనకు సంకల్పించి, కల్పించి, నిర్వహించి, చూచి, స్మరించి, సేవించిన భక్తులను శ్రీ అలమేల్ మంగా సమేతుడైన శ్రీనివాసుడు ప్రీతుడై, సుప్రీతుడై సుప్రసన్నుడై అనుగ్రహిస్తున్నాడు. సుప్రభాత సేవ మొదలు ఏకాంతసేవ పర్యంతం నిత్యం శ్రీవారి అర్చనలో అంతర్భాగంగా నిత్యోత్సవాలు జరుగుతాయి. భక్తులు దేవస్థానానికి నిర్ణయింపబడిన పైకం చెల్లించి నిర్వహింపజేసికొనే ఉత్సవాలను ఆర్జితసేవలంటారు. ఆర్జితనిత్యసేవలు, ఆర్జితవారోత్సవాలు శ్రీవారికి భక్తులు నిర్వహించి 'ధన్యోస్మి' అనుకుంటారు. ప్లవోత్సవం, సహస్రకలశాభిషేక మహోత్సవం, పుష్పాలంకరణ మహోత్సవం అభిషేకోత్సవం, వసంతోత్సవం, (తిరుప్పావడ) చిత్రాన్న ప్రసాద నివేదనోత్సవం, కోయిల ఆళ్వారు తిరుమంజనోత్సవం, ఆమంత్రణోత్సవం, బ్రహ్మోత్సవం, కల్యాణోత్సవం, అద్దాలమేడలో డోలోత్సవం, వివిధవాహనోత్సవాలు శ్రీవారికి ఆర్జితసేవలుగా ఉత్సవాలుగా నిర్వహింపబడుతున్నాయి.

## ప్లవోత్సవం (తెప్పతిరునాళ్ళు)

ఫాల్గుణశుద్ధ ఏకాదశీ పర్వదినాన ప్రారంభమై, ఫాల్గుణపూర్ణిమ వరకు ఐదురోజులు తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామికి ప్లవోత్సం మహావైభవంగా జరుగుతుంది. దీన్నే శ్రీవారి తెప్పతిరునాళ్ళ వేడుక అంటారు. మొదటిరోజున ఏకాదశినాడు శ్రీరామునకు, రెండవరోజున ద్వాదశినాడు శ్రీకృష్ణునకు ప్లవోత్సవం జరుగుతుంది. మిగిలిన మూడు దినాలలో శ్రీదేవి, భూదేవి సమేతుడైన మలయప్పస్వామి ప్లవ విహారమహోత్సవం పొందుతాడు. శ్రీ స్వామిపుష్కరిణిలోని తెప్ప రంగు రంగుల విద్యుద్దీపాలతో అలంకృతమై ఒప్పారుతుంది. దానిలో

శ్రీవారు అధిష్ఠించి మూడుసార్లు శ్రీ స్వామిపుష్కరిణీ పుణ్యతీర్థంలో విహరిస్తారు. ఆ ప్లవోత్సవం తిలకించే ప్రతిభక్తుడు స్వామి తనమనస్సులోనే విహరిస్తున్నాడనే అనిర్వచనీయమైన ఆనందానుభూతిని పొందుతాడు. ఇది పంచాహ్నికంగా ఫాల్గుణమాసంలోజరిగే వార్షిక ప్లవోత్సవం.

పదిరోజులపాటు జరిగే వసంతోత్సవంలో భాగంగా చివరి మూడురోజులలో ప్లవోత్సవం జరిపించడానికి సాళువ నరసింహరాయలు క్రీ. శ. 1468 సం॥లో యేర్పాటు చేసాడు. ప్లవోత్సవం పొందే శ్రీ మల్లయప్పస్వామిని నిలపడానికి శ్రీ స్వామి పుష్కరిణిలో వసంతమంటపం నిర్మింపజేసాడు. సాళువనరసింహుని కాలంలో శ్రీవారికి ప్లవోత్సవం వసంతకాలంలో జరిగేదని దీన్నిబట్టి నిర్ణయింప వచ్చును. నాలుగునెలలు ఒకఋతువు అని శతపథబ్రాహ్మణం తెలిపింది. మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖమాసాలను వసంతఋతువుగా శతపథబ్రాహ్మణం ప్రతిపాదించింది ఫాల్గుణ పూర్ణిమ కాముని పున్నమి. హోళికాపూర్ణిమ మన్మథునిపండుగ. మన్మథుడు వసంతుడు. వసంతఋతుకారకుడు. సాళువనరసింహుడు మూడుదినాలు నిర్వహించిన ప్లవోత్సవాన్ని దేవస్థానం ఐదురోజులు నిర్వహిస్తోంది. నేడు ఈ ప్లవోత్సవం భక్తులు నిర్వహించే ఆర్జితసేవగా ప్రతిమంగళవారం సాయంసంధ్యాసమయం దాటినపిమ్మట జరుగుతోంది. శ్రీదేవి, భూదేవి సమేతుడైన శ్రీ మలయప్పస్వామి ఉయ్యాలసేవలో పొందిన శ్రమను ఉపశమింపజేసికొని జలవిహారంలో చల్లని పిల్లవాయువులు పీల్చుకోవడానికై ప్లవోత్సవం పొందుతాడు. ఆ సేవ కావించినవారికి శ్రీలక్ష్మీవేంకటేశ్వరులను నిత్యం అర్చించుకొనే భాగ్యం కలుగుతుంది.

"శ్రీ వైకుంఠ విరక్తాయ స్వామిపుష్కరిణీతటే
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళం"

ఈ మంగళాశాసనభావం భక్తుల మనస్సులలో స్ఫురిస్తూండగా శ్రీవారికి మధురపదార్థ నివేదనలు, నీరాజనాలు జరుగుతాయి. ఇది ఆర్జిత ప్లవోత్సవ విశేషం.

## సహస్ర కలశాభిషేకం

సహస్ర కలశాభిషేకం ప్రత్యేకంగా బుధవారంనాడు ఆర్జిత సేవగా జరుగుతుంది. 8-11-1524 నాటి వ్యాసతీర్థులవారి శాసనంలో సహస్ర కలశాభిషేకం ఐదు పర్వదినాలలో చేయడం, ఆ రోజులలో శ్రీవారికి అన్నప్రసాదాలు నివేదింపజేయడంగూర్చిన వివరాలు తెలుస్తున్నాయి. మాఘమాసంలో మహాశివరాత్రినాడు ఫాల్గుణ, చైత్ర, వైశాఖ, జ్యేష్ఠమాసాలలో మాసశివరాత్రులలోను శ్రీవారికి సహస్ర కలశాభిషేకాలు జరిగేవి. ఆపర్వదినాలలో అన్నప్రసాదనివేదనలు జరిగేవి. వర్షాకాలంలో అతివృష్టి, అనావృష్టిదోషాలు లేకుండా సస్యానుకూలమైన సకాలవర్షాలు కురవడానికి ఉద్దేశింపబడిన ఆగమోక్త ప్రక్రియ సహస్రకలశాభిషేకం. ప్రధానంగా వ్యావసాయిక దేశమైన భారతదేశపు హరితవిప్లవానికి సహస్రకలశాభిషేక నిర్వహణం శతాధికంగా దోహదం చేస్తుంది. జనులశ్రేయస్సును, కర్షక జనుల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని సహస్రకలశాభిషేకం సుమారు 500 సం॥లకు పూర్వం తిరుమలలో శ్రీవారికి నిర్దేశింపబడింది. ఇది వరుణజపఫలితాల్ని ప్రసాదిస్తుంది. ఈవిధంగా ఐదు పర్వసమయాలలో దీన్ని నిర్వహించడంవలన పంచభూతాలు శాంతించి ప్రకృతికి అనుకూలిస్తాయి. జలాధిదేవతలైన ఇంద్ర, వరుణ, శివాదులు నీటిఎద్దడి సమస్యను పరిష్కరిస్తారు. శతసహస్రాది సహస్రకలశాభిషేకాలు స్వీకరించిన సహస్రపాదుడు, సహస్రనేత్రుడు, సహస్రశీర్షుడైన శ్రీనివాసుడు తనమూసిన దేవాలయంలో ఘంటలు మ్రోగించి, ఓంకారనాద సంకేతాలద్వారా జలాధిదేవతలకు నిస్తంత్రీవర్తమానాలు పంపి తిరుమల

తిరుపతులలో దుర్భిక్షపరిస్థితిని, నీటి ఎద్దడిని నివారించాడని చెప్పడానికి ఆనాటి దేవస్థానపు పాలకసంఘఅధ్యక్షులు శ్రీ శ్రావణకుమార్ ప్రథమసాక్షి. కార్యనిర్వాహణాధికారి శ్రీప్రసాద్ ఒకసాక్షి. సర్వ సాక్షి, లోకసాక్షి, కర్మసాక్షి అయిన శ్రీనివాసుడుచూపిన మహిమ లకు సర్వ్వలూ సాక్షులే! శ్రీనివాసునికి కావించే సహస్రకలశాభిషేకం శ్రీనివాసుని కదలించి, లోకాన్ని రక్షింపజేసే శక్తిగల అభిషేకం.

బుధవారం ఆర్జితసేవగా జరిగే సహస్ర కలశాభిషేకం శ్రీవారి బంగారువాకిలిముందుగల తిరుమామిణి మండపంలో జరుగుతుంది. భోగశ్రీనివాసమూర్తి మూలమూర్తికి సన్నిహితం చేయబడిన బంగారుతీగతో సహితంగా ఉచితాసనం అలంకరిస్తాడు. శ్రీ భూదేవు లతో మలయప్పస్వామి, విష్వక్సేనుడు తమ తమ స్థానాలను అధిష్ఠి స్తారు. ధాన్యంపై 1008 వెండికలశాలు నిలిపి బంగారుబావిలోని నీటితో వానిని నింపుతారు. ధాన్యమండపంపైనఉన్న జలపూర్ణము లైన కలశాలకు సమంత్రికంగా ఆ వాహనం జరుగుతుంది. హోమం చేస్తారు. ఆ కలశాలలోని మంత్రపూతమైన జలంతో భోగశ్రీనివాస మూర్తికి, శ్రీదేవీ భూదేవీసమేతుడైన మలయప్పస్వామికి, సేనాని విష్వక్సేనునకు అభిషేకం చేస్తారు. ఈ ఆర్జిత ఉత్సవం ప్రేక్షకులైన భక్తులకు, ఉత్సవకారకులకు ఎనలేని ఆనందం ప్రసాదిస్తుంది. దేవతలు ఆనందనిలయ విమానశిఖరం చూచి మానవులు కావాలని భావిస్తా రట. ఈ అభిషేకదృశ్యం చూచినభక్తులు తాము ధరించిన మనుష్య పాత్రలుగాక స్వామి అభిషేకజలం గ్రహించే రజితపాత్రలు కావాలని సంభావిస్తారట. శ్రీ కృష్ణదేవరాయుని సైనికాధికారులలో ఉత్తర మేరూర్‌కుచెందిన అప్పాపిళ్లై క్రీ. శ. 1511లో సహస్రకలశాభిషేకా నంతరం విశేషంగా ప్రసాదం నివేదింపజేయడానికి యేర్పాటుచేసాడు.

తిరుమలై నంబి శ్రీనివాస అయ్యంగారు 1562లో ఈవిధమైన నివేద నకు దానం కావించారు. సహస్రకలశాభిషేకానంతర నివేదనను వివ రించే ఇట్టి తొమ్మిది దానశాసనాలు 1511 - 1562 మధ్యకాలానికి చెందినవిగా కనబడుతున్నాయి. ఈ సహస్రకలశాభిషేకాన్ని 500 సంవత్సరాలకు పూర్వం భక్తులు ఎంతటి పవిత్రపూజా కార్యక్రమంగా భావించారో ఆ శాసనాలవల్ల తెలుస్తోంది ఈ శాసనాలన్నీ శ్రీవారికి ఒక 'అతిరసప్పడి' నివేదన సమర్పించడానికి సంబంధించినవి.

అన్నకూటోత్సవం (తిరుప్పావడ)

ప్రతిగురువారం ఉదయం 'తిరుప్పావడ' ఆర్జితసేవ జరుగుతుంది. అన్నం పరబ్రహ్మస్వరూపం. శ్రీనివాసుడు పరబ్రహ్మస్వరూపుడు. ఆ పరబ్రహ్మస్వరూపునకు పరబ్రహ్మస్వరూపాన్నే అర్పించాలి. ఈ పర మార్థం తిరుప్పావడలో ఇమిడిఉంది. సుమారు 450 కిలోల బియ్యపు అన్నప్రసాదం (పులిహోర) తయారుచేసి బంగారువాకిలిముందు రాసిగా పోసి మధ్యశిఖరంచేసి ఎనిమిదిదిక్కులలో శిఖరాలుచేసి పువ్వులతో అలంకరిస్తారు. భోగశ్రీనివాసమూర్తిని అతనిదృష్టి దానిపై ప్రసరించే స్థానంలో అధిష్ఠింపజేస్తారు. నీరాజనంతో దానిని ఇతరవిశేషప్రసాదా లను స్వామికి నివేదిస్తారు. వైకుంఠనాథుడు దృష్టిమాత్రంచేత సంతుష్టి పొందుతాడు. అది వైకుంఠవాసుల స్వభావం. ఆకలిదప్పికలు తెలి యనివారు దేవతలు. భూలోకవాసులు ఆకలిదప్పికలతో పీడింపబడ తారు. అన్నం తింటేగాని సంతుష్టి పొందరు.

"అహం వైశ్వానరోభూత్వా, ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్"

ప్రాణికోటిలో జఠరాగ్నిరూపంలో పరబ్రహ్మఉంటాడు. శ్రీని వాసపరబ్రహ్మదృష్టితో పరబ్రహ్మరూపమైన అన్నాన్ని (తిరుప్పావడా

(ప్రసాదాన్ని) చూస్తాడు. సంతుష్టుడవుతాడు. భక్తకోటిలోని జఠరాగ్ని రూపంతో ఉండే పరబ్రహ్మగా తిరుప్పావడాన్ని ఆరగిస్తాడు. శ్రీనివాసుడు కలవారినుండి గ్రహించి దాన్ని లేనివారికి అనుగ్రహిస్తాడు. కలవారినుండి తిరుప్పావడా ప్రసాదం అందుకుంటాడు. లేనివారికి దాన్ని అందిస్తాడు. ప్రసాదిస్తాడు. ఇట్టి సామ్యవాదలక్ష్యాన్ని నెరవేర్చే ఆర్జిత సేవ 'తిరుప్పావడా'. దూరభారాలకోర్చి ఎంతో శ్రమపడి తిరుమల యాత్రకువచ్చిన భక్తులపాలిట అన్నపూర్ణ ఈ తిరుప్పావడా. ఈ తిరుప్పావడాసేవ కలియుగవైకుంఠనాథుని సేవ. మానవ మాధవసేవల మేలు కలయికను సాధింపజేసే సేవ. తిరుప్పావడా లక్ష్యం సాధించడానికి దేవస్థానం చిత్తశుద్ధితో అన్నప్రసాద వినియోగపథకాన్ని అమలుపరుస్తోంది.

పూర్వం 200 మరకాలుల అన్నప్రసాదం తిరుప్పావడా నివేదనంలో సమర్పించేవారు ముందుగా పరిసరప్రాంతంలో దీనివిషయం ప్రచారమయ్యేది. పరిసరాలనుండి వచ్చినవారు తిరుప్పావడా నివేదన అయినవెంటనే ఎవరికి కావలసిన ప్రసాదం వారు తీసికొని తృప్తిగా కడుపులు నింపుకొనేవారు. శుద్ధాన్నం కూరలు, పప్పులు, పులుసులు, పిండివంటలతో తిరుప్పావడా నివేదన జరిగేది. మృష్టాన్నభోజనం అందరికి తిరుప్పావడా సమకూర్చేది.

15వ శతాబ్దానికి పూర్వం 'తిరుప్పావడా' నివేదనం జరిగేది. క్రీ. శ. 1454 - 1494 సంవత్సరాలమధ్య సాళువనరసింహునికాలంలో అతడు, రాజకుటుంబసభ్యులు, ఎందరో భక్తులు దానాలుచేసి [illegible] మరకాలు తిరుప్పావడా మహానివేదన జరిగే యేర్పాటు [illegible]. ఆనాడు తిరుప్పావడా మహానివేదన, ఇతర అన్నప్రసాదనివే[illegible]లు, యాత్రికులకు, దేవాలయంలోని పనివారికి, పరిసరంలోని బీదలకు

భోజనసదుపాయాలు కల్పించడానికి ఉద్దేశింపబడ్డాయి. శ్రీవారికి జరిగే తిరుప్పావడా మహానివేదనం చూచి ప్రభావితుడై తిరుపతిలో సమ్మాళ్వారుసన్నిధిలో నిత్యం 2000 మందికి అన్నార్పణంచేసే రామానుజ కూటాన్ని క్రీ. శ. 1550 లో స్థాపించి ఆరవీటి కొండరాజు 'అన్నదాత' అన్నకీర్తి నార్జించాడు. ఆకలి గొన్నవానికి అన్నంపెట్టాలి, తిరుమల యాత్రికునకు అన్నప్రసాదం ఇవ్వాలి అనే శ్రీనివాసుని ఆదేశ సూత్రం 'తిరుప్పావడా'లో ఉత్తను పథకరూపమై గురువారంనాడు ఆర్జితసేవగా అమలు జరుగుతోంది. శ్రీనివాసుడే పూరీలో శ్రీజగన్నాథుడై అన్నార్పణ మాహాత్మ్యాన్ని లోకానికి వ్యక్తంచేస్తున్నాడు. "నాకు నిత్యం మహానివేదన సమర్పించేవారికి బ్రహ్మ, ఇంద్రలోకాలలోని సుఖానుభవాలు సులభంగా సిద్ధిస్తాయి. అట్టి అన్న ప్రసాదం నివేదనచేసిన వారిదర్శన విశేషంవలన యోగిజనదుర్లభమైన అణిమాది అష్టసిద్ధులు అప్రయత్నంగా లభిస్తాయి. అన్నప్రసాదనివేదన పరులకు జన్మాంతంలో వైకుంఠంలోని అనంతగరుడ, విష్వక్సేనాదుల గోష్ఠిలో ప్రవేశం కలుగుతుంది. వారికి జననమరణ రూపమైన సంసార భయం కలుగదు" అని శ్రీనివాస భగవానుడు అన్నప్రసాద నివేదన పరులకు అభయ మిచ్చాడు. దీన్ని వరాహపురాణ ప్రకటిస్తోంది.

## పూలంగి సేవ

"నా ఆవాస స్థానమైన శ్రీ వేంకటగిరిపై బృందావనాలు, వివిధవృక్షాలతోనిండిన పుష్పోద్యానవనాలు నిర్మించి, ఎవరు ఆపుష్పాలతో నన్ను పూజిస్తారో, వారు సమర్పించిన ఆ పుష్పాలలోని ఒక్కొక్క దళానికి దేవమానంప్రకారం కొన్ని అర్బుదసంవత్సరాలు స్వర్గంలో సమస్త భోగాలు అనుభవిస్తారు. పిమ్మట వారు శాశ్వత వైకుంఠవాసులవుతారు. ఇట్టి పరలోకఫలాలు పొందుతారు. ఇహలోకములో అనంతఫలానుభవలాభం అందుకుంటారు. అట్టి వారి

కుటుంబాలలో సంతానవిచ్ఛేద మన్నమాట సంభవించదు. వారునిర్మించిన ఉద్యానవనాలలో వృక్ష, గుల్మ, లతాదులలో ఒక్కొక్కదానికి ఎన్నెన్ని నూతనపుష్పాలు, ఫలాలు, పత్రాలు, ప్రతిసంవత్సరం ఉద్భవిస్తాయో, అదేవిధంగా అట్టివారి కుటుంబాలలో పుట్టినవారికోరికలు ఫలవంతాలవుతాయి. పద్మ, కల్హార, తులసీ, చంపకమాలలు ఎవరు రచించి నిత్యం నాకు శ్రద్ధాభక్తులతో సమర్పిస్తారో, అట్టి మాలా కైంకర్యపరుల గృహాలలో నేను శ్రీలక్ష్మీ సమేతుడనై ఉంటాను వారికి తోడునీడగా ఉంటాను. వారిని కాపాడడం నావిధిగా భావిస్తాను. ఇది నాప్రతిజ్ఞ. ఇది నేను కావించే అభయ ప్రదానం. ఇంతే కాదు. నా పుష్పమాలాకైంకర్యపరులకు ఎవరు ఏ విధంగా తోడ్పడినా, వారికి నేను సహాయపడి సకలసంపదలు అనుగ్రహించి కాపాడతాను". ఇది శ్రీనివాసుని ప్రతిజ్ఞ. తోమాలసేవాపరులకు, పూలంగి సేవా కార్యకర్తలకు కావించిన అభయపత్రం.

శ్రీనివాసుడు పుష్పమాలాప్రియుడు, పూలంగి సేవాప్రియుడు. భక్తజనప్రియుడై పూలంగిసేవా ప్రియుడయ్యాడు. భక్తులుసమర్పించలేని రత్నాలను, మాణిక్యాలను, వజ్రాలను, వైడూర్యాలను స్వామి అపేక్షించడంలేదు. ప్రకృతిలో సులభంగా లభించేవి, భక్తులు సులభంగా సమర్పించగలిగేవి అయిన పువ్వులను, పూలదండలను కోరుకొని, అందుకొని, అనుగ్రహిస్తున్నాడు స్వామి. పేదవారు కావించగలిగిన పూలంగిసేవకు ప్రాధాన్య మిస్తున్నాడు. పేదవారు బంకమట్టి పూలతో పూజించినా వానిని పారిజాతాలుగా స్వీకరిస్తాడు. శ్రీమంతులు సమర్పించిన సువర్ణ పుష్పాలకన్న నిరుపేదలు అర్పించే బంకమట్టి పూలను మిన్నగా చూస్తాడు. బంగారపు పువ్వులలోని అహంకారాన్ని స్వామి సహించడు. మట్టిపూలలోని అణకువను ఆదరిస్తాడు. కురువనంబి అనే కుమ్మరి సమర్పించిన బంకమట్టిపూవులకు రెక్క-

లిచ్చి, వానిని పారిజాతాలుగా అప్పుడప్పుడు ఆ తామరలపై నిలుపుకొని, భక్తవత్సలుడని నిరూపించుకొన్నాడు.

పురాణపురుషులలో రంగదాసు శ్రీ వేంకటగిరిపై పూలవనాలు నిర్మించాడు. వానికి నీరుపెట్టడానికి బావి తవ్వాడు. స్వామికి పూలంగి సేవ చేసిన ధన్యుడు రంగదాసు. ఫలితంగా తొండమానుడై జన్మించి స్వామికి దేవాలయం నిర్మించి, స్వామిని సువర్ణపుష్పాలతో పూజించి మోక్షం పొందాడు. ఆపన్నప్రసన్నుడైన శ్రీనివాసుని అత్ర్యాది సప్తఋషులు ఆకాశసింధుకమలాలతో పూజించారు. బ్రహ్మదేవుడు శ్రీవారికి ఆ ఆకాశసింధుకమలాలతోనే సహస్ర, అష్టోత్తరశతనామార్చనలు, పూలంగి సేవాకైంకర్యాలు చేసి సృష్టి ప్రారంభించాడు. స్వామికి నిత్యం ఉభయసంధ్యాసమయాలలోను, పూలంగిసేవలు జరుగుతాయి. ఈ నిత్యపూలంగిసేవలు తోమాలసేవలు. గురువారం నాడు సాయంసంధ్యాసమయంలో స్వామివారికి జరిగే ప్రత్యేకమైన - భక్తజనాకర్షణీయమైన తోమాలసేవ పూలంగిసేవగా ప్రఖ్యాతి పొందింది. పువ్వులలో సువాసనలు నింపడం, పువ్వులకు వింతకాంతులు, కొత్తరంగులు కల్పించడం శ్రీనివాసభగవానునకు వేడుక. ఆ పరిమళాలు ప్రసరించే, వింతకాంతులతో ప్రభవించే సుమాలను, సుమాల మాలికలను గురువారంనాడు శ్రీనివాసభగవానునకు భక్తిపురస్సరంగా సమర్పించి, పూలంగిసేవ కావించడం భక్తులకు వేడుక.

లక్ష్మీవారం సాయంసమయంలో యామునతురినుండి జియ్యంగారు పలురంగి పుష్పాలతో, పూలదండలతో నిండిన వెదురుగంపలను శిరస్సులపై ఉంచుకొని ముందు ఘంటానాదాలు, మంగళతూర్యనాదాలు సాగుతూండగా వచ్చి శ్రీవారి సన్నిధానంలో ఉంచుతారు. పూలంగిసేవకు స్వామిని ఉదయమే సిద్ధపరుస్తారు. స్వామివారి ఆభర

ణాలు, పట్టుపీతాంబరాలు సడలిస్తారు. 24 మూరల సరిగపట్టంచు ధోవతి ధరింపజేస్తారు. 12 మూరల ఉత్తరీయం వల్లెవాటుగా అలంకరిస్తారు. దీన్ని మేల్‌సాత్, ఉల్‌సాత్ అలంకరణం అంటారు. దీన్ని తమిళంలో పూవాండై సేవ అంటారు. ఇక పూలంగిసేవ ప్రారంభమవుతుంది.

గరుడాళ్వారు పర్యవేక్షణలో మంగళవాద్యాలు సాగుతూంటాయి. గాయకుల అన్నమయ్య సంకీర్తనలు వినిపిస్తూంటాయి. బారులుతీరి ఆచార్యపురుషులు, శ్రీవైష్ణవోత్తములు, పద్మాసనాశీనులై దివ్యప్రబంధాలలోని నిత్యానుసంధానపాశురాలను గానం చేస్తారు. శ్రవణశుభగమైన మధురస్వరాలాపనలతో ఆ ప్రబంధగానం చేస్తారు. అర్చకులు పూలమాలలను స్వామికి వస్త్రంగా, ఉత్తరీయంగా, ఆభరణాలుగా, ఆయుధాలుగా, అలంకారాలుగా, కిరీటంగా ఆ లతాంతాయుధుని కన్నతండ్రిని, పుష్పబాణుడైన మన్మధుని జనకునికి సమర్పిస్తారు. పూలమనసులు - బాసలు తెలిసినస్వామికి అలంకృతమయ్యే భాగ్యం లభించిందని ఆ పూలబాలలు పరవశంతో సుమసౌరభాన్ని శతాధికంగా ప్రసరిస్తాయి. స్వామి చిత్తం పూరేకులకంటె మెత్తనిది. ఆ పువ్వులలోని తేనెకన్న తియ్యనిది. నేత్రాలను కప్పిన కర్పూరపు నామాలు తగ్గించడంవలన ఆనాడు స్వామివారి అపూర్వమైన నేత్రదర్శనభాగ్యం భక్తులకు లభిస్తుంది. చల్లని వెన్నెల వెలుగుల్ని స్వామివారినేత్రాలు ప్రసరిస్తాయి. కరుణారసదృష్టులను సారిస్తాయి. స్వామితో కలయికవలన అందమైన పూలు మరింత సౌందర్యాన్ని సంతరించుకుంటాయి. సతతానందం కల్పించే పూలంగిసేవా సౌందర్యం అది. ముమ్మూర్తులా మన్మథుని తండ్రినని తనపూలంగి సేవాదర్శనంతో భక్తులకు నిరూపిస్తాడు. ప్రపంచంలోని సౌందర్యం

అంతా స్వామి పూలంగిసేవలో కనపడుతుంది. కాని స్వామి పూలంగి సేవలో కనపడిన మహాసౌందర్యం ఈ ప్రపంచంలోనేకాదు - చతుర్దశ భువనాలలోను ఎక్కడా కనపడదు. వెయ్యిమంది చంద్రుల, లక్ష మంది దేవేంద్రుల, కోటిమంది మన్మథుల సౌందర్యం శ్రీనివాసుని పూలంగి సౌందర్యానికి సాటిరాదు. ఇట్టి పూలంగి దర్శనం భక్తులకు గురువారంనాడు రాత్రిసమయంలో లభిస్తుంది. ఆనాడు స్వామికి ఇతర ప్రసాదాలతోపాటు ప్రత్యేకంగా వడపప్పు, పానకం నివేదింపబడు తాయి. గురువారంనాటి పూలంగిసేవ శ్రీవారికి శుక్రవారం జరిగే అభిషేకానికి పూర్వరంగంవంటిది. స్వామి ఆనాడు పూలంగిప్రియుడై భక్తమధుపాలను అలరిస్తాడు. భక్తులు తమనేత్రదృష్టిని సార్థకం చేసి కొనడానికై నేత్రోత్సవంగా శ్రీవారి నేత్రదర్శనం కావించుకొని గురు వారంనాడు అవధులులేని ఆనందం పొందుతారు.

పూలంగిసేవ చేసినవారు, చూచినవారు లక్ష్మీసంపన్నులై తుల తూగుతారని, శ్రీనివాసుని అపారమైన కరుణకు పాత్రులవుతారని వరాహపురాణం మంగళాశాసనం కావించింది. ఆళ్వారులు స్వామికి పూలంగిసేవలు చేసారు. శ్రీవారి పూలంగిసేవావైభవాన్ని తమదివ్య ప్రబంధాలలో గానం కావించారు. నాథముని, యామునముని, తిరు మలనంబి, రామానుజాది ఆచార్యపురుషులు శ్రీనివాసునకు పూలంగి సేవలు చేసి ధన్యులైన మహనీయులు. శ్రీరామానుజుని శిష్యుడు అనంతాళ్వారు తిరుమలలో పుష్పవనాలు పెంచి స్వామికి పూలంగి సేవలు కావించాడు. శ్రీవారి తోమాల, పూలంగిసేవలకు తిరుమల నంబి తిరుమలపై తోట పెంచాడు. రామానుజ తిరునందవనం, అనం తాళ్వారు తిరునందనవనం ఆదిగాగల నందనవనాలు స్వామి పుష్పా ర్చనకోసం నిర్మింపబడ్డాయి. క్రీ. శ. 1339లో హోయసాలప్రభువైన

మూడవవీరభల్లాలుని ప్రధాని సింగయ్య దండనాయకుడు తిరుమలపై శ్రీవారి పూలంగిసేవకు ఉద్దేశించి, అరిశనాలయ నందనవనం, ఆదివనశఠగోప నందనవనం నిర్మించాడు. క్రీ. శ. 756 నాటి అతి ప్రాచీన తమిళకావ్యం 'శిలప్పదికారం' శ్రీనివాసుని పూలంగిసేవా ప్రియత్వాన్ని ధ్రువపరచింది. అందుచేత పూలంగిసేవ 756 నాటికి ముందునుండి జరుగుతూన్నట్లు మనం నిర్ణయింపవచ్చును.

పువ్వులు- పూలతోటలు

నిత్యం శ్రీనివాసుని అర్చనకు 40 కిలోగ్రాముల పువ్వులు కావాలి. శ్రీ గోవిందరాజస్వామి ఆలయానికి 25 కిలోగ్రాములు, శ్రీ కోదండరామస్వామికి 20 కిలోగ్రాములు, తిరుచానూరులో పద్మావతీదేవివారికి 5 కిలోగ్రాములు, కపిలేశ్వరస్వామికి 5 కిలోగ్రాములు పూలు నిత్యం కావాలి.

తిరుమల, తిరుపతి, తిరుచానూరులలోని దేవాలయాలకు నిత్యం సుమారు వంద కిలోగ్రాముల పూలు అవసరమవుతాయన్న మాట. ఈ పూవులన్నీ శ్రీవారికి చెందిన పూలతోటలు, ఉద్యానవనాలనుండి లభిస్తాయి. స్వామివారికి చెందిన పూలతోటలు, ఉద్యానవనాలు 150 ఎకరముల విస్తీర్ణంలో విస్తరించాయి. మొత్తం పూలతోటల సంఖ్య 300. వానిలో పెద్దవి 15 ఉన్నాయి. రహదారి బంగాళాలోయ మంగళబావి ప్రదేశంలోని తోట, రామబగీచా తోట, అనంతపల్లి గుంటతోట, స్వామివారితోట, బస్‌స్టాండ్ మిట్టతోట ఆదిగాగల పూలతోటలు ముఖ్యమైనవి. మహంతుకాలంలో రెండు పూల తోటల పెంపకానికి ప్రాధాన్యమిచ్చి వానిలోని పూలు శ్రీవారి అర్చనకు ఉపయోగింపజేసేవారు. కొంతకాలం పూలతోటలకోసం ఒక పేష్కార్ నియమింపబడి కృషికావించేవారు. 1961 లో దేవస్థానం పూలతోటల పెంపకానికి, పోషణకు, రక్షణకు ప్రత్యేకంగా ఉద్యాన

వన నిర్వహణశాఖను నెలకొల్పింది. దీనికి సంవత్సరానికి సుమారు 6 లక్షల రూపాయలు ఖర్చు అవుతోంది. శ్రీవారికి వారితోటలలో ఉత్పత్తి అయ్యే గులాబీలు, చామంతులు, నేలమానుసంపెంగపూలు, మల్లెలు, జాజులు, గన్నేరు, నందివర్ధనాలు, ఆదిగాగల వివిధకుసుమా లతో అర్చనలు, తోమాల, పూలంగిసేవలు జరుగుతున్నాయి. దమ నం, మరువం, తులసిదళాలు కూడ విరివిగా పూజకు వినియోగింపబడు తున్నాయి. ఈ పూలన్నీ అనేకరంగులు, రకాలుగలవి. ఇవన్నీ త్వరగా వాడని, వాసనపోని రకాలకు చెందినవి. చామంతులలో 50 రకాలు-ఎన్నోరంగులు, గులాబీలలో ఎన్నో రంగులుగలవి పెంచుతున్నారు. వంపులవయ్యారం నింపుకొన్న సౌందర్య సంపంగి, ఒంటిరేకు పూలు, ముద్దపూలు పూసే నేలసంపంగి, తెల్లగాను, చిన్నవిగాను, అందంగాను ఉండే సింహాచలం మానుసంపెంగ, బెంగుళూరు, చైనాసంపెంగలు-ఇన్నిరకాల సంపెంగపూలతో స్వామికి అర్చనలు జరుగుతాయి.

ఈ పూలతో కంఠ, హృదయ, నాభి, కటి, జాను, పాదపర్యంత మాలలు, కఠారి, శంఖ, చక్ర, శిరో, శిఖరమాలలు రచింపబడతాయి. ఈపూలదండలు కట్టడానికి అరటిచెట్టు నారనుమాత్రమే ఉపయో గిస్తారు. దారంమాత్రం ఎన్నడూ ఉపయోగింపరు. శ్రీవారి దేవాలయ ప్రాంగణంలో పూలమాలలు రచించే స్థానానికి 'యామునత్తురై' అని పేరు. యామునాచార్యుని కాలంలో పూలంగి, తోమాలసేవలు అధిక తర ప్రాముఖ్యం సంతరించుకొన్న కారణంగా ఆ మాలికానిర్మాణ కేంద్రానికి ఆపేరు వచ్చింది. సాళువనరసింహుడు సంపెగవృక్షాలతో నింపిన శ్రీవారి సంపంగి ప్రదక్షిణాన్ని తిలకించి పులకించిన శ్రీకృష్ణ దేవరాయలు తన 'ఆముక్తమాల్యదలో' శ్రీవిల్లిపుత్తూరు వర్ణనలో-కృష్ణస్వామి దేవాలయంచుట్టూ సంపెంగవృక్షాలు ఉన్నట్లు సాక్షా త్కరింపజేసాడు. శ్రీవారి పూలంగిసేవాప్రియత్వానికి స్వామివారి

సంపెంగ ప్రదక్షిణం ఒకప్రబలమైన తార్కాణం. "మలయపుగాలి రేలు వనమాలి విమానపతాక ఘల్లుమంచులియుం బసిండి మువ్వగమి నొక్కమాటుగదల్ప, నిల్కిమిన్నలము తదీయ హేమవరణాంచల చంపకశాఖలందుఁ బక్షులు రొదసేయు, నేగెనని కూడుదురల్కల దీటి దంపతుల్"

— ఆముక్తమాల్యద.

శ్రీకృష్ణదేవరాయుని ఈపద్యం శ్రీనివాసుని పూలంగివైభవాన్ని చెప్పక చెప్పుతోంది. చంపకశాఖలందు పక్షులరొదలలో, మలయపుగాలిరేలు వనమాలి విమానపతాకాంకిత ఘంటలధ్వనులలో శ్రీనివాసుని పూలంగివైభవాన్ని శ్రీకృష్ణదేవరాయలు ధ్వనింపజేసాడు. భక్తుల హృదయాలలో ప్రతిధ్వనింపజేసాడు.

## నేత్రదర్శనం

ప్రతిగురువారం శ్రీనివాసునకు వేటగాని తొడిగి, పూలంగి సేవ కావించి నందకఖడ్గం చేతిలో నిలుపగానే మహారౌద్రం వచ్చేదట. ఇది 16 వ శతాబ్దంనాటి విషయం. స్వామివారి పూజారులు ఆసమయంలో గర్భాలయంలోనికి వెళ్ళడానికి భయపడేవారట. పన్నెండు సంవత్సరాలు శ్రీకృష్ణదేవరాయుని గురువుగారైన వ్యాసతీర్థులవారు పూలంగి వచేసి స్వామివారిని సుప్రసన్నులను కావించినారట. తరువాత ఆలయ అర్చకులు పూలంగిసేవలో పాల్గొన్నారట, శ్రీవారు గురువారం, శుక్రవారం కన్నులు తెరుస్తారు. సంపూర్ణదృష్టిని ప్రసరిస్తారు. మంచివారిపట్ల కృపాదృష్టులను ఆరోజులలో సారిస్తారు. వారికి మేలు జరుగుతుంది. దుష్టులను శిక్షించడానికి వారిపై రౌద్రమైన దృక్కులను ప్రసరింపజేస్తారు. ఆవిధంగా కలియుగంలో పూలంగి, అభిషేక సేవాసమయాలలో స్వామివారు తమ అవతారసహజమైన దుష్టశిక్షణ, శిష్టరక్షణ కార్యక్రమాలు నిర్వహిస్తారు శ్రీవారిని శాంతింప

జేయడానికి, సుప్రసన్నులను కావించిడానికి పానకం, వడపప్పు నివేదింపబడతాయి. మంచివారిని మంచిమార్గం తప్పకుండా చూడడం కోసం చెడ్డవారిని మంచిమార్గంలో పెట్టడంకోసం శ్రీవారు లక్ష్మి, శుక్రవారాలలో నేత్రదర్శనం— దృష్టిప్రదర్శనం అనుగ్రహిస్తారు.

అభిషేకం

"కంటి శుక్రవారము గడియలేడింట
అంటి అలమేల్మంగ అండనుండే స్వామిని

సొమ్ములన్నీ కడబెట్టి సొంపుతో గోణముగట్టి
కమ్మని కదంబము కప్పు పన్నీరు
చెమ్మతోన వేష్టువలు రొమ్ముతల మొలచుట్టి
తుమ్మెద మైచాయతోన నెమ్మదినుండే స్వామిని

పచ్చకప్పురమె నూఱి పసిడిగిన్నెల నించి
తెచ్చి శిరసాదిగ దిగనలది
అచ్చెరపడి చూడ అందరికన్నుల కింపై
నిచ్చమల్లెపూవువలె నిటు తానుండే స్వామిని

తట్టుపునుగెకూర్చి చట్టలు చేరిచి నిప్పు
పట్టి కరగించి వెండిపళ్యాల నించి
దట్టముగ మేనునిండ పట్టించి దిద్ది
బిట్టువేడుక మురియుచుండే బిత్తరిస్వామిని"

— అన్నమాచార్య సంకీర్తన

శ్రీనివాసుని ప్రథమగోపురంముందు రెండు ఏనుగులు నిలచి శుక్రవారంనాటి స్వామివారి అభిషేకసేవలో పాల్గొనే సేవాపరులను ఆహ్వానిస్తూంటాయి. అభిషేకం ముగిసేవరకు అక్కడే వేచి ఉంటాయి.

వైదిక స్వస్తివచనాలు మిన్నుముట్టుతుంటాయి. మంగళవాద్యరవాలు ముందు సాగుతుంటాయి "పరిమళంఅర" నుండి స్వర్ణరజితపాత్రలలో నింపిన శ్రీవారి అభిషేకద్రవ్యాలను స్వీకరించి జియ్యంగార్లు, అధికార్లు ఏకాంగులు, అభిషేకఆర్జితసేవాపరులు విమానప్రదక్షిణం చేసి శ్రీవారి సన్నిధానంలో సమర్పించి, బారులు తీర్చి కూర్చుంటారు. జియ్యంగార్లు స్వామివారి నామానికి పచ్చకర్పూరం, కస్తూరి నింపిన పాత్రి సమర్పిస్తారు. అధికారులు కుంకుమపువ్వు, చందనంతో చేయ బడిన నలుగుబిళ్ళలు అర్పిస్తారు. సేవాపరులు పరిమళం, పచ్చకర్పూ రం, కుంకుమపువ్వు, పునుగు, కస్తూరి ఆదిగాగలపాత్రలను శ్రీవారికి అందిస్తారు. స్వామికి ఉదయపుసేవలు సమాప్తమవుతాయి. తిరుమంజ నోత్సవం స్వీకరించడానికి కౌపీనధారుడై శ్రీనివాసుడు సన్నద్ధుడై నిలు స్తాడు. ఆభరణాలకు, అలంకారాలకు అందం అందించేస్వామి అవి లేకుండా మరీ అందంగా కనిపించి భక్తులకు కనువిందు చేస్తాడు, ఎంతో ఆనందింపజేస్తాడు. రెండు వెండిగంగాళాలలో గోక్షీరం, ఇంకొక రెండు వెండిగంగాళాలలో బంగారుబావి నీరు సిద్ధంచేయబడి ఉంటాయి. అర్చకస్వామి పీఠంపై నిలుస్తాడు. జియ్యంగారు ఆకాశ గంగాతీర్థంతోనింపిన సువర్ణశంఖాన్ని అందుకుంటాడు. పురుషసూక్తం పఠిస్తూ పునుగుతైలం ఆపాదమస్తకం అలదుకొన్న శ్రీవారి కిరీటంపై అభిషేకిస్తాడు. స్వామి సన్నిధానంలో ఆచార్యపురుషులు, వైదికోత్త ములు పంచసూక్తాలను, పంచోపనిషత్తులను ఉదాత్తానుదాత్తసర్వ సమ్మేళనంతో శ్రావ్యంగా, శ్రవణసుభగంగా అభిషేకం ముగిసేవరకు గానం చేస్తారు. తరువాత స్వామికి క్షీరాభిషేకం జరుగుతుంది. ఆ క్షీరాభిషేకం పొందేస్వామి తళతళ మెరిసిపోతూ ధవళసుందర మూర్తియై భక్తులను మురిసిపోయేలా చేస్తాడు. వింతకాంతితో విద్యు ల్లతావిగ్రహుడై సాక్షాత్కరిస్తాడు. దివ్యజ్యోతిస్వరూపుడై భాసి

స్తాడు. శరత్పూర్ణిమాసుధాకరుడై అలరిస్తాడు. మరల బంగారుబావి లోని జలంతో అభిషేకం జరుగుతుంది. పచ్చకర్పూరం, కుంకుమపువ్వు, రక్తచందనంపొడి కలిపినపరిమళం శ్రీవారికి ఆపాదశిరః పర్యంతం పూసి నలుగు పెడతారు. స్వామికి మరల జలాభిషేకం చేస్తారు. పుత్తడి బొమ్మవలె స్వామి పసుపుపచ్చగా కనిపిస్తాడు. స్వర్ణప్రతిమారూపం వహించి అందరినీ నవ్వుతూ పలుకరిస్తూన్నట్లు గోచరిస్తాడు. శ్రీ లక్ష్మీ దేవికి (అలర్ మేల్ మంగతాయారునకు) హరిద్రాచూర్ణమిశ్రిత జలంతో శ్రీ సూక్తపారాయణం జరుగుతూండగా అభిషేకం జరుగు తుంది. 108 కలశాలతో నిండినజలంతో శ్రీవారికి శుద్ధోదకాభిషేకం చేస్తారు. ఆకాశగంగాజలంతో నింపిన సువర్ణశంఖంతో శ్రీవారికి అభిషే కం ముగిస్తారు. తెర వేస్తారు, దివ్యప్రబంధపారాయణం తైత్తరీయోప నిషత్తుపఠనం జరుగుతూండగా పొడివస్త్రంతో తడిలేకుండా శ్రీవారిని తుడుస్తారు. కిరీటానికి పొడివస్త్రం అందంగా చుడతారు. జియ్యంగారు పట్టువింజామరతో విసురుతారు. 24 మూరల ధోవతి ధరింపజేస్తారు. 12 మూరల ఉత్తరీయం వల్లెవాటుగా వేస్తారు. నీరు తిరుమణికాపు సమర్పిస్తారు. వెన్న, పంచదార నివేదిస్తారు. హారతి స్వామికి సమర్పి స్తూన్న సమయంలో తెర తీస్తారు. ఇది శ్రీవారికి జరిగే అభిషేకవిశేషం.

భక్తులు ఆ అభిషేకదర్శనం చేసి, రమణమూర్తి దివ్యసౌందర్య మూర్తిని, సహజసౌందర్యమూర్తిని సందర్శించి తన్మయులవుతారు. ప్రతివారం శుక్రవారం కావాలని, శ్రీవారి శుక్రవారఅభిషేకం చూడా లని ప్రతివారు కోరుకుంటారు. "ఆపాదమస్తకము పునుగుతైలపుటభ్యం జనము చేసి, కుంకుమపూవు మొదలగువాని యనుకుతో నలుగుపెట్టి, పన్నీటను, శుద్ధోదకమునను జలకమార్చి తుడిచి, సర్వాంగములందు నారగా కర్పూరధూళి చల్లి మేదించి, దానిపై నారగా పునుగు తైలము రాచి, ముత్యాలతిరునామము మంగళతాళి మొదలగు దివ్యా

భరణములను, వస్త్రములను పుష్పహారములను అలంకరించుటయ్యే డిది" ఈవిధంగా తాళ్ళపాకవారికాలంలో శ్రీవారికి అభిషేకం జరిగేది ఆ సమయంలో తాళ్ళపాకవారు నలుగుపాటలు, అభిషేకపాటలు పాడే వారు. అభిషేకానంతరం అభిషేకపు పన్నీటిపాత్రను చందనతాంబూలాదిసత్కారాలతో అందుకొనేవారు. శ్రీవారికి శాశ్వతంగా అభిషేకం జరగడానికి వారు ఎన్నో అగ్రహారాలు సమర్పించారు.

"ఒకపరి కొకపరి కొయ్యారమై, మొకమునంగళలెల్లా మొలచి నట్లుండె", "పులుగడిగిన యట్టి పురుషోత్తమువు వాడే, ఎలమి నారతులు మీరెత్తరే దేవునికి", "ఏమని చెప్పుదుమమ్మ యీతని సౌభాగ్యము, కోమలపుజవ్వనము గుఱుతైనట్టుండె" అని అన్నమయ్య ఈ విధంగా శ్రీవారి అభిషేకోత్సవంగూర్చి ఎన్నో సంకీర్తనలు కావించాడు. శ్రీనివాస అభిషేకవైభవం ఆ సంకీర్తనలలో మనం చూచి ఆనందిస్తాము. ఆవిధంగా అన్నమయ్య తాను అనుభవించి, ఆనందించి, అభిషేకసుందరమూర్తియైన శ్రీనివాసమూర్తిని ఆవిష్కరించాడు. అభివర్ణించాడు అభినయిస్తూ సంకీర్తనం కావించాడు.

## అభిషేకం - చరిత్ర

భోగశ్రీనివాసమూర్తికి నిత్యాభిషేకం, మూలమూర్తికి నిత్యం పాదాభిషేకం 10 వ శతాబ్దంనుండి జరుగుతున్నాయి. క్రీ. శ. 1380 లో శ్రీదేవి భూదేవి సమేతుడైన మలయప్పస్వామికి తిరుమంజనోత్సవం ప్రప్రథమంగా జరిగే యేర్పాటు జరిగింది. నువ్వులనూనె, చందనం, కస్తూరి, కర్పూరం, కుంకుమపువ్వు మలయప్పస్వామి అభిషేకానికి ఆకాలంలో ఉపయోగింపబడేవి. శ్రీవారికి పునుగుతైలపు లేపనం 16-7-1434 నుండి జరిగే యేర్పాటు జరిగింది. శ్రీవైష్ణవులకు నాయకుడైన ముదలియార్ తిరుక్కలి కన్రిదాసర్ అలగప్పిరానార్ శ్రీనివాసునిపట్ల తన భక్తిభావం వ్యక్తపరచుకోవడానికి ఈ యేర్పాటు

చేసాడు. శ్రీవారికి శుక్రవారంనాడు అభిషేక కార్యక్రమానికి ప్రారంభం క్రీ. శ. 1465 లో జరిగింది. కందాడై రామానుజఅయ్యంగారు ఈ కార్యానికి అంకురార్పణ కావించారు. ప్రతి రెండవ శుక్రవారంనాడు శ్రీనివాసునకు పులుగుకాప్పు నిర్వహించడానికి తగువసతులుకల్పించి శ్రీనివాసుని సేవించిన భక్తుడు కందాడై అప్పాచి అన్నా అయ్యంగారు. 1496 లో వారు ఆ పులుగుకాప్పు సేవను క్రమబద్ధం చేశారు. శ్రీకృష్ణదేవరాయలు శ్రీవారికి అవిచ్ఛిన్నంగా శుక్రవారంనాడు అభిషేకం, పులుగుకాప్పుసేవలు జరగడానికి గుడగూర్ నాడులోని గ్రామం నుండి వేయి వరహాల ఆదాయం కేటాయించాడు. రాయల సంకల్ప బలంతో నెలకొల్పబడిన ఆసేవలు బలపడి నేటికీ నిరంతరాయంగా సాగుతున్నాయి.

శ్రీనివాసుని వక్షస్థలంలోని అలర్ మేల్ మంగతాయారునకు కుంకుమపువ్వుతో అభిషేకం 21-2-1496 లో శుక్రవారం అభిషేకం జరిగింది. 1-3-1506 లో శ్రీవారికి పిమ్మట అమ్మవారికి పసుపుతో అభిషేకం జరిగింది. అదే నేటికీ కొనసాగుతోంది. మొదట 22-5-1477 లోను, తరువాత 31-8-1495 లోను అలర్ మేల్ మంగతాయార్ ప్రస్తావన కనపడుతోంది. ఇది అయ్యవారికి అమ్మవారికి సంబంధించిన అభిషేకపు చరిత్ర.

అభిషేకద్రవ్యాలు నాడు - నేడు

క్రీ. శ. 1583 లో శ్రీనివాసుని అభిషేకానికి 200 వరహాల తూకంగల పచ్చకర్పూరం, 300 పునుగుసంచులు, 30 పణాల తూకం గల కుంకుమపువ్వు, 12 పన్నీరు సంచులు వినియోగింపబడేవి. ఈనాడు 84 తులాల పచ్చకర్పూరం, 36 తులాల కుంకుమ పువ్వు. 1½ వీశెల పునుగుసంచులు, 3 వరహాల తూకంగల కస్తూరి, 7 తులాల పసుపు ఉపయోగింపబడుతున్నాయి. కస్తూరి, పసుపు 1583 నాటికి వినియో

గింపబడలేదు. శ్రీవారికి శుక్రవారం నాడు 13 తులాల పచ్చకర్పూరంతోను, 1½ తులాల కస్తూరితోను నుదుట నామాలు దిద్దుతారు. బోర్నియో కర్పూరం పచ్చకర్పూరం. ఇది సుమిత్రా దీవులలో కాంఫోరా వృక్షపు శాఖలనుండి ఉత్పత్తి అవుతుంది. దీనిమూల్యం చాలహెచ్చు. పంజాబు, పశ్చిమటిబెట్టు, హిమాలయాలలో కస్తూరి వృక్షాలు ఎక్కువగా ఉంటాయి. వానిపత్రాలు కస్తూరివాసనను కలిగి ఉంటాయి. కస్తూరిచెట్ల ఆకులలోని గాఢమైన కస్తూరినిమాత్రమే దైవ సేవలకు వినియోగించాలి. బోర్నియో పచ్చకర్పూరం, వృక్షసంబంధమైన కస్తూరి శ్రీవారి నామాలకు ఉపయోగిస్తారు. బ్రహ్మోత్సవసమయంలో 32 తులాల పచ్చకర్పూరం, 3 తులాల కస్తూరి నామాలను శ్రీనివాసుడు ధరిస్తాడు. శ్రీరామానుజుని కాలంలో శ్రీవారికి 'తిరుమణికాపు' ప్రారంభమైనది.



## శ్రీనివాసుని గడ్డంపై పచ్చకర్పూరం చుక్క కథ



శ్రీనివాసుని గడ్డంవద్దకూడ పచ్చకర్పూరం చుక్కపెడతారు. దానికి కారణం వివరించే ఒకకథ ఉంది. పూర్వం రామానుజాచార్యులు తన శిష్యుడైన అనందాళ్వారును తిరుమలపై నందనవనాలు పెంచి పూలను స్వామికి సమర్పించమని ఆదేశించాడు. భార్యాసమేతుడై ఆనందాళ్వారు తిరుమలకు తరలి వెళ్ళాడు. నందనవనం నిర్మించాడు. అదే ఆనందాళ్వారు నందనవనం. దానికి నీరుపెట్టడానికి చెరువు త్రవ్వడం మొదలుపెట్టాడు. త్రవ్వినమట్టిని గంపలతో గర్భవతియైన అతని భార్య మోసేది. ఆమె శ్రమను తగ్గించాలని శ్రీనివాసుడు బ్రహ్మచారి రూపంధరించి మట్టితట్టలు మోసేవాడు. తను, తనభార్య మాత్రమే శ్రీనివాసుని సేవలు కావించాలని నిర్ణయించుకొన్న ఆనందాళ్వారు ఆ దృశ్యంచూచి ఆగ్రహం చెందాడు. మట్టిబెడ్డ విసరగా

అది బ్రహ్మచారి గడ్డానికి తగిలింది. బ్రహ్మచారి అదృశ్యమయ్యాను. ఆనందాళ్వారువు శ్రీనివాసుని దర్శించి సేవించడానికి వెళ్ళాడు. స్వామి వారి గడ్డంనుండి రక్తంకారడం చూచాడు. పచ్చకర్పూరం అద్ది రక్త స్రావాన్ని అరికట్టాడు. ఆనాటినుండి శ్రీవారి గడ్డానికి పచ్చకర్పూరపు చుక్క ఉంచడం ఆచారంగా పరిణమించింది. నిత్యం $1\frac{1}{2}$ తులాల పచ్చకర్పూరంతో శ్రీవారి గడ్డంపైన చుక్క పెడతారు. శ్రీవారు భక్తులు శ్రమపడడం భరించలేరని వారిగడ్డంపై గల పచ్చకర్పూరపు చుక్క చాటుతుంది. భక్తుల బాధలు నివారించడానికి తాను గాయ పడడానికైనా సిద్ధపడే దయాంతరంగుడు శ్రీనివాసుడని గడ్డంపై పచ్చ కర్పూరపు చుక్క తెలుపుతోంది.

"పూతో భవ"

అన్నా అయ్యంగారు, శిత్తముశెట్టి, బండారం శిరుతిమ్మయ్య, రాయసం కోనప్పయ్యర్, కుమార తాతాచారివంటి భక్తులు క్రీ శ. 1496 నుండి 1583 వరకు శ్రీవారికి అభిషేకానంతరం ఉన్న ప్రసాద నివేదనలు కావించడానికి దానశాసనాలిచ్చారు. సుమారు 200 సం వత్సరాల క్రితం శ్రీవారి హస్త ముద్రలను అభిషేకంసమయంలో చంద నంతో తీసేవారట. కుడిచేతి ముద్రలను 'అభయహస్తం' అని, ఎడమచేతి ముద్రలను 'మాణిక్యం' అని వ్యవహరిస్తూ భక్తులకు విక్రయించే వారని శ్రీ వి. యస్. శ్రీనివాసరావు తమ 'తిరుపతి శ్రీ వేంకటేశ్వర- బాలాజీ' అనే రచనలో ప్రకటించారు. నేడుకూడ శ్రీవారి హస్త రేఖాంకితాలు చందనంతో తీసికొని అర్చకులు, జియ్యంగార్లు, అధి కార్లు నియమానుసారం తీసికొంటారు. శ్రీవారికి అభిషేకించిన పాలను ప్రసాదంగా భక్తులకు వినియోగిస్తారు. శ్రీపాదరేణువు, శ్రీపాదచంద నం, శ్రీపాదవస్త్రం భక్తులకు శ్రీనివాసుడు అనుగ్రహించే అపూర్వ మైన కానుకలు. భక్తులకు 'పూతో భవ' అని దీవిస్తూ వారి శిరస్సు

లపై అర్చకస్వాములు శ్రీవారి అభిషేక తీర్థం జల్లుతారు. నేడు శ్రీవారి వైకుంఠ హస్తంనుండి జారే అభిషేకపవిత్ర తీర్థాన్ని భక్తులకు వినియోగిస్తున్నారు. పునుగుతైలంతో కూడిన కస్తూరికర్పూర మిశ్రితమైన శ్రీహరి అభిషేకపాద తీర్థం సర్వులు సేవించవలసిన ఇహపరసాధకమైన సిద్ధౌషధం.

"శ్రీహరి పాద తీర్థంబే చెడని మందు
మోహపాశాలు గోసి మోక్షమిచ్చే మందు
కారమై కంటగించని కడు చల్లని మందు
నూరని కాచని యట్టినున్నని మందు
కోరికతో వెలవెట్టి కొనితే వల్లని మందు
వేరు వెల్లంకులు కూర్చనట్టి వెందుగోని మందు
గుఱుతైన రోగములు గుణముచేసే మందు
దిరితములు పెడబాపే దొడ్డ మందు
నిరతము బ్రహ్మాదులు నేరుపుతో సేవించే మందు
నరకము సోరనట్టి నయమయిన మందు
పొంకముతో భయములు పొందనియ్యని మందు
మంకుబుద్ధులు మాన్పి మన్నించే మందు
పంకజాక్ష వేంకటరమణ ప్రపన్నుని మందు
శంకించక తనదాసుల చేపట్టే మందు"

— అన్నమయ్య సంకీర్తనం.

# నిత్య కళ్యాణం

"నమో నారాయణా నా విన్నప మిదివో
సమానుడగాను నీకు సర్వేశ రక్షింపవే
మనసు నీయాధీనము మాటలు నీవాడేటివే
తనువు నీపుట్టించిన ధన మిది
మును నీపంపున నిన్ని మోచుకున్నవాడ నింతే
వెనక నన్ను నేరాలువేయక రక్షించవే
భోగము లెల్లా నీవి బుద్ధులు నీవిచ్చినవి
యీగతి నాబతుకు నీవిరవైనది
చేగదేర నీవు నన్ను చేసినమానిసి నింతే
సోగల నా యజ్ఞానము చూడక రక్షించవే
వెలినీవే లోనీవే వేడుకలెల్లా నీవే
కలకాలము నీ కరుణే నాకు
యిల శ్రీ వేంకటేశ నీవేలుకొన్నబంట నింతే
నెలవు దప్పించక నీవే రక్షించవే"

— అన్నమయ్య అధ్యాత్మసంకీర్తనం

శ్రీనివాసునకు భక్తులు ఎంతో కృతజ్ఞతతో ఎన్నో సేవలు చేస్తారు. "మామనస్సులు, మాటలు నీవి. మా తనువులు సంపదలు నీ విచ్చినవి. భోగాలు, బుద్ధులు నీవు అనుగ్రహించినవి. కలకాలం నీ కరుణ మాపై నిలవాలి. లోపల, వెలుపలా, అంతటా నిండి ఉన్నావు. మాలో ఉండి నడిపిస్తున్నావు. వేడుకలన్నీ నీవే! అందుకే నీకీవేడు కలు, సేవలు చేస్తున్నాము. మమ్ము రక్షించమని కోరుతున్నాము. ఈ విధమైన భావాలు వారి భావాంబరవీధులలో మెదులుతూన్న భక్తులు నిత్యం తిరుమలపై శ్రీనివాసునకు ఎన్నో వేడుకలు చేస్తారు. కానుక

లందిస్తారు. వానిని ఆర్జితసేవలరూపంలో అందిస్తారు. స్నపనోత్సవం, సహస్రకలశాభిషేకం, తిరుప్పావడ, పూలంగిసేవ, అభిషేకం ఆదిగా గల ఆర్జితసేవల వివరాలు తెలిసికొన్నాము. కోవిల ఆళ్వారు తిరుమంజనం, ఆమంత్రణోత్సవం, వసంతోత్సవం, బ్రహ్మోత్సవం, కళ్యాణోత్సవం, డోలోత్సవం, వాహనసేవలు, ప్రసాదనివేదనలు మొదలైనవి ఇతర ఆర్జితసేవలు. ఈసేవలు చేసేభక్తులు దేవస్థానం నిర్ణయించిన మూల్యం చెల్లించాలి. భక్తులు మూల్యం చెల్లించి నిర్వహింపజేసే ఈసేవలు ఆర్జితసేవలుగా పిలువబడుతున్నాయి.

## కోవిల ఆళ్వారు తిరుమంజనం

శ్రీవారి గర్భాలయం 'కోవిల ఆళ్వారు' అని వ్యవహరింపబడుతుంది. తిరుమంజనం అంటే పరిమళద్రవ్యాలతో గర్భాలయాన్ని పరిశుభ్రపరచడమని భావం. శ్రీవారి బ్రహ్మోత్సవానికి ముందు విధిగా కోవిల ఆళ్వారు తిరుమంజనం జరుగుతుంది. నేడు ఆర్జితసేవగా ప్రతి గురువారం ఉదయం జరుగుతుంది. గర్భాలయంలోని అన్నివిగ్రహాలను అఖండదీపంతో సహా ముందుమండపంలో ఉంచుతారు. కుంకుమ, కర్పూరం, చందనం పెద్దముద్దగా జేసి గర్భాలయపు గోడలకు క్రింది నేలకు, పైకప్పునకు దట్టంగా పట్టిస్తారు. నీరు సోకని ఒక వస్త్రంతో మూలమూర్తికి రక్షణ కల్పిస్తారు. పిమ్మట పరిమళద్రవ్యాలు కలసిన జలంతో గర్భాలయాన్ని పరిశుభ్రం కావిస్తారు. మూలమూర్తికి వేసిన నీటెని పీల్చని తెరను తొలగిస్తారు. భోగశ్రీనివాసమూర్తిని, ఇతర మూర్తులను గర్భాలయంలో యథాస్థానాలలో నిలుపుతారు. మూలవరులకు, భోగవరులకు లఘుతిరుమంజనం జరుగుతుంది. కోవిల ఆళ్వారు తిరుమంజనం ఉదయం మొదటిగంట తరువాత జరుగుతుంది. శ్రీవారికి నివేదనలు జరగడంతో కోవిల ఆళ్వారు తిరుమంజనోత్సవం సమాప్తమవుతుంది. క్రీ. శ. 16వ శతాబ్దంనుండి కోవిల ఆళ్వారు తిరుమంజ

నోత్సవం జరుగుతోన్నట్లు తిరుమల శాసనాలు ప్రకటిస్తున్నాయి. కోవిల కల్వి రామానుజ జియ్యంగారు శ్రీవారి గర్భాలయం పరిశుభ్రం కావించే కోవిల ఆళ్వారు తిరుమంజనోత్సవానికి ఎక్కువ ప్రాముఖ్య మిచ్చి దానికోసం పాటుపడ్డ మహనీయుడు. ఆ సమయంలో స్వామి వారికి నివేదనలు జరిగేపద్ధతి నెలకొల్పిన భక్తశిఖామణి అతడు. పరమ పవిత్రమూర్తియైన శ్రీ వేంకటరమణమూర్తి నిలిచిన పవిత్రమైన గర్భాలయాన్ని పరిశుభ్రం కావించడంద్వారా పవిత్రం కావించే ఉత్స వం కోవిల ఆళ్వారు తిరుమంజనోత్సవం. పరిశుభ్రతలో పవిత్రత ఉందని నిరూపించే ఉత్సవమిది. శుచిత్వం దైవత్వం తరువాతది అనే దానికి సంకేతంగా ఈ ఉత్సవం యేర్పడి నాలుగు శతాబ్దులుగా అవి చ్ఛినంగా జరుగుతోంది.

## వసంతోత్సవం

శ్రీవారికి ఆమంత్రణోత్సవం చేసిన సేవాపరులు తోమాలసేవ, అర్చన, ఏకాంతసేవాదర్శనాదులు పొందగలుగుతారు. మధ్యాహ్నం నైవేద్యం అయినపిమ్మట వారికి పొంగలిప్రసాదం లభిస్తుంది. వసం తోత్సవం చైత్రశుద్ధ త్రయోదశి, చతుర్దశి, పూర్ణిమాదినాలలో మూడురోజులు వసంతమండపంలో శ్రీదేవి, భూదేవి సమేతుడైన మలయప్పస్వామికి జరుగుతుంది. ఇది ఆర్జితసేవగా కూడ జరుగుతుంది. విలంబి అనేవ్యక్తి మొదట శ్రీ వసంతోత్సవం చేసాడు. ఫాల్గుణ మాసంలో ఉత్తరాభాద్ర నక్షత్రంలో వసంతోత్సవానికి అంకురార్పణ చేసాడు. కృత్తికానక్షత్రంనాడు ఉద్వాసన చేయించాడు. నాలుగు దినాలు జరిగింది, ఆనాటి వసంతోత్సవం. వెండిరథంపై శ్రీవారికి ఊరేగింపుకూడ జరిగిందట. ఆలయానికి పశ్చిమభాగంలో ఉండే వసంత మండపంలో ఈ ఉత్సవం జరుగుతుంది. ఇది మూడునాళ్ళుజరిగే ఉత్సవం. సేవాపరుల, దేవస్థానంవారల అవకాశాలను పట్టి తక్కువ

దినాలలో జరుపబడుతుంది. ఈ ఉత్సవం చేయించినవారికి వస్త్రబహుమానం, శ్రీవారి దర్శనభాగ్యం లభిస్తాయి. ఇది ఋతుసంబంధమైన ఉత్సవం. ఈ ఉత్సవం చేయించినవారికి శ్రీవారి అనుగ్రహం లభించి ఆయురారోగ్యభాగ్యాలు సిద్ధిస్తాయి. సేవాపరుల జీవితాలలో వసంత శోభలు ప్రసరిస్తాయి.

## బ్రహ్మోత్సవం

శ్రీనివాసునకు బ్రహ్మ ప్రప్రథమంగా చేసిన ఉత్సవం బ్రహ్మోత్సవం. ధ్వజారోహణంతో ప్రారంభమై రథారోహణంతో ముగిసే ఉత్సవమిది. శ్రీవారికి ఈఉత్సవం నవరాత్రులలో జరుగుతుంది. ఇది ఆర్జితసేవగా కూడ జరుపబడుతోంది. ఇది మూడుదినాలు జరిగే ఉత్సవం. సేవాపరులసమయాన్ని, దేవస్థానంవారి సమయాన్ని అనుసరించి ఇంకా తక్కువరోజులలోకూడ నిర్వహింపబడుతుంది. ఆఉత్సవ దినాలలో సేవాపరులకు పొంగలి, దోసెవంటి ప్రసాదాలు లభిస్తాయి. ఉత్సవం ముగిసినపిమ్మట యజమానికి వస్త్రబహుమానం శ్రీవారి దీవనలతో లభిస్తుంది. వారికి శ్రీవారి దర్శనభాగ్యం కలుగుతుంది. క్రీ. శ 966 లో సమవాయిభోగ శ్రీనివాసమూర్తిని ప్రతిష్ఠచేసిన సమయంలో శ్రీవారికి బ్రహ్మోత్సవాన్ని మహావైభవోపేతంగా నిర్వహించి ధన్యురాలైనది.

## డోలోత్సవం

క్రీ. శ. 1445–1492 మధ్యపాలించిన సాళువ నరసింహరాయలు కందాడ రామానుజయ్యంగారి అభిమతాన్ని మన్నించి శ్రీవారికి డోలోత్సవం ప్రవేశపెట్టి, నిర్వహించి ఆ ఉత్సవం దర్శించి ఆనందపరవశుడయ్యాడు. భక్తులను ఆనందింపజేసాడు. ఆనాడు ఇది ఐదురోజుల ఉత్సవం. చైత్రశుద్ధ షష్ఠినాడు దీనికి అంకురార్పణ జరిగేది.

సోమకుంభంలో ప్రతిమ ఉంచి, నవధాన్యాలు జల్లి ఈ ఉయ్యాలసేవను ప్రారంభించేవారు దశమినాడు హోమంతో, పూర్ణాహుతితో ఉత్సవం సమాప్తమయ్యేది. ప్రతిదినం శ్రీదేవి, భూదేవి సమేతుడైన మలయప్పస్వామికి డోలోత్సవం జరిగేది. విశేషంగా ప్రసాదాలు నివేదింపబడేవి. ఈ ఐదురోజుల ఉత్సవం నేడు స్వామికి జరగడంలేదు. కాని బ్రహ్మోత్సవసమయంలో సాయంసమయంలో శ్రీవారికి ఊంజలి (ఉయ్యాల) సేవ అపూర్వంగా జరుగుతుంది. ప్రతిదినం అద్దాలమేడలో డోలోత్సవం ఆర్జితసేవగా జరుగుతుంది.

రంగమండపంనుండి నిత్యం సాయంసంధ్యాసమయంలో బంగారు పల్లకిలో శ్రీదేవి, భూదేవిసమేతుడైన శ్రీ మలయప్పస్వామి అంగరంగభోగాలు, మహారాజమర్యాదలు అందుకుంటూ ఎదురుగా ఉన్న ఐనా మహల్లోనికి ప్రవేశిస్తాడు. అద్దాలమహలులోని డోలామండపమందలి బంగారు ఉయ్యాలను మల్లయప్పస్వామి దేవేరులతో అలంకరిస్తాడు. విద్యుద్దీపాలకాంతులతో అద్దాలమేడ నిండిపోతుంది. వేదపఠనం, దివ్యప్రబంధపారాయణం శ్రవణపేయంగా సాగుతూన్న సమయంలో శ్రీవారు డోలావిహారం చేస్తారు. నారీ నారీ నడుమ మురారిగా సహస్రరూపాలలో అద్దాలలో కనపడతారు. శ్రీవారు తాను బింబమని భక్తుడు ప్రతిబింబమని వివరిస్తూ బింబప్రతివాదాన్ని నిరూపించడానికై డోలావిహారం చేస్తారు. దర్పణభవనంలో శ్రీస్వామివారి డోలావిహారమహోత్సవం సందర్శించడం భక్తుల పూర్వజన్మసుకృతం. ఆ ఉత్సవం చేయించడం సేవాపరుల మహాభాగ్యం. సీతామాతతో శ్రీరాముడు డోలావిహారంచేసి మునులను తన్మయులను కావించాడు. శ్రీకృష్ణుడు ఇష్టసఖులతో డోలావిహారం చేసి లీలావిలాసరసికుడై గోపికలను, గోకులాన్ని అలరించాడు. శ్రీనివాసుడు నిత్యం డోలావిహారంచేస్తూ

భక్తబృందాలను ఆనందపరవశులను, భక్తితన్మయులను చేస్తున్నాడు. ప్రతిభక్తుడు ఆదృశ్యంచూచి స్వామి తన మనోడోలలోనే విహరిస్తున్నాడని భావించి మురిసిపోతాడు. దీన్నే "డోలాయాం భజ డోలాయాం" అంటూ అన్నమయ్య తియ్యగా గానంచేసాడు.

శ్రీవారికి మధురపదార్థనివేదన జరుగుతుంది. హారతి ఇవ్వబడుతుంది. దీనిలో లక్ష్మీవినోదం ఒక ముఖ్యాంశం. అర్చకస్వామివారి శ్రీ చందన, తాంబూల, ప్రసాదాదులను సేవాపరులకు సమర్పిస్తాడు. వస్త్రబహుమానం జరుగుతుంది. డోలోత్సవం, ప్లవోత్సవం చేసిన వారికి శ్రీహరి సువర్ణప్రతిమకానుకగా లభిస్తుంది. సుప్రసన్నమైన రూపం, వదనం, దృష్టిగల శ్రీవారిని పూజించి, జపించి, ధ్యానించి, సేవించి శ్రీనివాసానుగ్రహపాత్రులు కావడానికి ఆ సువర్ణప్రతిమా బహుమానం సేవాపరులకు ఉపయోగపడుతుంది.

## వాహన సేవలు

భక్తులు నిత్యం శ్రీవారికి వారు సంకల్పించిన విధంగా ఎన్నో వాహనసేవలు చేయిస్తారు. సర్వభూపాల వాహనం, గరుడవాహనం కల్పవృక్ష వాహనం, పెద్దశేషవాహనం, సూర్యప్రభవాహనంవంటి బంగారువాహనాలపై శ్రీదేవి, భూదేవి సహితుడైన మలయప్ప స్వామివారికి వాహనసేవలు భక్తులకోరికల ననుసరించి, వారు మ్రొక్కుకొన్న తీరులననుసరించి ఉత్సవాలు నిర్వహింపబడతాయి. గరుడ వాహనం, చిన్నశేషవాహనం, చంద్రప్రభవాహం, గజవాహనం, అశ్వవాహనం, సింహవాహనం, హంసవాహనం, ఆంజనేయవాహనం వంటి వెండివాహనాలపై స్వామివారికి వాహనసేవలు జరుగుతాయి. వజ్రకవచంతో కూడిన, వజ్రకవచం లేకుండిన మలయప్పస్వామివారికి ఈవాహనసేవలు యేర్పడ్డాయి. ఇవన్నీ ఆర్జితసేవలు. రంగమండపంలో

ఈ వాహనసేవలు జరుగుతాయి. అవకాశాన్నిబట్టి తిరువీథులలో ఊరేగింపు జరుగుతుంది. నివేదన, హారతి సమర్పింపబడతాయి. సేవాపరులు వడలు ప్రసాదంగా పొందుతారు. శ్రీవారికి అధికసంఖ్యాకులు బంగారు, వెండి గరుడవాహనసేవలు చేయిస్తారు. ఈవిధంగా శ్రీదేవి, భూదేవి పరివృతుడైన శ్రీ మలయప్పస్వామివారికి వాహనసేవలు చేయించడం, వానిని చూడడం మరువలేని మధురానుభూతిని భక్తులకు కలిగిస్తుంది.

తిరుపతిలడ్డు

కొందరు భక్తులు శ్రీవారికి ప్రసాదనివేదనలు కావింపజేస్తారు. క్రీ. శ 966లో సమవాయి భోగశ్రీనివాసమూర్తిని ప్రతిష్ఠింపజేసిన సమయంలో శ్రీవారికి నివేదనకైంకర్యం చేయడానికి శాసనమిచ్చింది. శ్రీవారికి చేసే అన్నకూటోత్సవం (తిరుప్పావడ). ఇట్టి అన్నప్రసాద నివేదనోత్సవమే క్రీ. శ 966లో 1/2 శేరు బియ్యపు అన్నం నివేదింపబడేది. ఏ ప్రసాదనివేదనమైనా కులశేఖరపడి అవతలనుండిమాత్రమే శ్రీవారికి నివేదింపబడాలి. నివేదింపబడుతుంది. పండ్లు, వెన్న, పాలు, పంచదారవంటివిమాత్రమే శ్రీవారిసన్నిధిలో సమర్పించబడి నివేదింపబడతాయి. అభిషేకద్రవ్యాలు, కోవిల ఆళ్వారు తిరుమంజనద్రవ్యాలు, జలం, చందనం, పుష్పాలు, పూలమాలలువంటివానికిమాత్రమే శ్రీవారి గర్భాలయప్రవేశార్హత ఉంది. కొద్దిపాటి ఆవుపెరుగు అన్నం శ్రీవారిచెంత నివేదింపబడుతోంది. శ్రీవారి ఆలయంలో సుమారు 800 శాసనాలు ఉన్నాయి. పదవశతాబ్దంనుండి పదునెనిమిదవశతాబ్దం వరకునల శాసనాలలో శ్రీవారికి అన్నప్రసాదనివేదనలకు, ప్రసాదనివేదనలకు సంబంధించిన ఎన్నో శాసనాలు కనబడుతున్నాయి. దీపదాన శాసనాలుకూడ లెక్కకు మిక్కిలిగానే ఉన్నాయి ప్రాచీనకాలంలో అన్నం, పెసరపప్పు, పెరుగు, నెయ్యితో రూపొందించిన ప్రసాదాలు నివేదింపబడేవి. వానికే ఎక్కువ ప్రాముఖ్యం ఉండేది. తరువాతకాలంలో

రుచిగాఉండే ప్రసాదాలకు ప్రాధాన్యం హెచ్చింది. పర్యవసానంగా పాయసం, దధ్యోదనం, చక్కెరపొంగలి, అతిరసం, అప్పం, వడ, ఇడ్లీ, సుఖియాన్, గోధికాసిక్కె, ఘట్టిక్కె, పాల్‌కొలంబువంటి రుచిగాఉండే ప్రసాదాలు నివేదింపబడ్డాయి. అతిరసపడి, అప్పాపడి, వడపడి, గోడిపడి, ఇడ్డిలిప్పడివంటి ప్రసాదనివేనలపేర్లు శాసనాలలో కనబడుతున్నాయి. సాళువ నరసింహరాయలకాలంలో అన్నప్రసాదనివేదన పరిమాణం అధికం కావింపబడింది. సంవత్సరానికి 377 మరకాలుల అన్నప్రసాద నివేదనం ఆ చక్రవర్తికాలంలో శ్రీవారికి జరిగేది. 2000 మందికి ఉచితంగా మృష్టాన్నభోజనం పెట్టే రామానుజకూటాన్ని తిరుపతిలో నమ్మాళ్వారు సన్నిధిలో ఆరవీటికొండరాజు క్రీ. శ. 1550లో స్థాపించి, తిరుమల తిరుపతియాత్రికులకు ఎనలేనిసేవలు కావించిన ఉదారచరితుడు. తిరుపతియాత్రికులపాలిట అన్నదాతగా వర్ధిల్లిన మహోన్నతుడు. అపి నాడు స్వామికి నివేదింపబడిన ప్రసాదాలు. భక్తులకు లభించిన స్వామి నివేదన లివి.

ఈనాడు శ్రీవారికి అప్పం, లడ్డు, వడ, పోళి, దోసె, తేనెతొళ, సుఖియం, జిలేబివంటి ప్రసాదాలు, ధద్యోదనం, పులిహోర, పొంగలి, చక్కెరపొంగలి, సాకరాభాత్, కేసరిభాత్, పాయసం, సీరావంటి అన్నప్రసాదాలు నివేదింపబడుతున్నాయి. ఇట్టిప్రసాదనివేదనలు గృహస్థులు, భక్తులు నిర్ణయించినపైకం దేవస్థానానికి సమర్పించి శ్రీవారికి చేయిస్తారు. స్వామివారిప్రసాదాన్ని పొందుతారు. పెరుగువెన్నతో కూడిన అన్నం, పప్పు, పులుసు, కూరలు అన్ని కలిపినఅన్నంకూడ శ్రీవారికి నివేదింపబడతాయి. ఉదయం బెల్లం, రాత్రి పాయసం స్వామికి ప్రత్యేకంగా నిత్యం నివేదింపబడతాయి. లక్ష్మీ, శుక్రవారాలలో వడ పప్పు విధిగా నివేదింపబడుతుంది. ఈ ప్రసాదాలలో తిరుపతి లడ్డు

ప్రత్యేకత పొందింది. 5-4-1981 ఉగాదినుండి స్వామిని దర్శించిన అందరుభక్తులకు ఉచితంగా లడ్డుప్రసాదం అందుతోంది. భక్తులకు భగవంతుని ప్రసాదం అందించాలనే దేవస్థానపు సంకల్పం అభినంద నీయం. పేదయాత్రికులకు అన్నప్రసాద వినియోగ, ప్రసాదవినియోగ పథకాల్ని చేపట్టి దేవస్థానం విజయవంతంగా నిర్వహించడం హర్షదా యకం. ఈవిధంగా శ్రీవారు శ్రీమంతులకు, నిరుపేదలకు తరతమాలు చూపకుండా సమతాభావనతో తమప్రాసాదం అనుగ్రహిస్తున్నారు. నాగపూరునుండి వచ్చిన పుట్టుగుడ్డివాడైన యువకుడు శ్రీనివాసుని దివ్యప్రసాదమైన లడ్డు కళ్ళకు అద్దుకొని తిరుమలపై స్వామి సన్నిధా నంలో స్వీకరించిన వెంటనే నేత్రదృష్టిని పొందగలిగాడు. ఈ సంఘట నను దినపత్రికలు ప్రముఖంగా ప్రకటించడం పత్రికాపాఠకులకు విది తమే! అంధునకు దృష్టిని ప్రసాదించింది తిరుపతిలడ్డు. శ్రీనివాసుని ప్రసాదం గ్రుడ్డివారికి చూపునిస్తుంది. భక్తులకు సక్రమదృష్టిని ప్రసాది స్తుంది. క్రీ. శ. 1800 నాటికి తిరుమల శ్రీవారు 42 గ్రామాల ఆదా యంతో నిత్యం 60 సార్లు సంపూర్ణనివేదనలు ఆరగించేవారు. బ్రహ్మో త్సవాలలో కులశేఖరపడినుండి బంగారువాకిలి అంతా ప్రసాదపు గంగాళాలతో నిండిపోయి నివేదింపబడుతుంది. సూర్యోదయానికి పూర్వం ఇంతపరిమాణంలో శ్రీవారికి నివేదన జరుగుతుంది. శ్రీవారి కరుణవల్లనే ఆ సమయానికి అవి తయారవుతాయి. ప్రసాదాలు ఆకలి గొన్న దాసులకు, భక్తులకు అనుగ్రహించడానికే శ్రీ వేంకటేశ్వర స్వామి ఆరగిస్తాడు. అదే అన్నమయ్య అంటున్నాడు.

"ఏ పొద్దుచూచిన దేవుడిట్లానే యారగించు
రూపులతో పదివేలు రుచులైనట్లుండెను
మేరుమందరాలవలె మెఱయు నడ్డెనలు

సూరియ చంద్రులవంటి చుట్టు పళ్ళేలు
ఆరని రాజాన్నాలు అందుపై వడ్డించగాను
బోరన చక్కెలు రాసివోసినట్లుండెను

పలుజలధులంటి పైడి వెండి గిన్నెలు
వెలికొండ లంత లేసి వెన్నముద్దలు
బలసిన చిలుపాలు పంచదార గుప్పగాను
అలరు వెన్నెల రసమందిచ్చి నట్లుండెను

పండిన పంటలవంటి పచ్చళ్ళు కూరలును
వండి యలమేలుమంగ వడ్డించగా
అండనె శ్రీవేంకటేశు డారగించి మిగులగ
దండిగా దాసులకెల్ల దాచినట్లుండెను"

— అన్నమయ్య అధ్యాత్మసంకీర్తన

భక్తులకు శ్రీనివాసునకు నివేదింపబడిన ప్రసాదాలు ఎంతో విలువైనవి. శ్రీనివాసునితో అతిసన్నిహితతత్వం కలిగిన శేషవస్త్రం, శ్రీపాదవస్త్రం, శ్రీపాదచందనం, శ్రీపాద రేణువు, శ్రీపాదతీర్థం వంటి ఆహార, ఫలహార సంబంధంలేని ప్రసాదాలు భక్తులు మహిమాన్వితములైన దివ్యప్రసాదాలుగా భావిస్తారు. పవిత్రోత్సవంలోని పవిత్రమాలకూడ అట్టిదే. అవి, చిరకాలం భక్తులు వినియోగించుకోవడానికి వీలుకల్పించే అతిపవిత్రమైన, దివ్యమహిమతో కూడిన ప్రసాదాలు.

## శేషవస్త్రం

మూలవరులకు మిక్కిలి పొడవైన శిల్కువస్త్రాలు ఉపయోగిస్తారు, శిల్కు, లేసు అంచులుగల నూలుబట్టలుకూడ వినియోగిస్తారు. ఉభయదేవేరులకు, మలయప్పస్వామికి, పొట్టివైన శిల్కు,

నూలు, లేసుబట్టలు వాడతారు. మూలవరులు, ఉత్సవరులు నిత్యం పూలదండ్లతో, పరిమళద్రవ్యాలతో సంబంధం కలిగి ఉండడం మూలంగా వారు ధరించిన ఆవస్త్రాలు సుగంధసంభరితమైన వస్త్రాలుగా రూపొందుతాయి. అవి వీడనిసువాసనలతో నిండిఉంటాయి. ఆవిధంగా స్వామివార్ల ధారణకు ఉపయోగించిన వస్త్రాలను భద్రపరుస్తారు. వానినే శేషవస్త్రాలు అంటారు. శ్రీవారు ఉపయోగించినది పెద్ద శేషవస్త్రం. మలయప్పస్వామివారిది చిన్న శేషవస్త్రం. భూరి విరాళాలు సమర్పించే దాతలకు, అతిముఖ్యులకు శ్రీవారి శేషవస్త్ర బహుమతులు లభిస్తాయి. మలయప్పస్వామివారికి అలంకరించిన వస్త్రాలను శేషవస్త్రాలుగా ముఖ్యులకు దేవుని కానుకలుగా సమర్పింపబడతాయి. దేవస్థానపు నిబంధనలనుసరించి శేషవస్త్రబహుమానాలు జరుగుతాయి.

## శ్రీపాదవస్త్రం - శ్రీపాదచందనం

శ్రీవారికి తోమాలసేవాసమయంలో పాదాలపై బంగారు పాదకవచాలు తీస్తారు. శ్రీవారి పాదాలకు పునుగుతైలంతో మర్దనా చేస్తారు. ఆసమయంలో ఒకక్రొత్తశిల్కువస్త్రాన్ని పాదాలను తుడవడానికి ఉపయోగిస్తారు. నిత్యం శ్రీవారి పాదసేవకు ఆవిధంగా చిన్న శిల్కువస్త్రం ఉపయోగింపబడుతుంది. రాత్రి ఏకాంతసేవాసమయంలో శ్రీవారి పాదసేవచేసి పాదాలమధ్యను మంగతాళిపైన, భోగశ్రీనివాసుని హృదయంపైన చందనం ఉంచుతారు. శ్రీవారి పాదాలమధ్య 4 కప్పుల కొలతగల రెండు చందనపుబిళ్ళలు ఉంచుతారు. భోగశ్రీనివాసమూర్తి హృదయంపైన సగంబిళ్ళ, మంగతాళిపై పాతికబిళ్ళ నిలుపుతారు. శ్రీపాదసేవకు ఉపయోగించిన వస్త్రం శ్రీపాదవస్త్రం. శ్రీపాదాలమధ్య ఉంచిన చందనం శ్రీపాదచందనం. భక్తులు శ్రీపాదచందనం సంపాదించి నుదుటను నామంగాను తిలకంగాను ధరిస్తారు. శ్రీపాద

వస్త్రాన్ని తమపూజాపీఠాలలో నిలుపుకొని సంతోషిస్తారు. శ్రీవారి తిరునామంలో ఉపయోగించే పచ్చకర్పూరం, కస్తూరి, పునుగుతైలపు మిశ్రమాన్నికల్పి శ్రీపాదరేణువు అంటారు. దాన్ని నిత్యానుష్ఠానానికి ముందు జలంతో కలిపి సేవిస్తారు. ఆధ్యాత్మిక చైతన్యాన్ని మానవులలో కల్పించే దివ్యవస్తువు అది. మానవుల ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆధిదైవిక తాపాల నుపశమింపజేసే పరమౌషధం అది. శ్రీపాదచందనాన్ని, శ్రీపాదరేణువును మహాప్రసాదం అంటారు. దేవస్థానం ఉద్యోగులు శ్రీవారి మహాప్రసాదం భక్తులకు ఉచితంగా పంచుతారు. అర్చక స్వాములు వీనితో వ్యాపారంచేసి భక్తులనుండి మంచి ఆర్థికలాభం పొందుతారు. శ్రీవారికి నామంగా ఉంచిన కస్తూరి అర్చకులకుమాత్రమే స్వాధీనమవుతుంది అది వారివద్దమాత్రమే వాణిజ్యవస్తువుగా లభిస్తుంది. శ్రీవారి అభిషేకతీర్థం శ్రీపాదతీర్థం.

శ్రీహరిహస్తాల, పాదాల, వక్షస్థలాలను చందనంతో వాని రూపాలను తీస్తారు. వానిని అభయహస్తం, మాణిక్యం, శ్రీపాదాలు, శ్రీవత్సం అంటారు. ఇవి భక్తులకు బహు అరుదుగా లభించే ప్రసాదాలు. పవిత్రోత్సవ సమయంలో శ్రీవారిమూర్తులకు అలంకరించే పవిత్రమాలలుకూడా భక్తులు సంపాదించి వానిని ధరించి జపసిద్ధి పొందుతారు. తమలపాకులు, వక్కలుకూడా ప్రసాదాలుగా లభిస్తాయి. శ్రీవారికి ఉపయోగించిన పూలమాలలు, పూలు, తులసిమాలలు, తులసిదళాలుమాత్రం భక్తులకు వినియోగంకావు. వానిని పూలబావిలో వేస్తారు. వండిన యే పదార్థం స్వామిచెంతఉంచి నివేదించరు. కొద్దిపాటి అన్నం వండి ఆవుపెరుగుతో కలిపి దాన్నిమాత్రం శ్రీవారిసన్నిధిలోనికి కొనిపోయి నివేదిస్తారు. ఈ ఒక్క అన్నప్రసాద నివేదనమాత్రమే శ్రీవారిసన్నిధిలో జరుగుతుంది. ఆ ప్రసాదం పొంద

డం భక్తులు గొప్ప అదృష్టంగా భావిస్తారు. దీన్ని ఆవుపెరుగుతో కల్పిన అన్నప్రసాదం (మాత్రాయి) అంటారు. తిరుమలయాత్రికు వచ్చే ప్రముఖులకు శేషవస్త్రం, మహాప్రసాదం, మనోహారం సమర్పి స్తారు. మనోహారం అన్నది అపూర్వమైనప్రసాదం. వేయించిన మినుములపిండి, బెల్లం, నెయ్యి కలిపిన పెద్దఉండను మనోహారం అంటారు.

## నిత్యకల్యాణం

శ్రీ వేంకటరమణమూర్తి నిత్యకల్యాణ లావణ్యమూర్తి. స్వామి నిత్యం క్రొత్త పెండ్లికుమారుడు. శ్రీవారికి భక్తులు నిత్యం కల్యాణోత్సవం చేయిస్తారు. ఇది ఒక ఆర్జితసేవ. మధ్యాహ్నం 12 గంటలకు గర్భాలయంనుండి వాహనారూఢులై శ్రీ మలయప్పస్వామి వారు శ్రీ భూదేవులతో ఆనందనిలయ విమానప్రదక్షిణంచేసి మంగళ తూర్య వాద్యాలతో శ్రీరంగమండపానికి విజయం చేస్తారు. మలయప్పస్వామి ఒకసువర్ణపీఠంపైన, ఉభయనాంచారులు ఒకసువర్ణ పీఠంపైన ఎదురెదురుగా వేంచేస్తారు.

కల్యాణోత్సవనిర్వహణకాములైన భక్తులు రంగమండపంలో ఆసీనులై ఉంటారు. మలయప్పస్వామి నూతనవరుడు. శ్రీదేవి భూదేవులు నూతనవధువులు. ఇది దేవునిపెండ్లి. ఈ దేవుని పెండ్లికి అందరూ పెద్దలుకారు. స్వామివారు సూత్రధారి. మిగతా భక్తులు, అర్చకులు, వైదికోత్తములు, పరివారజనులు అందరూ పాత్రధారులు. కల్యాణం వైదికమంత్రపూతంగా, వైఖానస ఆగమసూత్రం ప్రకారం జరుగుతుంది. పెండ్లికుమారునికి పెండ్లికుమార్తెలకు మధ్య తెరవేస్తారు. హోమాలు చేస్తారు. ఆయా దేవతలకు, హవిస్సులు సమర్పిస్తారు, దేవుని, అమ్మవార్ల గోత్రప్రవరలు చదువుతారు. మంగళసూత్ర ధారణం- అవుతుంది. పెండ్లికుమారుడు, పెండ్లికుమార్తెలు పూలదం

డలు మార్చుకొంటారు. తలంబ్రాలవేడుకలు జరుపుకుంటారు. కల్యాణ మూర్తులకు అర్చనలు, ఆరగింపులు, హారతులు జరుగుతాయి. ఈ విధంగా ఆర్జిత కల్యాణోత్సవం చేసిన యజమానికి శ్రీవారిదీవనలతో నూతనవస్త్రబహుమానం, కళ్యాణమంగళాక్షతలు, వివిధప్రసాదవిశేషాలు, దక్షిణ లభిస్తాయి. శ్రీవారికి కళ్యాణోత్సవం చేయించడం, చూడడం భక్తులకు గొప్పవేడుక.

శ్రీవారికి పెండ్లివేడుకలు కావించడానికే అన్నమాచార్య పెండ్లి కావించుకొన్నాడట. అన్నమాచార్యుని సంకీర్తనలు విని ఆనందించిన శ్రీ వేంకటేశ్వరుడు ఇతరుల సంకీర్తనలు వినజాలనని అతనికి చెప్పాడట. అంతేకాదు అన్నమాచార్యుని మామగారని సంబోధన చేసి సంభావించాడట. ఈ విషయాలు రేవణూరి వేంకటాచార్యుడు తన శకుంతలాపరిణయప్రబంధంలో వివరించాడు. ఈ విషయాలు గమనించిన తాళ్ళపాకవారు శ్రీవారికి వైవాహికోత్సవం ఘనంగా నిర్వహించారు. ఉట్ల ఉత్సవం, వనభోజనోత్సవం నెలకొల్పారు. తాళ్ళపాక తిరువేంగళనాథయ్య శ్రీవారికి పెండ్లి తిరునాళ్ళు ప్రారంభించాడు. 1546, 1554, 1558 సంవత్సరాలలోని తిరువేంగళనాథుని శాసనాలలోని శ్రీవారి కల్యాణోత్సవపు ప్రశంస కనబడుతోంది. తిరుపతిలో శ్రీ గోవిందరాజస్వామికి వివాహమహోత్సవం చేయించడానికి తాళ్ళపాక చినతిరుమలయ్య యేర్పాటుచేసాడు. ఈ ఉత్సవాలు జరగడానికి తాళ్ళపాకవారు చెందలూరు, మల్లవరం, నేడియం అనే గ్రామాలు శ్రీ భండారానికి అర్పించారు. ఆదాయం తక్కువగావచ్చే ఈ గ్రామాలను ఉపసంహరించుకొని అధికంగా ఆదాయం వచ్చే దేవరాయపల్లి గ్రామం సమర్పించి స్వామివారి వైవాహికమహోత్సవం మహావైభవంగా జరగడానికి తిరువేంగళనాథయ్య ఎంతగానో తోడ్పడ్డాడు.

వైకుంఠవిమానంలో శ్రీదేవి, భూదేవి సహితుడై శ్రీ మలయప్ప పెరుమాళ్ళునకు తిరువీథుల ఊరేగింపు టుత్సవం సాగేది.

నాల్గవనాటి కార్యక్రమం :- హోమం, తిరుమంజనం, ప్రముంగళులకు చందన తాంబూలాదులు సమర్పించడం ముఖ్యమైనవి. పిమ్మట శ్రీవారు హనుమంతవాహనంలోను, దేవేరులు పాలకీలోను ఊరేగేవారు.

ఐదవనాటి కార్యక్రమం :- తిరుమంజనాది కార్యక్రమాలు ముగిసినపిమ్మట మలయప్పస్వామివారు గజవాహనంపైన, దేవేరులు పారిపహేష్యనంపైన ఊరేగేవారు. వైవాహిక కార్యక్రమనిర్వాహకులు కానుకలు అందుకొనేవారు. ఐదురోజులలోను శ్రీవారికి వివిధ రుచ్యములైన ప్రసాదాలు నివేదింపబడి భక్తులకు వినియోగింపబడేవి. తాళ్ళపాకవారు శ్రీనివాసుని కల్యాణమహోత్సవాన్ని నిర్వహించి లోక కల్యాణకారకులయ్యారు. నాడు శ్రీవారికి తాళ్ళపాకవారు నెలకొల్పిన కల్యాణం నేడు నిత్యకల్యాణంగా జరుగుతోంది. కల్యాణసుందరుడు కల్యాణప్రియుడు శ్రీనివాసుడు కల్యాణవేడుకలు అందుకొని తాళ్ళపాక వారికి ఆత్మకల్యాణపరంపరలు అనుగ్రహించాడు శ్రీనివాసుడు. నేడు భక్తులు కావించే నిత్యకల్యాణవేడుకలు స్వీకరిస్తూ భక్తకోటికి ఆత్మ కల్యాణం, మానవకోటికి లోకకల్యాణం ప్రసాదిస్తున్నాడు. మన మనస్సులను నిత్యం శ్రీనివాసుని నిత్యకల్యాణవైభవంతో నింపుకొందాము.

"పసిడియక్షంతలివె పట్టరో వేగమే రారో
దెసల పేరంటాండ్లు దేవుని పెండ్లికిని
శ్రీ వేంకటేశ్వరునికి శ్రీ మహాలక్ష్మికి
దైవికపు పెండ్లి ముహూర్తము నేడు
కావించి భేరులు మ్రోసె గరుడధ్వజం బెక్కె
దేవతలు రారో దేవుని పెండ్లికిని

కందర్ప జనకునికి కమలాదేవికి పెండ్లి
పందిరిలోపల తలబాలు నేడు
గంధమూ విడె మిచ్చేరు కలువడాలు కట్టిరి
అందుక మునులు రారో హరిపెండ్లికిని

అదె శ్రీవేంకటపతి కలమేలు మంగకును
మొదలి తిరుణాళ్ళకు మొక్కేము నేడు
యెదుట నేగేరు వీరేయిచ్చేరు వరము లివె
కదలిరారో పరుషమునులు పెండ్లికిని"

— అన్నమాచార్య అధ్యాత్మసంకీర్తన



# ఆనందనిలయం

"సేవించి చేకొన్నవారి చేతిభాగ్యము
వేవేగ రారో రక్షించీ విష్ణు డీడను

గరుడగంభముకాడ కడు ప్రాణాచారులకు
వరము లొసగీని శ్రీవల్లభుడు
తిరమై కోనేటిచెంత తీర్థఫలములెల్ల
పరుషల కొసగేని పరమాత్ముడు

సేనమొదలారివద్ద చిత్తముతో సుజ్ఞానము
నానాగతి పుట్టించని నారాయణుడు
కానుక పైడిగాదెలకాడ నిజరూపు
ఆనుక పొడచూపీని అఖిలేశుడు

సన్నిధి గర్భగృహాన చనవిచ్చి మాటలాడి
విన్నపాలు వినీ శ్రీవేంకటేశుడు
ఎన్నిక పాదాలవద్ద ఇహముపరము చూపె
మన్ననల నలమేలు మంగవిభుడు"

— అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తన

## వైకుంఠవిమానం

శ్రీనివాసుడు భక్తులకు అనంతలీలలు చూపే ఆది తుదిలేని అనంతరూపుడు. అట్టి స్వామి తన 'సన్నిధి గర్భగృహాన' భక్తుల విన్నపాలు విని చనవిచ్చి వారితో మాట్లాడుతాడు. తన పాదసేవలో ఇహ పరాలను ప్రసాదిస్తాడు. అందుకే భక్తులు ఆనందసంభరితు లవుతారు. శ్రీవారు ఆనందస్వరూపులు. శ్రీవారి భక్తులు ఆనందపరవశులు. వారునిలిచిన తావు ఆనందానికి నెలవు. అందు చేతనే శ్రీనివాసుని నిలయాన్ని, గర్భాలయవిమానాన్ని ఆనందనిలయం, ఆనందనిలయ

విమానమని అంటారు. అనుగ్రహమూర్తి విగ్రహం ఉండాలి. విగ్రహానికి గర్భాలయం ఉండాలి. గర్భగృహంపైన విమానం ఉండాలి. అప్పుడే అది సక్రమమైన, సంపూర్ణమైన, స్వయంసమృద్ధమైన దివ్యస్థలంగా, దేవనిలయంగా రాణిస్తుంది. అనంతమైన సృష్టికి ప్రతిరూపం విమానం. సృష్టికారకుడు విగ్రహరూపుడైన దేవుడు. మానవుడు నివసించే గృహానికి ప్రతిబింబం దేవునిగర్భగృహం. ఆత్మ, పరమాత్మ, విశ్వాత్మల సమ్మేళనం గర్భాలయ, విగ్రహ, విమానాల నిర్మాణ క్రమంలో ద్యోతకమవుతుంది. క్షేత్ర వృక్షం, తీర్థం, విమానం, తాయారు, మూలవిరాట్టు ముఖ్యంగా ఉన్నదాన్ని దివ్యతిరుపతి అంటారు. "ఆత్మ ఆధ్యాత్మిక వికాసం పొందడానికి ఐదుదశలను అధిగమించాలి. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలను దాటాలి." అని తైత్తిరీయోపనిషత్తు [illegible]మైన భృగువల్లి ప్రకటిస్తోంది. [illegible] అన్నమయకోశం. ఆళ్వారు తీర్థస్నానం ప్రాణమయకోశం. మోకాళ్ళపర్వతం ఎక్కడం మనోమయకోశం. శ్రీవరాహస్వామి దర్శనం విజ్ఞానమయకోశం. ఆనందనిలయ విమానదర్శనం ఆనందమయకోశం. తిరుమలయాత్రికుని ఆత్మ ఆపంచకోశాలలో ప్రయాణంచేసి ఆనందమయకోశంలో ప్రవేశించి ఆత్మానందాన్ని, బ్రహ్మానందాన్ని, శ్రీనివాసదర్శనానందాన్ని పొందే అపూర్వమైన అవకాశాన్ని శ్రీనివాసుని ఆనందనిలయ విమానం అనుగ్రహిస్తుంది. ఇది పెద్దలు అనుభవంతో చెప్పిన విషయం. ఇది భక్తుల అనుభూతిలో [illegible] విషయం. మానవుడు సప్త భూమికలను దాటితే లభించేది ఆనందనిలయం. సప్తగిరులను ఎక్కితే భక్తునకు కనిపించేది ఆనందనిలయ విమానం. దాన్ని చూడడం వలన అవ్యక్తమైన ఆనందం కలుగుతుంది. మానవుడు పంచకోశాలను దాటితే పొందేది దివ్యమైన ఆనందానుభవం. ఆరుకొండలు దాటితే ఏడవకొండపైన ఉన్న [illegible] గర్భాలయం పైగల ఆనందనిలయ విమానాన్ని చూడాలి

వేంకటాచలంపై వెలసిన శ్రీ వైకుంఠనాథుని దివ్యవిమానంగూర్చి ప్రస్తుతించాడు. కలియుగమానవులు శ్రీవారికి స్వర్ణవిమానం నిర్మించ డానికి అనువుగా ఆ దివ్యవిమానం అదృశ్యమైపోయింది. అగోచర మైంది.

కలియుగంలో శ్రీవారికి ఆనందనిలయవిమానం అనే దివ్య విమానం, స్వర్ణవిమానం నిర్మించిన ఆదిపురుషుడు, మొదటిచక్రవర్తి తొండమాను చక్రవర్తి. మహోన్నతమైన, రత్నమయమైన, చతు ర్మూర్తి సమపేతమైన, వైనతేయవిభూషితమైన, సువర్ణకలశయుక్త మైన స్వర్ణ ఆనందనిలయ విమానాన్ని శ్రీనివాసునకు నిర్మించి కృతార్థు డయ్యాడు తొండమానుడు. 'ఆనంద జనకత్వాత్త మానందనిలయం విదుః'. ఆనందజనకమైన ఆ విమానం ఆనందనిలయమని పేరు పొందింది.

"తత్ ఆనందనిలయే తొండమాన్నృపనిర్మితే
విమానాగ్రే శ్రీనివాసో రరాజ భగవాన్ హరిః"
— భవిష్యోత్తరపురాణం

## ఆనందనిలయం - మొదటి బంగారుపూత

వరాహ, భవిష్యోత్తరపురాణాలలో ఆవిష్కరింపబడిన శ్రీ వేంకటేశ్వర విమానచరిత్ర మిది. కాగా చారిత్రకకాలంలోని విమానచరిత్రను తెలిసికొందాము. నేటి విమానం ప్రప్రథమంగా క్రీ. శ. 8వ శతాబ్దంలో నిర్మింపబడిందని చరిత్రపరిశీలకులు భావిస్తు న్నారు. కాళహస్తి, కార్వేటినగర ప్రాంతాలను, చెంగల్పట్టు, చిత్తూరు మండలాలలోని భాగాలను పాలించినరాజు వీర నరసింగ యాదవరాయులు. మొదటచోళులకు, తరువాత పాండ్యులకు సామంతు డితడు. స్వర్ణతూ లారోహణం తూగి తనఎత్తుబంగారంతో శ్రీ వేంకటేశ్వరుని ఆనంద నిలయవిమానానికి పూతపూయించాడు. శ్రీవారి ఆనందనిలయ

విమానం మేరుశిఖరంవలె ప్రకాశించేటట్లు చేసాడు. మొదట జటావర్మ సుందరపాండ్యుడు ఆ స్వర్ణ ఆనందనిలయంపైన స్వర్ణకలశం నిలిపాడు. ఈ విమానానికి బంగారుపూత, స్వర్ణకలశస్థాపనం క్రీ. శ. 1262లో జరిగాయి.

2వ బంగారుపూత

అది క్రీ. శ. 1359వ సంవత్సరం. వికారి సంవత్సరం. ఆనాడు వికారి సంవత్సర ఆషాడశుద్ధ దశమి శనివారం. ఆనాటి సాళువ మంగి దేవ సార్వభౌముడు శ్రీవారి ఆనందనిలయవిమానానికి బంగారుపూత పూయించాడు. ఆ బంగారపు విమానంపైన బంగారుకలశం నిలిపాడు. ఈవిధంగా శ్రీవారిని సేవించి తనభక్తిప్రపత్తులు ప్రకటించుకొన్నాడు.

3వ బంగారుపూత

క్రీ. శ. 1417లో అమాత్యశేఖరుడైన మల్లన ఆనందనిలయ విమానాన్ని పునరుద్ధరించి బంగారపుపూతగల రేకులను అమర్పించి స్వర్ణ ఆనందనిలయవిమానాన్ని సౌందర్యవంతం కావించాడు. ఇతడు రెండవ దేవరాయలమంత్రులలో ఒకడు. మంత్రి మల్లన నామాంతరం మాధవదాసర్. ఈ మాధవదాసుడు శ్రీనివాసదాసుడు.

4వ బంగారుపూత

శ్రీకృష్ణదేవరాయలు కళింగ దిగ్విజయయాత్రలో విజయపరంపరలు సాధించినపిమ్మట 2-1-1517లో శ్రీనివాసుని సేవించి, శ్రీవారి ఆనందనిలయ విమానజీర్ణోద్ధరణకు 30, 000 వరహాలు సమర్పించాడు. 9-9-1518 నాటికి ఆనందనిలయవిమానపు పునరుద్ధరణ కార్యక్రమం పూర్తి అయింది. బంగారుపూతతో స్వర్ణకాంతులు సంతరించుకొని ఆనందనిలయవిమానం పసిడిపూతల తళతళలను ప్రసరించింది. ఆనంద నిలయానికి బంగారుపూతపూయడానికి శ్రీకృష్ణదేవరాయల కాలంలో

ఎనిమిదినెలల కాలం పట్టింది. ఆనందనిలయవిమానాన్ని ఈ విధంగా శ్రీకృష్ణదేవరాయలు అభివృద్ధిపరచారు.

5వ బంగారుపూత

శ్రీకృష్ణదేవరాయలు తరువాత శ్రీవారి ఆనందనిలయ విమానానికి బంగారుపూత పూయించిన భక్తశిఖామణి కంచికి చెందిన కోటి కన్యాకాదానం తాతాచార్యులవారు. శ్రీ పిడతల సీతాపతి 'శ్రీవేంకటేశ్వర' అనే తమరచనలో తాతాచార్యులవారు క్రీ. శ. 1630 లో ఆనందనిలయానికి బంగారుపూత వేయించినట్లు ప్రకటించారు. క్రీ. శ. 1585-1614 మధ్య పాలించిన మొదటి వెంకటపతిరాయలకాలంలో వీరు బంగారుపూత వేయించినట్లు శ్రీ గోపీకృష్ణ 'శ్రీనివాస మంగాపురం- మరియు మన ఆలయముల చరిత్ర' అనేగ్రంథంలో తెలియజేసారు. మనం సురక్షితంగా కంచినివాసులైన కోటికన్యాకాదానం తాతాచార్యులవారు క్రీ.శ. 1585 ముందుగాని, క్రీ. శ. 1630 తరువాతగాని బంగారుపూత వేయించలేదని భావింపవచ్చును. ఆ సంవత్సరాల మధ్యను వేయించారని ఊహింపవచ్చును. క్రీ. శ. 1628-1630 ల మధ్య తిరుపతి పరిసరప్రాంతాలలో కరువుతాండపించింది. స్వర్ణకారులకు జీవనభృతి, జీవనాధారం కల్పించే పథకంగా ఆసంవత్సరాలమధ్య ఆనందనిలయం స్వర్ణమయం చేయబడిందని- దానికి తాతాచార్యులవారు అండగానిలబడ్డారని భావించడం సముచితంగా కనబడుతుంది. సమంజసంగా ఉంటుంది. క్రీ. శ. 17 వ శతాబ్దపు ప్రారంభంలో కంచి నివాసులైన కోటికన్యాకాదానం తాతాచార్యులవారు ఆనందనిలయానికి బంగారుపూత పూచాంచారనే విషయం నిర్వివాదాంశం.

6వ బంగారుపూత

హాత్తీరాంజీ మఠానికిచెందిన ప్రయాగదాస్‌జీ దేవస్థానపు ఆఖరి విచారణకర్త. వీరిపరిపాలన 1901 నుండి 1933 వరకు జరిగింది.

శ్రీరామలక్ష్మణదాసు మహంత్ శ్రీప్రయాగదాస్ బావాజీకి సోదరుడుమాత్రమేకాదు. శిష్యుడుకూడ! శ్రీరామలక్ష్మణదాసు హత్తీ బాంజీ మఠానికి చెందిన అధికారి. ఇతడు శ్రీవారి ఆనందనిలయ విమానానికి బంగారుములామా చేయించి కీలకనామసంవత్సర ఆశ్వయుజ శుద్ధ పంచమినాడు– లలితపంచమినాడు. అంటే 30-9-1908 తేదీన ఆ ఆనందనిలయ విమానంపైన స్వర్ణకలశం స్థాపింపజేసాడు,

7వ బంగారుపూత

1952 లో వర్షానికికురిసే చిల్లులుపడ్డ ఆనందనిలయవిమానాన్ని పునర్నిర్మించి, పునరుద్ధరించాలని దేవస్థానం నిర్ణయించింది. కల్యాణ మండపంలో బాలాలయనిర్మాణం జరిగింది. మూలవిరాట్టు తేజస్సు బాలాలయంలోని బింబంలోనికి ప్రవేశపెట్టబడి ప్రతిబింబింపచేయ బడింది. 16-3-1953 లో ఆనందనిలయ పునరుద్ధరణకార్యక్రమం ప్రారంభమైంది. దానికి 18 లక్షల రూపాయలు వినియోగింపబడ్డాయి. రెండున్నర లక్షలరూపాయలు విలువచేసే రాగిరేకులను విమానానికి తాపడంచేసారు. విమానానికి రాగిరేకులకు మధ్య ఖాళీస్థలాన్ని సిమెంటుతో కాంక్రీటుచేసారు. రూ. 12 లక్షల విలువచేసే 12,000 తులాల బంగారంతో విమానానికి అమర్చిన రాగిరేకులకు పూత పూయబడింది. 27-8-1958 లో పునరుద్ధరించిన శ్రీవారి ఆనందనిలయ విమానానికి మహాసంప్రోక్షణం జరిగింది. క్రీ. శ. 1262 నుండి 1958 వరకు ఏడుకొండలవాని ఆనందనిలయ విమానానికి ఏడుసార్లు బంగారు పూత వేయబడింది. 9-9-1518 లో శ్రీకృష్ణదేవరాయలు ఆనంద నిలయానికి బంగారుపూత చేయించడానికి 1 లక్షా 20 వేల రూ||- ఖర్చు చేసాడు. పని ఎనిమిదినెలలో పూర్తి అయింది. దేవస్థానం 27-8-1958 లో బంగారుపూత పూయించడానికి 14 లక్షల 50 వేలు ఖర్చు చేయవలసి వచ్చింది. 62 నెలలలో పనిపూర్తి అయింది.

## ఆనందనిలయం - సందేశం

మొదట క్రీ. శ. 1262 లో ఆనందనిలయానికి బంగారుపూత పూయబడింది. తరువాత 97 సం॥ల తరువాత క్రీ. శ. 1359 లో బంగారు మలామా చేయబడింది. పిమ్మట 58 సంవత్సరాలకు 1417 లో బంగారుపూత వేయడమైంది. నాల్గవసారి 101 సంవత్సరాలకు 1518 లోను, 5వ పర్యాయం 112 సంవత్సరాలకు 1630 లోను, 6వ తడవ 278 సంవత్సరాలకు 1908 లోను, 7వ సారి 50 సంవత్సరాలకు 1958 లోను ఆనందనిలయ విమానానికి బంగారుపూత పూయబడింది. తొండమానుడు, వీరనరసింగయాదవరాయలు, సుందరపాండ్యుడు, సాళువ మంగి దేవసార్వభౌముడు, మంత్రిమల్లన, శ్రీకృష్ణదేవరాయలు, కోటి కన్యాదానం తాతాచార్యులు, రామలక్ష్మణదాసు ప్రభృతులు తమ భక్తిసంపదను, సంపదను బంగారంగా మార్చి శ్రీవారి ఆనందనిలయ విమానానికి బంగారపు పూతలు పూయించి, దానిపై స్వర్ణకలశాలు నిలిపి స్వామివారికృపకు పాత్రులై అజరామరమైన కీర్తినార్జించారు. తమజీవితాలను సార్థకపరచుకొని తరించారు. శ్రీవారి ఆనందనిలయాన్ని చూచినభక్తులకు అది అపూర్వమైన సందేశాన్ని ఇస్తుంది. దివ్యమైన ఆదేశాన్ని అందిస్తుంది. "బంగారంపైన మమకారం పెంచుకొనవద్దు. బంగారం ఉందని అహంకారపడవద్దు. ఉన్నలో ఉన్నంత బంగారాన్ని, సంపదను ప్రజాహితంకోసం తనరాబడిని వినియోగించే శ్రీవారికి వినమ్రంగా కానుకగా అందించండి. అర్పించండి" అన్నదే ఆనందనిలయవిమానం భక్తులకు, సంపన్నులకు అనుగ్రహించే సందేశం. అందించే ఆదేశం.

## విమానం - శ్రీహరిరూపం

శరీరంలోని మూలాధార చక్రంనుండి ఆజ్ఞాచక్రంవరకు కలది శక్తిస్థానం. కంఠంనుండి మూర్ధాంతంవరకును గలది శాంభవస్థానం.

శాంభవస్థానంలో తేజోరూపసాక్షాత్కారం లభిస్తుంది. మూర్ధంలో తేజం ఉంది. దాన్ని చూడినప్పుడు సిద్ధదర్శనం సిద్ధిస్తుంది అన్న పతంజలి యోగసూత్రరహస్యం అదే! ఈ విషయాన్నే మనం దేవాలయ విమానంలో చూస్తాం. భూర్భువస్సువరాది సప్తఊర్ధ్వలోకాలకు, అష్టప్రకృతులకు సంజ్ఞారూపం విమానం. అర్చావతారమూర్తి పంచప్రాణాలు (కళలు) అర్చకునిలోను, గోపురంలోను, మూలవిరాట్టులోను, విమానంలోను, బలిపీఠాలలోను ఉంటాయన్నది శాస్త్రవచనం. శ్రీహరిరూపమే విమానస్వరూపమని అగ్నిపురాణం చెప్పింది. పంచబ్రహ్మలు విమానస్వరూపులని తంత్రసముచ్చయం ప్రకటించింది. విమానం దేవతాధివాసం, పూజాస్థానం అని వేదాలు పేర్కొన్నాయి.

"కలాంకలాం గృహీత్వా వై దేవానాం విశ్వకర్మణా
నిర్మితోయం సురైర్యస్మాత్తస్మాత్కలశ స్తేన ఉచ్యతే"

విశ్వనాథుడే విశ్వకర్మ. సకలదేవతల కళలను సేకరించి కలశాన్ని రూపొందిస్తాడు. అందుచేత కలశం సర్వదేవతాశరీరం. కలశమే దేవాలయం. కలశమే బ్రహ్మాండం. సర్వదేవతలకు సంకేతంగా విమానంపైన కలశప్రతిష్ఠ చేస్తారు. శ్రుతివిహితమైన స్వర్ణకలశం కలిగిన స్వర్ణ ఆనందనిలయవిమానం స్వయంవ్యక్త అర్చావతారమూర్తియైన శ్రీ వేంకటరమణమూర్తి సాన్నిహిత్యంవలన దివ్యమహిమను సంతరించుకొని వైకుంఠవిమానమై అలరారుతోంది. భక్తులను, చూపరులను అలరిస్తోంది.

## విమానం – శిల్పం

శ్రీవారి విమానం 'వేసరవిమానం'. ఇది మూడు అంతస్తుల నిర్మాణం. 27'-4" ఉపరితల చతురస్రంపైన నిర్మింపబడింది. దీని ఎత్తు 37'-8". మొదటి చతురస్రపు అంతస్తు ఎత్తు 10'. రెండవ చతురస్రపు ఎత్తు 10'-9". మూడవది వృత్తాకారంలో 16'-8" ఎత్తుకలిగి ఉంది.

క్రింద చతురస్రాకారం, దానిపైన వృత్తాకారం, దానిమీద శిఖరం ఉన్నదాన్ని వేసరవిమానం అంటారు. శ్రీవారి విమానం ఈ వేసర విమానలక్షణాలను కలిగి ఉంది. విమానం క్రిందివరుసలో బంగారు పూతరేకుపై ఉబికినట్లు చెక్కబడిన కొన్ని విగ్రహాలు కనబడతాయి. రెండవ వరుసలో ఇలాంటి విగ్రహాలు సుమారు నల్భై ఉంటాయి. ఆంజనేయ, గరుడ. విష్ణు, త్రివిక్రమ, కోదండరామ, కాళియఫణి మర్దనకృష్ణ ఆదిగాగల విగ్రహాలు ఆ రెండవ వరుసలోని 40 విగ్రహాలలోను ఉన్నాయి. ఈ వరుసలోనే మనకు కనిపించే ముఖ్యమైన మూర్తి శ్రీ విమాన వెంకటేశ్వరమూర్తి. విమాన వేంకటేశ్వరుని దర్శనం మూలవిరాట్టు వేంకటేశ్వరుని దర్శనంతో సమానమైనది. బ్రహ్మోత్సవసమయంలో వచ్చే లక్షలాది యాత్రికులకు మూలవరుల దర్శనం చేయించడం సాధ్యంకానప్పుడు విమానవేంకటేశ్వరుని దర్శనం చేయించే సంప్రదాయం ఉంది. శ్రీకృష్ణదేవరాయుని గురువైన శ్రీ వ్యాసతీర్థులవారు విమానవేంకటేశ్వరుని అర్చించినపిమ్మటనే మధ్యాహ్నభోజనం చేసేవారట. నేటికీ మధ్వులు శ్రీ విమానవేంకటేశ్వరుని సేవించి పవిత్రమతగ్రంథాలు ఆ స్వామివారికి ఎదురుగా కూర్చొని పారాయణం చేస్తారు. పైఅంతస్తులో సుమారు ఇరవై మూర్తులున్నాయి. వానిలో మహాపద్మం, నిలబడిన సింహాకృతాలు గణనీయమైనవి. సుఖాసన విష్ణుమూర్తి, గరుడమూర్తి ఈ వరుసలోనే మనకు దర్శనమిస్తారు. బంగారువాకిలి తలుపులపై కనపడే పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారస్వరూప సంబంధమైన విష్ణుమూర్తి వివిధస్వరూపాలు ఈ విమానంలోనూ గోచరిస్తాయి. భక్తులను, యాత్రికులను ఆనందపరవశులను చేస్తాయి. ఆనందనిలయ విమాననామాన్ని సార్థకపరుస్తాయి.



# సర్వదేవతాస్వరూపుడు

"నగ్నస్వరూప సౌందర్య దర్శనవేళ
భైరవమూర్తి వైభవము గంటి
క్షీరపూర్ణఘటాభిషేక సంభ్రమవేళ
జినదేవమూర్తి విన్ననువుగంటి
కర్పూర కస్తూరికాలేపనాభిషే
కమువేళ నౌమాపతమునుగంటి
హైమోత్తరీయ సమర్పణా ర్హణవేళ
పరశక్తిమూర్తి సుందరతగంటి
మంగతాళి ధరించి సర్వాంగశోభ
వెలయువేళ నీవిష్ణుత్వ మెలమిగంటి
సర్వదేవతాత్మకమయి జరుగు నీదు
శుక్రవారాభిషేక ముత్సుకత గంటి"

— క్రీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి

ఆనందనిలయ విమానంలో నిలచి భక్తులకు దర్శనమిస్తూన్న శ్రీవారు అభిషేకసమయంలో భైరవమూర్తిని, జినదేవమూర్తిని, శివ శంకరమూర్తిని, పరాశక్తిమూర్తిని, శ్రీవిష్ణుమూర్తిని తమలో చూపు తారు. నామం, రూపం లేనిస్వామి భక్తులకోసం నామ, రూపధారు డయ్యాడు.

హరిహరమూర్తిగా, త్రిమూర్తిగా, కుమారస్వామిగా, సుబ్ర హ్మణ్యస్వామిగా, బుద్ధమూర్తిగా భక్తులు వారిభావనకు అనుగుణంగా శ్రీవారిలో ఆయా దేవతాస్వరూపాలను కల్పించుకొని సేవిస్తారు. శ్రీవేంకటేశ్వరుడు సర్వదేవతాస్వరూపుడు. సకల దేవతాసార్వ భౌముడు.

## శ్రీ వేంకటేశ్వరుడు

పాపాలను భస్మంచేసి. అమృతైశ్వర్యాలను ప్రసాదించే ఈశ్వరుడు శ్రీవేంకటేశ్వరుడు. శైవులు శ్రీవేంకటేశ్వరుని శివస్వరూపుని ఆరాధించారు. బిల్వపత్రపూజలు చేసారు. నేటికి ధనుర్మాసంలో బిల్వపత్రపూజ జరుగుతుంది. స్వామి ఫాలనేత్రుడు కాడు. జటాజూటంగల చంద్రశేఖరుడుగా స్వామి గోచరిస్తాడు. పూర్వం శైవులు త్రిశూలం, ఖడ్గం, విభూతి రేఖలు, రుద్రాక్షమాలలతో అలంకరించేవారట. శ్రీవేంకటేశ్వరుని విగ్రహం గర్భాలయంమధ్యలో ఉంది. గర్భాలయమధ్యగల స్థానం శివస్థానం. అందుచేత శ్రీవారిమూర్తి శైవమూర్తి అని శైవుల నిర్ణయం. శ్రీవారి పాదాలసమీపంలో ఒక అవ్యక్తమైన స్ఫటికలింగాన్ని ఆదిశంకరాచార్యులవారు నెలకొల్పినారట. శ్రీ చక్రాన్ని, ధనాకర్షణచక్రాన్ని ప్రతిష్ఠించి నక్షత్రమాలాశ్లోకాలలో స్వామిని స్తుతించారట. ఒక గజపతిరాజు రామేశ్వరయాత్రకు పోతూ తిరుమల శ్రీవేంకటేశ్వరుని దర్శించాడట. ఆలయానికి ప్రవేశగోపురం లోని లోటును గమనించి, దాన్ని కట్టడానికి ఆజ్ఞాపించాడట. శేషగిరి స్వరూపుడైన అనంతుడు ఆగోపురపు భారాన్ని భరించలేక ఆగజపతి రాజునకు కలలో కనపడి ఆగోపురనిర్మాణకార్యక్రమాన్ని విరమించ మన్నాడట. ఆనిర్మాణం ఆగిపోయిన దానికిగుర్తుగా శ్రీవేంకటేశ్వరునకు ఆరాజు నాగాభరణం చేయించి స్వామివారి దక్షిణభుజానికి అలంకరింప జేసాడట. ఆవిధంగా స్వామి నాగాభరణభూషితుడయ్యాడు. ఈ కథ విన్న రామానుజులు నాగాభరణాలు చేయించి శ్రీవారి రెండుచేతులకు తొడిగించాడు, వేంకటేశ్వరుని ఆలయంలో స్ఫటికలింగం కలదని శ్రీ విద్యారణ్యస్వామి ధృవపరచారు. శ్రీవారు తమవరదహస్తంతో తమపాదాలక్రింద ఉన్న స్ఫటికలింగాన్ని సేవింపమని, భావింపమని

ఆదేశిస్తున్నారు. అట్టి లింగారాధనవల్ల సంసారసాగరం కటిదఘ్నం కాగలదని తమ కటి హస్తంతో తెలుపుతున్నారు. శ్రీవారిని శ్రీవేంకటేశ్వరస్వామిగా భావించి అర్చించేవారి ఆలోచనాసరళి అది. స్వామి వ్యక్త విష్ణువు, వ్యక్తావ్యక్త శివుడని అద్వైతులు భావిస్తున్నారు.

బా లా జీ

శాక్తేయులు శ్రీవేంకటేశ్వరుని మహాశక్తి, వేంకటరాజరాజేశ్వరి, వేంకటత్రిపురసుందరి, వేంకటబాలపరమేశ్వరి, జ్ఞానేశ్వరి, దుర్గ, కనకదుర్గ, మహాశక్తి నామాలతో పిలచిపూజించేవారు. శ్రీవారి నిలయం బాలపీఠమని దేవీఉపాసకుల భావం. ఉత్తరదేశస్థులు బాలాజీ అని పూజిస్తారు. తిరుమలపైగల బాలవిగ్రహాన్ని శ్రీనివాసుని విగ్రహంగా మార్చినట్లు శ్రీ ఏ. రంగనాథ మొదలియారు, తమిళంలో ప్రచురించిన 'శ్రీవైష్ణవ సంప్రదాయం' అనే గ్రంథంలో ప్రకటించారు. 'శ్రీవేంకటేశ్వరి' కలియుగ దేవత అని శ్రీవారినిగూర్చి దేవీభాగవతం ప్రకటించింది. స్త్రీ దేవతామూర్తులకు శుక్రవార అభిషేకం ఒక ప్రాచీన ఆచారం. శ్రీసూక్తపారాయణంలో బాలాజీకి శుక్రవార అభిషేకం జరుగుతుంది. నిత్యంజరిగే తోమాలసేవ భగవతి ఆరాధనం శ్రీబాలాజీకి జరిగే తిరుప్పావడ ఉత్సవంలోని కుంభం పావడకు, గంగజాతర శక్తిపూజకు సంకేతాలు. శ్రీవారి ఆలయమార్గంలో నిర్మింపబడిన గాలిగోపురం 'కాళీగోపురం.' శక్తివాహన చిహ్నాలైన సింహాలు విమానంమధ్యతలంలోని పైభాగమందలి మూలలో నిర్మింపబడ్డాయి. బాలాజీమూర్తికి జట, సింహాలలాటము, కిరీటంపైన శ్రీచక్రం ఉన్నాయట. 24 మూరల ధోవతి, 12 మూరల ఉత్తరీయం స్వామివారి విగ్రహానికి ధరింపజేస్తారు. ఇంతపొడవుగల వస్త్రాలను అలంకరింపజేయడంవలన ఈమూర్తి శక్తి లేక దుర్గామూర్తిగా నిర్ణ

యింపవచ్చునని కొందరి ఊహ. ఆశ్వయుజమాసంలో నవరాత్రులలో జరిగే బ్రహ్మోత్సవం దేవీనవరాత్రి దీక్షావ్రతమని దేవీఉపాసకుల భావం. బాలాజీ వెలసిన తిరుమల దేవీరూపంలోని మేరుచక్రంగా కొందరు భావిస్తున్నారు. దేవీభక్తులు శ్రీవారిని బాలగా, త్రిపుర సుందరిగా, దుర్గాశక్తిగా, లలితగా, రాజరాజేశ్వరిగా, పరమేశ్వరిగా భావించి, ధ్యానించి, పూజించి లౌకిక పారలౌకిక ప్రయోజనాలు పొందుతున్నారు. ఈ కారణంగా శ్రీవారి కేంద్రం బాలపీఠంగా ప్రఖ్యాతి పొందింది. అందుకే స్వామివారు బాలాజీగా వ్యవహరింపబడుతూ భక్తుల పూజలు, అర్చనలు అందుకొంటున్నారు. 'బాలాజీ' అన్నా శ్రీవారు ఆమోదించి భక్తులను అనుగ్రహించి అలరిస్తూనే ఉన్నారు.

## బాలసుబ్రహ్మణ్యస్వామి

తిరుమలపై శ్రీవారిమూర్తి కుమారస్వామి మూర్తి అని సుబ్రహ్మణ్యస్వామి భక్తులు భావిస్తారు. ఇది బాలాజీవిగ్రహం కాదు; బాలసుబ్రహ్మణ్యస్వామి విగ్రహమని వారి మతం. తిరుమలస్వామి సుబ్రహ్మణ్యస్వామి, కుమారస్వామి అని సుబ్రహ్మణ్యస్వామి భక్తులు నిర్ణయించారు. తిరుమలపైగల స్వామిపుష్కరిణి కుమారస్వామిపుష్కరిణి, సుబ్రహ్మణ్యస్వామి పుష్కరిణి అని వారు తెలుపుతారు. వామన పురాణం స్కంధుడు వేంకటాచలంపై తపస్సు కావించినట్లు తెలుపుతోంది. శ్రీవారినిలయం కుమారస్వామి సేవించిన సుబ్రహ్మణ్యపీఠమని అంటారు. నాగాభరణభూషితుడైన శ్రీవారిని మురుగన్ అని, బాల సుబ్రహ్మణ్యస్వామి అని, కుమారస్వామి అని, షణ్ముఖుడని, స్కంధుడని సుబ్రహ్మణ్యోపాసకులు, భక్తులు భావించి సేవిస్తారు.

"గతా కుమారరూపేణ, షణ్ముఖో భగవాన్ హరిః
దృశ్యపవ ముఖేనైవ వేంకటాచలనాయకః"

శేషాచలసంబంధంతో దీన్ని సుబ్రహ్మణ్యక్షేత్రంగా సమన్వయం చేయడం గమనార్హం. కలియుగంలో సుబ్రహ్మణ్యక్షేత్రాలలో కళలు నశింపక వృద్ధి పొందుతాయని భవిష్యోత్తరపురాణం ప్రకటిస్తోంది. ఆ పురాణప్రవచనాన్ని పురస్కరించుకొని తిరుమలక్షేత్రాన్ని కళలు పెరుగుతూన్న సుబ్రహ్మణ్యక్షేత్రమని, తిరుమలస్వామి సుబ్రహ్మణ్యస్వామి అని సుబ్రహ్మణ్యస్వామి భక్తులు అంటారు.

త్రిపతి

కొందరు స్వామి షణ్ముఖస్వామి కాదు పంచముఖ స్వామి అంటారు. పద్మపీఠంపైన వెలసిన తిరుమలస్వామి పద్మాసనుడైన బ్రహ్మ అని ప్రకటిస్తారు. తిరుమలపై వెలసినస్వామి 'త్రిపతి' అని మరి కొందరి భావం. అందుచేతనే స్వామి కొండచెంతగల దానిపేరు 'త్రిపతి'. అది నేడు తిరుపతిగా వ్యవహారప్రాచుర్యం పొందింది. "త్రయాణాం బ్రహ్మవిష్ణు రుద్రాణాం పతిః" అన్నప్రమాణంవలన వాణీపతి, లక్ష్మీపతి, పార్వతీపతులకు అధిపతియే ఈ తిరుమలపతి అని భావించాలి. త్రిమూర్తులలోని హిరణ్యగర్భుడు కాడు, హరి కాడు, హరుడు కాడు, వారికి అతీతుడు హరిహర హిరణ్యగర్భాది త్రిమూర్తులకు అధినాయకుడు అని కొందరు అంటారు. అతడు త్రిమూర్తులకు పతి. అతడే 'త్రిపతి'. ఆ దేవునిపేరను తిరుమలపాదప్రాంతంలో 'త్రిపతి' అనే గ్రామం వెలసింది. ఈ సాదృశంతో తిరుమలపతిని 'త్రిపతి' అని కొందరు అభిప్రాయపడుతున్నారు. ముప్పదిమూడుకోట్ల దేవతలకు అధిపతియైన తిరుమలపతి మువ్వురుమూర్తులకు పతికావడంలో ఆశ్చర్యమేముంది?

శంకరనారాయణుడు

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చహృదయగ్ం శివః"

అని సంధ్యావందనంలో హరిహరాఒభేదస్మరణం విధింపబడింది. శివకేశవసంకీర్తనంలో భేదం లేదు. "నా భక్తుడు శివద్వేషియైనా, నా ద్వేషి శివభక్తుడైనా, ఆ యిరువురికి సూర్యచంద్రాదులున్నంత వరకు నరకబాధ తప్పదు" అన్నాడు శ్రీకృష్ణుడు. తిరుమలపైగల స్వామి శంకరనారాయణుడని, హరి హరుడని హరిహరభక్తులు భావిస్తున్నారు. స్వామి వ్యక్తవిష్ణువని, అవ్యక్తశివుడని కొందరి భావం. శ్రీరామానుజునిమూలంగా స్వామి విష్ణువుగా తీర్చిదిద్దబడ్డాడు. స్వామి వారి హస్తాలలో శంఖచక్రాలు మొదట లేవు. గరుడునివిగ్రహం 15వ శతాబ్దం తరువాత నెలకొల్పబడింది. బిల్వపత్రపూజ శ్రీవారి శైవ రూపానికి నిదర్శనం. శ్రీశైలం శేషాచలంలోని భాగం. తిరుమల 'శ్రీశైలంగా' వర్ణింపబడింది. శ్రీ శంకర భగవత్పాదుల ద్వాదశ జ్యోతిర్లింగాలవర్ణనలోని శ్రీశైలప్రశంస శ్రీ మల్లికార్జునునకు ఉద్దేశింపబడింది. తిరుమలకూడ శ్రీశైలంకావడం గమనార్హమైన అంశం.

మొదలి ఆళ్వారులైన పొయిగై, పూదత్త, పేయాళ్వారులు శ్రీవారి హరిహరస్వరూపలక్షణాలను కొనియాడారు. "వేంగడనాథుడు వృషభవాహనుడు, గరుడవాహనుడు. అతని నివాసం కైలాసం. క్షీరసాగరం. అతడు సర్వనాశకుడు. సర్వరక్షకుడు. ఆ వేంగడనాథుడు హరనారాయణస్వరూపుడు" అని పొయిగైఆళ్వారు ప్రస్తుతించాడు. "జటాజూటం, కిరీటం, శూలం, చక్రం, నాగబంధం, స్వర్ణమణిబంధం ధరించిన హరిహరస్వరూపుడు తిరువేంగడనాథుడ"ని పూదత్త, పేయాళ్వార్లు నిర్ణయించారు. "రుద్ర, బ్రహ్మాదులను తనలో నిలుపుకొన్న మహావిష్ణువు" అని నమ్మాళ్వారు శ్రీవారిరూపాన్ని నిర్ణయించాడు. అందుచేత వేంగడనాథుడు - శ్రీ వేంకటేశ్వరుడూ - శ్రీనివాసుడూ కూడ!

శ్రీనివాసుడు

అది శ్రీరంగంలో రామానుజుడు స్థిరపడిన కాలం. తిరుమలలో వైఖానసపూజారులు శ్రీవారిపూజలు సక్రమంగా నిర్వర్తించక నారాయణవరం యాదవరాజుచేత శిక్షింపబడ్డారు దానితో వారు తిరుమల వదలి పారిపోయారు. ఈ అదను కనిపెట్టిన తిరుమలలోని శైవులు శ్రీ వేంకటేశ్వరుడు శివస్వరూపుడనే వాదం చేసారు. తమ వాదంతో యాదవరాజును వశం చేసికొనడానికి సన్నాహం ప్రారంభిచారు. శైవ విజృంభణవిషయం గ్రహించిన రామానుజుడు తిరుమలకు తరలి వచ్చాడు. యాదవరాజు న్యాయనిర్ణేతగా నిలబడ్డాడు. శైవులు తిరుమలపై స్వామి పరమమహేశ్వరుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి అని వాదించారు.

"తిరుమలపైగల స్వామి శివుడు, బాలసుబ్రహ్మణుడు, కుమారస్వామి. స్వామిపుష్కరిణి కుమారస్వామిపుష్కరిణి. బిల్వపత్రపూజ స్వామికి ప్రీతి పాత్రమైనది." అంటూ శైవులు ఎన్నో ఉదాహరణాలు చూపించి తిరుమలేశ్వరుడు శివుడని నిరూపించడానికి ప్రయత్నించారు. "తిరుమలేశ్వరుడు కేవలం వైకుంఠనారాయణుడు. కుమారధారాతీర్థం కుమారస్వామికి సంబంధించినది. దీన్ని వరాహపురాణం బలపరుస్తోంది. శత్రు సంహారంకోసం తొండమానునకు శంఖచక్రాలను శ్రీనివాసుడు సమర్పించాడు. దీన్ని బ్రహ్మాండపురాణం బలపరుస్తోంది. విష్ణువునకు జటాజూటాలు ఉంటాయని భాగవతం ప్రతిపాదిస్తోంది. శ్రీ వత్సం, వక్షస్థల శ్రీదేవిగల శ్రీనివాసుడు తిరుమలేశ్వరుడు. శ్రీనివాసుడు నాగాభరణాలు ధరిస్తాడని పద్మపురాణం ప్రకటిస్తోంది. ఆకాశరాజు శ్రీనివాసునకు కల్యాణసమయంలో నాగాభరణాలు సమర్పించినట్లు, వానిని స్వామి ధరించినట్లు భవిష్యోత్తరపురాణం వివరిస్తోంది. తిరుమలపైగల స్వామి బాలసుబ్రహ్మణ్యస్వామి కాడు. బాలకృష్ణస్వామి, రుద్ర

బ్రహ్మాదుల, ముక్కోటి దేవతల సేవలందుకొన్న స్వామి తిరుమలేశ్వర స్వామి అని పురాణాలు ప్రవచిస్తున్నాయి. తిరుమలేశ్వరుడు కేవలం శ్రీ వైకుంఠనారాయణుడు. శ్రీమన్నారాయణుడు. శ్రీ లక్ష్మీనారాయణుడు. తిరుమల భూలోక వైకుంఠం. కలియుగ వైకుంఠం. కన్నుల వైకుంఠం" అని రామానుజాచార్యుడు వైష్ణవ పక్షం తరపున వాదించాడు. భిన్నశాఖీయులైన శాక్తేయులు, శైవులు ఆదిగా గలవారు భాష్యకారుల వాదనను కాదనలేక మిన్నకున్నారు. యాదవరాజు రామానుజుని వాదాన్ని బలపరవాడు,

ఆనాటి రాత్రిసమయంలో తిరుమలేశ్వరుని దివ్యసన్నిధానంలో శైవులు రుద్రాక్షమాలలు, బిల్వపత్రాలు, త్రిశూలఖడ్గాలు, విభూతి, లేడి, డమరకం ఉంచారు వైష్ణవులు తులసిమాలలు తిరుమణి తిరుచూర్ణాలు, శంఖచక్రాలు నిలిపారు. ఉదయానికి స్వామివారు శైవ చిహ్నాలు ధరిస్తే శివుడని, వైష్ణవచిహ్నాలు ధరిస్తే విష్ణువని అంగీకరిద్దామని ఇరువర్గాలవారు నిబంధనం కావించుకొన్నారు. ఏకాంతసేవ జరిగిన తరువాత దేవాలయానికి తాళంవేసి ఇరుతెగలవారికి సమ్మతమైన స్థలంలో తాళంచెవులను భద్రపరచారు. ఆదిశేషుని అవతారమైన రామానుజుడు శేషాకారుడై సోమబలిద్వారం ద్వారా శ్రీనివాసుని సన్నిధిలోనికిచేరి "స్వామీ! నీవు తొండమానుని అనుగ్రహించడానికై నీశంఖ చక్రాలను శత్రుసంహారంకోసం దానంచేసావు. వైకుంఠంనుండి పరమూర్తివైన నీవు చేతనుల ఉద్ధరించడానికై శ్రీనివాసమూర్తివై, అర్చావతారమూర్తివై తిరుమలపై ఆవిర్భవించావు. ఈశంఖచక్రాలను, వైష్ణవ చిహ్నాలను ధరించి స్వస్వరూప సౌభాగ్యం భక్తులకు ప్రసాదింపప్రార్థిస్తున్నాను" అని వేడికొ డు. శ్రీనివాసుడు తిరుమణి తిరుచూర్ణంతో శ్రీ నామం ధరించి, శంఖచక్రధారుడై, తులసీ మాలాధరుండై రామానుజుని విన్నపం మన్నించి అతని

సాక్షాత్కరించాడు. రామానుజుడు స్వామిని శ్రీనివాసునిగా దర్శించి, సేవించి సోమబిలమార్గం గుండా శేషరూపుడై బయటకువచ్చి వైష్ణవ పక్షం వహించి, సూర్యోదయానికై ఎదురుచూచాడు.

దివ్య సుప్రభాత సమయమైంది. బంగారు వాకిలి తలుపులు తెరువబడ్డాయి. తిరుమలేశ్వరుడు శంఖ చక్రాది వైష్ణవ చిహ్నాలను ధరించి శ్రీనివాసుడై భక్తులకు దర్శనభాగ్యం ప్రసాదించాడు. శైవుల వాదం వీగిపోయింది. వైష్ణవ విజయపతాకం ఆనందనిలయంపై నిలచింది. నారాయణవరం యాదవరాజు తిరుమలేశ్వరుడు శ్రీనివాసుడని తన నిశ్చితాభిప్రాయం, న్యాయనిర్ణయం ప్రకటించాడు. తిరుమలేశ్వరుడు పరవాసుదేవుడని నిరూపించిన శ్రీరామానుజవిజయగాధను శ్రీ "వేంకటాచల ఇతిహాసమాల" 2, 3, 4 స్తబకాలలో విపులంగా వర్ణించింది.

## దివ్యమనోహర స్వరూపుడు

శ్రీనివాసుని దివ్యసుందరమూర్తి, ఆగమశాస్త్రాలు నిర్దేశించిన విగ్రహమూర్తులకు అతీతంగా ఉంటుంది. స్వామి ఆవిర్భవించిన పిమ్మట ఆగమాలు ఉద్భవించాయి. వైఖానసమహాముని శ్రీనివాసుని సేవించి శ్రీవైఖానసఆగమాన్ని రూపొందించాడు. అదే నేడు శ్రీవారిదేవాలయంలో అనుసరింపబడుతోంది. ప్రతిమాలక్షణం, ఆగమాదులు అన్నీ శ్రీవారి అర్చావతార స్వరూపాన్ని ప్రమాణంగా తీసికొని విగ్రహ లక్షణాలను, ప్రతిమా స్వరూప నిర్ణయాలను ప్రకటించాయి. 'శుక్రనీతి' యే ఉన్నత ప్రతిమాలక్షణాల వర్ణించిందో ఆలక్షణాలను మించిన ఉత్తమలక్షణాలను, ఉన్నతప్రమాణాలను సంతరించుకొన్న మహోన్నతవిగ్రహం శ్రీనివాసుని విగ్రహం. శ్రీనివాసునిదృష్టి సమదృష్టి. పెదవులపై చిఱునవ్వులు చిందులాడుతాయి. సాలగ్రామశిలామూర్తిగా శ్రీ వేంకటరమణమూర్తి గోచరిస్తాడు.

శ్రీవారు మహోన్నతులు. వారిమూర్తి సుమారు 9-10 అడుగులమధ్య ఎత్తు ఉంటుంది. శ్రీవారి వక్షస్థలంకొలత 36"- 40" మధ్య ఉంటుంది. నడుముకొలత 24" - 27" మధ్య ఉంటుంది. ప్రపంచంలో అజంతాలోని మొదటిగుహలోని బోధిసత్త్వపద్మపాణిచిత్రం మహా సౌందర్యవంతమైనదిగా పరిగణింపబడుతోంది. ఆసౌందర్యాన్నిమించిన సౌందర్యంతో శ్రీనివాసుని దివ్యమంగళ విగ్రహం ఒప్పారుతోంది. శ్రీవారిమూర్తి దివ్యమనోహరమూర్తి. అట్టిమూర్తి భారతం దేశంలో గాని, ప్రపంచంలోని ఏదేశంలోగాని కానరాదు. ప్రపంచంలోని సౌందర్యాన్ని అధిగమించిన దివ్యసౌందర్యం శ్రీవారి మూర్తిలో సాక్షాత్కరిస్తుంది. కాని శ్రీవారి మూర్తిలోని ఆ మహా సౌందర్యం చతుర్దశ భువనాలలో ఎక్కడా గోచరించదు. ఇదే శ్రీవారి దివ్యమనోహరమూర్తిలోని ప్రత్యేకత.

సువర్ణ పద్మపీఠంపైన శ్రీవారు నిలచి ఉంటారు. శ్రీపాదాలు సువర్ణపాదాలతో అలంకృతమవుతాయి. పాదాభరణాలతో నూపురాలతో శ్రీపాదాలు అలరారుతాయి. బంగారు మొలనూలుతో నాగఫణియుతమైన ఉదరబంధంతో శ్రీవారి నడుము ఆభరణయుతమై ఉంటుంది. శ్రీ భూదేవులు, పంచవ్యూహమూర్తులు, దశావతారాలతో కూడిన చిరుగంటల మొలతాడు చూడముచ్చటగా శ్రీవారు అలంకరించుకుంటారు. చిన్నకంఠాభరణంతో, వక్షస్థలపర్యంతం ఉండే పెద్ద కంఠాభరణంతో స్వామివారికంఠం, వక్షస్థలం వింత అందాలు సంతరించుకుంటాయి. హృదయపర్యంతం ఉండే బంగారు పులిగోరుహారం, నాభిపర్యంతం ఐదుపేటల గోపుహారం, రత్నగ్రంథులున్న సువర్ణయజ్ఞోపవీతం, సాధారణ యజ్ఞోపవీతం, కటిపర్యంతం 108 బంగారు తులసి పత్రాలతోకూడిన తులసిపత్రహారం, జానుపర్యంతం 108 బంగారు లక్ష్మిప్రతిమలతోకూడిన చతుర్భుజలక్ష్మిహారం శ్రీవారు ధరించే ముఖ్యమైన ఆభరణాలు.

తొమ్మిది పలవరసగల స్వర్ణ అష్టోత్తరశతనామహారంతో, పాదపర్యంతం ఉండే స్వర్ణసహస్రనామహారంతో శ్రీవారు ఒప్పారుతారు. సూర్యకఠారి గణనీయమైనది. సువర్ణ వైకుంఠహస్తంతో, స్వర్ణకటిహస్తంతో శ్రీవారు భక్తులను అలరిస్తారు. కడియాలు, నాగాభరణాలు, భుజకీర్తులు శ్రీవారి కర, భుజభూషణాలు. స్వర్ణకర్ణపత్రాలు స్వామివారి కర్ణభూషణాలు. చక్రం దక్షిణహస్తంలోను, శంఖం వామహస్తంలోను నెలకొని ఉన్నాయి. స్వర్ణకిరీటం శ్రీవారి శిరోలంకారం. నిత్యం ఈ సువర్ణాభరణాలను శ్రీనివాసుడు ధరించి భక్తులకు దర్శనమిస్తాడు. పర్వదినాలలో, విశేష ఉత్సవదినాలలో రత్నమయమైన కిరీట,చక్ర, శంఖ, వైకుంఠహస్త, కటిహస్తాలతో గోచరిస్తాడు. రత్నమయమైన కర్ణపత్రాలతో రత్నమయమైన మకరకంఠితో కనువిందు చేస్తాడు. సువర్ణపీతాంబరంకూడ ధరిస్తాడు.

శ్రీనివాసుడు ఈ పదిరత్నాభరణాలతో విశేషదినాలలో భక్తులకు తనదర్శనవిశేషం కల్పిస్తాడు. శ్రీనివాసుని వక్షస్థలంలోని దక్షిణభాగంలో శ్రీదేవి (అలమేలు మంగతాయారు), వామభాగంలో భూదేవి ఆభరణరూపంగా, ప్రతిమారూపంగా నెలకొన్నారు. ఆనంద నిలయంలోని అట్టి శ్రీనివాసుని దివ్యసుందరమూర్తిని, దివ్యమనోహరమూర్తిని, దివ్యలావణ్యమూర్తిని, దివ్యచైతన్యమూర్తిని దర్శించుకొనడం ఒకమహావరం. పూర్వజన్మపుణ్యఫలం. మహాభాగ్యం.

"సౌభాగ్యదాయకం విష్ణుం వేంకటేశం సమశ్చయ
సేనానీః షణ్ముఖశ్చాపి విష్ణుర్లక్ష్మీపతిః స్వయం
ఉభౌ శంభుం సమారాధ్య తత్ర వేంకటభూధరే
సంగతా నేక భావేన సర్వభూతవరప్రదా"

"విష్ణుస్కందాత్మికామూర్తి వేంకటేశ్వరరూపిణీ
సర్వదేవ మయీశక్తిః పూజ్యతాం సర్వమానవైః"
— మార్కండేయపురాణం

భక్తులకు పూర్వజన్మసాధనా సంస్కారాన్ని అనుసరించి శ్రీవారిని దర్శించగానే ఒక్కొక్కరికి ఒక్కొక్కవిధంగా శ్రీవారి రూపాన్నిగూర్చిన భావన యేర్పడుతుంది. శ్రీ చక్రోపాసకులకు దేవిగా గోచరిస్తుంది. జ్ఞానులకు బాలసుబ్రహ్మణ్యంగా కనపడతాడు. కాలుని, కాముని జయించిన శివునిగా కొందరికన్నులలో తాండవిస్తాడు. మరికొందరికి త్రిమూర్తిస్వరూపునిగా, దత్తభగవానునిగా దర్శన భాగ్యం అనుగ్రహిస్తాడు. ఇంకొందరికి హరిహరునిగా సాక్షాత్కరించి అలరిస్తాడు. పరవాసుదేవునిగా, నారాయణస్వరూపునిగా, శ్రీనివాస పరబ్రహ్మగా అసంఖ్యాకులైన భక్తులకు గోచరించి ఆనందపరవశులను చేస్తాడు. ఏ రూపంలేనిస్వామి భక్తుల భావనాబలంతో వారికి కావలసినరూపంతో, వారికి దివ్యానుభూతిని ప్రసాదిస్తాడు. ఆ రూపానికి సంబంధించిన నామంతో వ్యవహరింపబడుతో పూజ లందుకొంటున్నాడు. భగవానుడు భక్తజనసులభుడు. భక్తమనోరథ వరప్రదుడు. స్వామి ఒక్కడు. భక్తులు పలువురు. పలువురు పలువిధాలుగా స్వామిని భావించి, సేవించి తరిస్తున్నారు. ఎవరు ఎలా పిలిచినా, కొలిచినా పలికేస్వామి - కోరికలు తీర్చేస్వామి శ్రీ ఏడుకొండల స్వామి.

"ఎంతమాత్రమున నెవ్వరుదలచిన అంతమాత్రమే నీవూ
అంతరాంతము లెంచిచూడఁబిండంతే నిప్పటియున్నట్లూ
కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుడని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మమనుచు
తలతురు మిమ్ముశైవులు తగినభక్తులను శివు డనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆదిభైరవు డనుచు

సరి నెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు
దరిసెనములు మిము నానావిధులను తలపులకొలదుల భజింతురు
సిరుల మిమ్ము నే యల్పబుద్ధి దలచినవారికి నల్పంబవుదువు
గరిమల మిమునే ఘనమనితలచిన ఘనబుద్ధులకు ఘనుడవు
నీవలనఁ గొఱతలేదుమఱి నీరుకొలఁది తామెరవు
ఆవల భాగీరథి దరిబావుల ఆ జలమే వూరినయట్లు
శ్రీ వేంకటపతి నీవైతే మముఁ జేకొనివున్న దైవమని
యీవల నేనీశరణనియెద నిదియే పరతత్త్వము నాకు”

— అన్నమయ్య అధ్యాత్మసంకీర్తన



# బ్రహ్మోత్సవం

"నానాదిక్కుల నరులెల్ల
వానలలోననే వత్తురు గదలి
సతులు సుతులు పరిసరులు బాంధవులు
హితులు గొలువగా నిందరును
శతసహస్రయోజనవాసులు సు
వ్రతములతోడనె వత్తురు గదలి
ముడుపులు జాళెలు మొగి తలమూటలు
కడలేనిధనము కాంతలును
కడుమంచిమణులు కరులు తురగములు
వడిగొని చెలగుచు వత్తురు గదలి
మగుటవర్ధనులు మండలేశ్వరులు
జగదేకపతులు చతురులును
తగువేంకటపతి దరుశింపగ బహు
వగలసంపదల వత్తురు గదలి"

— అన్నమయ్య ఆధ్యాత్మికసంకీర్తన

## బ్రహ్మోత్సవం - పౌరాణికప్రశస్తి

శ్రీనివాసుని బ్రహ్మోత్సవానికి వచ్చే భక్తకోటిని, యాత్రిక కోటిని వర్ణిస్తూ గానంచేసిన అన్నమయ్య సంకీర్తన యిది. ప్రయాణ సాధనాలు పరిమితంగాఉన్న అన్నమయ్యకాలంలో శ్రీవారి బ్రహ్మో త్సవానికి వేలాదిభక్తులు రాగా, ప్రయాణసాధనాలు అపరిమితంగాఉన్న ఈ కాలంలో లక్షలాది భక్తులువచ్చి కోట్లాదిరూపాయలను కానుక లుగా శ్రీవారికి బ్రహ్మోత్సవసమయంలో సమర్పిస్తున్నారు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవాన్ని తిలకింపగలిగామని

ఆనందిస్తున్నారు. శ్రీవారి బ్రహ్మోత్సవపు వేడుకలు చూడగలగడం భక్తుల భాగ్యం. మానవులకు పూర్వజన్మ పుణ్యవిశేషంవలన అట్టి అవకాశం లభిస్తుంది.

శ్రీనివాసుడు ఒకదివ్యమైన విమానంలో బ్రహ్మాది దేవతలకు పుణ్యపురాణకాలంలో దర్శనభాగ్యం ప్రసాదించాడు. ఆదేవతలకు వరాలు అనుగ్రహించాడు. "వైఖానసశాస్త్రవిధి ననుసరించి ధ్వజారోహణంతో ప్రారంభించి రథారోహణంతో పరిసమాప్తమయ్యే ఒక మహోత్సవం నీకు కావింప సంకల్పించాను. శ్రీమహాలక్ష్మితో కలసి నీవు ఆ ఉత్సవాన్ని అంగీకరించి, స్వీకరించి, ఆశీర్వదించాలి" అని బ్రహ్మదేవుడు శ్రీనివాసుని అర్థించాడు. శ్రీనివాసుడు బ్రహ్మదేవుని విన్నపాన్ని మన్నించి అంగీకరించాడు. బ్రహ్మదేవుడు శ్రీనివాసునకు బ్రహ్మోత్సవం నిర్వహించాడు:

"కాలశ్రద్ధా నిమిత్తాఖ్యా ఉత్సవాః త్రివిధాః" అని భృగువచనం. కాలోత్సవం, శ్రద్ధోత్సవం, నిమిత్తోత్సవం అని ఉత్సవాలు మూడు విధాలు. అసంఖ్యాకులైన మానవులు అసంఖ్యాకములైన కోరికలతో ఉంటారు. ఈవిషయాన్ని వ్యాసభగవానుడు సహస్రనామాధ్యయన ఫలశ్రుతిలో వివరించాడు. భక్తులు కావించే మ్రొక్కుబడి సేవలు, ప్రార్థనోత్సవాలు శ్రద్ధోత్సవాలు, గ్రహణం, సంక్రమణం, అనావృష్టి, ఉత్పాతం నిమిత్తంగా వాని నివారణకుకావించే ఉత్సవాలు నిమిత్తోత్సవాలు. కాలోత్సవానికి విధింపబడిన ధ్వజారోహణం, నవసంధి దేవతల ఆహ్వానం, బలిప్రదానం అనే మూడు క్రియలు శ్రద్ధ, నిమిత్తోత్సవాలకు వర్తించవు. మిగతా కాలోత్సవవిధులు, వాహనసేవలు శ్రద్ధ నిమిత్తోత్సవాలలో నిర్వహించే భక్తులకు అశ్వమేధయాగ మహాఫలం లభిస్తుంది. లౌకిక పారలౌకిక సుఖశాంతులు కలుగుతాయి. ఇది ఫలాభిసంధి కల భక్తులకు కలిగేఫలం. కామ్యం లేనివారి కైంకర్యానికి భగవదనుగ్రహాఫలం సిద్ధిస్తుంది.

"అనన్యా శ్చిన్తయన్తోమాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"

భగవదనుగ్రహ స్వరూపం భక్తుని నిత్య యోగక్షేమ పరిశీలనా రూపంలో ఉంటుందని గీతాచార్యుడు వాసుదేవుడు వక్కాణించాడు.

"ధరసింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయములెల్ల వందిగణమై బ్రహ్మాండమాకారమై
సిరిభార్యామణియై విరించి కొడుకై శ్రీగంగసత్పుత్రియై
వరుసన్ నీఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా"

శ్రీనివాసునినిత్యైశ్వర్యం వృద్ధి చెందాలని శ్రీనివాసునిభక్తులు నిత్యం ఆవిధంగా ప్రార్థిస్తారు. శ్రీనివాసుని నిత్యైశ్వర్యవైభవం శ్రీవారి బ్రహ్మోత్సవంలో సువ్యక్తమవుతుంది. ఈ బ్రహ్మోత్సవం శాలోత్సవం, నిత్యోత్సవం, మహోత్సవం, కల్యాణోత్సవం అని కూడ వ్యవహరింపబడుతోంది. ఇది దక్షిణాపథంలో బ్రహ్మోత్సవంగా, ఆంధ్రదేశంలో కళ్యాణోత్సవంగా ప్రాచుర్యం సంతరించుకొంది. ఈ బ్రహ్మోత్సవం నియమిత కాలంలో చెయ్యకపోతే దోషమని, ఆ దోష నివారణకై ప్రాయశ్చిత్తంచేసి తరువాత నెలలో అదే తిథినాడుగాని, నక్షత్రంనాడుగాని అవభృథం సంకల్పించి ఉత్సవం నిర్వహించి తీరాలని మరీచి మహర్షి నిర్దేశిస్తున్నాడు.

వేదాలలో విధింపబడిన యజ్ఞాలు రెండువిధాలు. అవి అమూర్త యజనాలు. సమూర్త యజనాలు. అమూర్త యజనానికి సంవత్సరానికి ఒకసారి సవం (సోమయాగం) విధింపబడింది. సమూర్త యజనంలో సంవత్సరానికి ఒకసారి ఉత్సవం (బ్రహ్మోత్సవం) విధింపబడింది. రెండూకూడా అవభృథంలో సమాప్త మవుతాయి. సవం ఒకవ్యక్తి మాత్రమే పరిమితం. ఉత్సవం భక్తజనావళికి ప్రయోజనకరం. ఈ

"అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"

భగవదనుగ్రహ స్వరూపం భక్తుని నిత్య యోగక్షేమ పరిశీలనా రూపంలో ఉంటుందని గీతాచార్యుడు వాసుదేవుడు వక్కాణించాడు.

"ధరసింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయములెల్ల వందిగణమై బ్రహ్మాండమాకారమై
సిరిభార్యామణియై విరించి కొడుకై శ్రీగంగసత్పుత్రియై
వరుసన్ నీఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా"

శ్రీనివాసుని నిత్యైశ్వర్యం వృద్ధి చెందాలని శ్రీనివాసుని భక్తులు నిత్యం ఆవిధంగా ప్రార్థిస్తారు. శ్రీనివాసుని నిత్యైశ్వర్యవైభవం శ్రీవారి బ్రహ్మోత్సవంలో సువ్యక్తమవుతుంది. ఈ బ్రహ్మోత్సవం శాలోత్సవం, నిత్యోత్సవం, మహోత్సవం, కల్యాణోత్సవం అని కూడ వ్యవహరింపబడుతోంది. ఇది దక్షిణాపథంలో బ్రహ్మోత్సవంగా, ఆంధ్ర దేశంలో కళ్యాణోత్సవంగా ప్రాచుర్యం సంతరించుకొంది. ఈ బ్రహ్మోత్సవం నియమిత కాలంలో చెయ్యకపోతే దోషమని, ఆ దోష నివారణకై ప్రాయశ్చిత్తంచేసి తరువాత నెలలో అదే తిథినాడుగాని, నక్షత్రం నాడుగాని అవభృథం సంకల్పించి ఉత్సవం నిర్వహించి తీరాలని మరీచి మహర్షి నిర్దేశిస్తున్నాడు.

వేదాలలో విధింపబడిన యజ్ఞాలు రెండువిధాలు. అవి అమూర్త యజనాలు. సమూర్త యజనాలు. అమూర్త యజనానికి సంవత్సరానికి ఒకసారి సవం (సోమయాగం) విధింపబడింది. సమూర్త యజనంలో సంవత్సరానికి ఒకసారి ఉత్సవం (బ్రహ్మోత్సవం) విధింపబడింది. రెండూకూడా అవభృథంలో సమాప్త మవుతాయి. సవం ఒకవ్యక్తికి మాత్రమే పరిమితం. ఉత్సవం భక్తజనావళికి ప్రయోజనకరం. ఈ

మాసంతో కలిసిన భాద్రపదంలో బ్రహ్మోత్సవం యథాప్రకారం జరుగుతుంది. ఆశ్వయుజమాసంలో రెండవబ్రహ్మోత్సవం నవరాత్రి ఉత్సవంగా జరుగుతుంది. ధ్వజారోహణ, ధ్వజావరోహణాలు దీనిలో జరుగవు. ప్రత్యేకంగా వెండిరథంపైన శ్రీవారికి రెండవబ్రహ్మోత్సవసమయంలో రథోత్సవం జరుగుతుంది.

శ్రీనివాసునకు సూర్యుడు కన్యామాసంలో ప్రవేశించినతరువాత ద్వితీయమందు వైఖానసులచేత అంకురార్పణ పూర్వకంగా బ్రహ్మధ్వజారోహణం చేయించి బ్రహ్మోత్సవం ప్రారంభించాడు. కలియుగాంతంవరకూ నిలచే రెండు అఖండజ్యోతులను శ్రీవారిసన్నిధిలో నెలకొల్పాడు. ఆ బ్రహ్మోత్సవానికి అపూర్వమైన వాహనాలను, మనోహరమైన రథాలను, రమణీయమైన ఛత్ర, చామర, వ్యజనాదులను విశ్వకర్మ నిర్మించి భక్తిపురస్సరంగా శ్రీనివాసునకు సమర్పించాడు. ఆగమశాస్త్రం నిర్దేశించినవిధంగా బ్రహ్మ అర్చామూర్తికి తోడుగా ఉత్సవశ్రీనివాసమూర్తి, ఉగ్రశ్రీనివాసమూర్తి, కొలువు శ్రీనివాసమూర్తి, విమానశ్రీనివాసమూర్తి విగ్రహాలను నాలుగువేదాలకు ప్రతీకలుగా రూపొందించాడు. ఆ బ్రహ్మోత్సవసమయంలో షడ్విధాన్నములైన గుడాన్న, తిలాన్న, పరమాన్న, ముద్గాన్న, మాషాన్న, దధ్యన్నాలతో కూడిన గూడాపూప, తిలాపూప, మాషాపూప, మనోహర, మోదకాదిభక్ష్యాలతో కూడిన వివిధములైన, రుచికరములైన, చిత్ర, విచిత్రములైన నైవేద్యాలు బ్రహ్మ స్వామికి నివేదన చేసాడు. శేష, హంస, సింహ, కల్పవృక్ష, పల్లకీ, గరుడ, హనుమంత, ఐరావత, సూర్యమండల, హయ, రథ ఆదిగా గల బహువిధవాహనోత్సవాలు శ్రీవారికి చతుర్ముఖుడు యేర్పాటు చేసాడు. బ్రహ్మ ఈ ఉత్సవంలో 6వ నాడు సాయంత్రం శ్రీవారికి ఉద్యాన విహారమహోత్సవం, 10వ రోజున పుష్పయాగమహోత్సవం

జరిపించాడు. ఆ బ్రహ్మోత్సవంలో గంధర్వులుగానం చేసారు అప్సరలు నాట్యమాడారు. భేరీ, మృదంగ, మురజ, పణవ, ఆనక, గోముఖ, ఢక్కా, ఝర్ఝర, నిస్సాణాదివాద్య విశేషాల మధుర, మంజుల, మనోహరనాదాలు సప్తగిరులలో ప్రతిధ్వనించాయి. ముక్కోటిదేవతలు మక్కువతో శ్రీవారి బ్రహ్మోత్సవంలో పాల్గొన్నారు. బ్రహ్మ సంఖ్యాకమైన తొమ్మిదిదినాలు ఈ ఉత్సవం జరగడంచేత దీన్ని బ్రహ్మోత్సవం అని ఆగమశాస్త్రం నిర్ణయించింది. బ్రహ్మకావించిన ఉత్సవం కనుక ఇది బ్రహ్మోత్సవంగా ప్రసిద్ధిపొందింది. భక్తులకు బ్రహ్మానందం కలిగించే ఉత్సవంకనుక ఇది బ్రహ్మోత్సవమయింది. ఇది శ్రీనివాస పరబ్రహ్మఉత్సవం కావడంవలన దీనిని సంప్రదాయవేత్తలు బ్రహ్మోత్సవమని నిర్ణయించారు. 'బృహి' అనే ధాతువునుండి బ్రహ్మ శబ్దం ఉత్పన్నమైనది. బ్రహ్మ అంటే గొప్ప అని అర్థం. అందుచేత ఈ బ్రహ్మోత్సవం గొప్ప ఉత్సవం అని ప్రకటింపవచ్చును. భక్తులకు బ్రహ్మానందం కలిగించే శ్రీనివాసపరబ్రహ్మకు బ్రహ్మకావించిన బ్రహ్మోత్సవమిది. ఇన్నికారణాలవల్ల ఈ మహోత్సవానికి బ్రహ్మోత్సవం అనేపేరు సార్థకమైంది. అన్వర్థభాజనమైంది. అది నేటికీ అవిచ్ఛిన్నంగా జరుగుతోంది. ఇది తిరుమలపై జరిగే బ్రహ్మోత్సవానికి సంబంధించిన పౌరాణికప్రశస్తి.

## బ్రహ్మోత్సవం - చారిత్రకప్రశస్తి

క్రీ. శ. 966 లో సమవాయి అనే పల్లవరాణి నమ్మాళ్వారువర్ణనలకు, వివరణలకు, ఊహలకు, ఉద్దేశాలకు రూపకల్పనచేయించి, వెండితో భోగశ్రీనివాసమూర్తి విగ్రహాన్ని తయారుచేయించి భక్తి పురస్సరంగా సమర్పించింది. శ్రీవారికి పురట్టాసి నెలలో తొమ్మిది రోజులపాటు జరిగే బ్రహ్మోత్సవాన్ని సమవాయి యేర్పాటుచేసింది.

మార్గళిమాసంలో సప్తాహ్నికంగా జరిగే ఒక బ్రహ్మోత్సవానికి కూడ ఆమె తగినపద్ధతి నిర్ణయించింది. చారిత్రకంగా స్వామివారి బ్రహ్మోత్సవం పదోవశతాబ్దంలో సమవాయి సన్నాహంతో ప్రారంభమైంది. మూడవ బ్రహ్మోత్సవం చిత్రి (చైత్రిం) మాసంలో తెలుగు పల్లవరాజు విజయగండగోపాలదేవర్ క్రీ. శ. 1254 లో ప్రారంభించాడు. మూడవ రాజరాజు సామంతుడు వీరనరసింగదేవుడు పంగుణి (ఫాల్గుణం) మాసంలో, శ్రీవారికి బ్రహ్మోత్సవాలు జరగడానికి యేర్పాట్లుచేసాడు. క్రీ. శ. 1328 లో త్రిభువనచక్రవర్తి తిరువేంకటనాథ యాదవరాయలు ఫంగుణి ఉత్సవం (ఫంగుణి బ్రహ్మోత్సవం) అతనిరాణి ఆడితిరునాళ్ (ఆషాఢమాసపు బ్రహ్మోత్సవం) నిర్వహించే యేర్పాట్లు కావించారు. రెండవ హరిహరరాయలు పేరుతో మాసితిరునాళ్ (మాఘమాసపు బ్రహ్మోత్సవం) యేర్పడింది. దీన్ని ముల్లై తిరువేంకటజియ్యరు శాసనం బలపరుస్తోంది. ఇలా క్రీ.శ. 1445 నాటికి ఏడుకొండలవానికి జరిగే బ్రహ్మోత్సవాలసంఖ్య ఏడుకు పెరిగింది. క్రీ. శ. 1530 లో అచ్యుతరాయలు పేరుతో యేర్పడినదానితో కలిపి శ్రీవారి బ్రహ్మోత్సవాల సంఖ్య తొమ్మిదికి పెరిగింది. 1537 లో తాళ్ళపాకం తిరుమలయ్యంగారు ఆణి(జ్యేష్ఠ) మాసంలో యేర్పాటు చేసిన దానితో బ్రహ్మోత్సవాల సంఖ్య పదికి పెరిగింది. విజయనగర రాజు సదాశివరాయలు కాలంనాటికి వీటిసంఖ్య పదకొండుకు పెరిగాయి.

8-7-1551 నాటి సదాశివరాయలు కాలపు శాసనం సమవాయి మార్గళి పురట్టాసి, దేవరాయలు అర్పసి, బుక్కరాయుని కార్తికై, శ్రీకృష్ణదేవరాయుని తై (పుష్యం), హరిహరరాయుని మాశి, వీరనరసింగయాదవరాయుని ఫంగుణి, తాళ్ళపాకం తిరుమలయ్యంగారి ఆణిమాసాలలో యేర్పాటుచేసిన పదకొండు బ్రహ్మోత్సవాలనుగూర్చి వివరించింది. ఈపదకొండు బ్రహ్మోత్సవాలు, ఇతర ముఖ్యఉత్సవాలు

సంవత్సరంలో 250 రోజులు జరిగేవి. 250 అతిరసపడి నివేదనలుజరిగేః ఆనాటి బ్రహ్మోత్సవం తిరుక్కోడి తిరునాళ్ అని వ్యవహరింపబడేది శ్రీవారి బ్రహ్మోత్సవాలు ఏ ఒకమాసానికో పరిమితంగాక సంవత్సరంలో ప్రతినెలా జరుగుతుండేవి. కాలక్రమేణా శ్రీవారి బ్రహ్మోత్సవాల సంఖ్య పెరిగినట్లుగానే, ఇవి నిర్వహింపబడే రోజుల సంఖ్యక్రమ పరిణామం చెందుతూ వచ్చింది. ఏడుకొండలవాని బ్రహ్మోత్సవం 10వ శతాబ్దంలో సమవాయికాలంలో ఏడుదినాలతో ప్రారంభమైంది నాలుగుశతాబ్దుల పిమ్మట 1339 వ సంవత్సరంలో స్వామివారి బ్రహ్మోత్సవ నిర్వహణంలో స్వర్ణయుగం ప్రారంభమైంది. ఉత్సవ శ్రీనివాసమూర్తి విగ్రహం ఒక కొండక్రింద లభించింది. అందుచేతనే ఆస్వామి మలయప్పస్వామి అయ్యాడు. క్రీ. శ. 1392 నుండి శ్రీవారి బ్రహ్మోత్సవాలు నవాహ్నికంగా జరిగాయి. శ్రీదేవి, భూదేవి సమేతుడైన శ్రీమలయప్ప పెరుమాళ్ళు బ్రహ్మోత్సవవైభవాలను ఇతోధికం, శతాధికం కావించాడు. కల్యాణరమణీయతను దశదిశలా వ్యాపింపజేసాడు. విశ్వవ్యాప్తంచేసాడు. తిరుమలచేరిన భక్తులకు మధురానుభూతులను ప్రసాదించాడు. తిరుమలకు చేరనివారికి, రాలేనివారికి భక్తిమాధురలను ప్రసారంకావించాడు. 1545_1447 సంవత్సరాల మధ్యనుండి 1545 వరకూ అంకురార్పణనాడే అంగరంగ వైభాలతో శ్రీవారికి కల్యాణోత్సవం నిర్వహింపరడేది. రెండవదేవరాయలు బ్రహ్మోత్సవం యేర్పాటుచేసినది మొదలు 15 వ శతాబ్దంవరకూ ఈ ఉత్సవం స్వామివారికి తొమ్మిదిదినాలు జరిగింది. 15వ శతాబ్దం తరువాత ఉత్సవదినాల సంఖ్య పదిరోజులకు, పదకొండు రోజులకు వృద్ధి చెందింది. 1600 సం॥నాటికి బ్రహ్మోత్సవపుదినాల సంఖ్య పన్నెండుకు పెరిగింది. కొంతకాలం ఈ ఉత్సవం పదమూడురోజుకూడా చేయబడింది. 1544 లో బ్రహ్మోత్సవానికి అంగంగా కోవెల ఆళ్వారు

తిరుమంజనం అనే ప్రత్యేక ఉత్సవం నిర్దేశింపబడింది. ఇది స్వామి వారి గర్భాలయాన్ని పరిశుభ్రం చేసి, పరిమళభరితం, సుగంధసంభరితం కావించడానికి ఉద్దేశింపబడిన ప్రత్యేక ఉత్సవం.

బ్రహ్మోత్సవం - వాహన సేవలు

బ్రహ్మోత్సవపు శోభలు, శ్రీవారికి జరిగే వాహన సేవా వైభవాలద్వారా వ్యక్తమవుతాయి. తిరుమల శాసన సామ్రాజ్యంలో స్వామివారి బ్రహ్మోత్సవ వాహనాలు ప్రముఖ స్థానాలు ఆక్రమించాయి, క్రీ. శ. 1491 లో అశ్వవాహనం, 1530 లో గరుడవాహనం, 1564 లో వైకుంఠవిమానం, సూర్యప్రభవాహనం, 1614 లో వెండి శేషవాహనం, వెండిసింహవాహనం, 1628 లో స్వర్ణ అశ్వవాహనం, స్వర్ణగజవాహనం, వెండి సమరభూపాల వాహనం మొదలైన వాహనాలు బ్రహ్మోత్సవ సమయంలో శ్రీవారిని ఊరేగించడానికై సమర్పింపబడ్డాయి. క్రీ. శ. 1628 సం॥ లో మట్ల కుమార అనంతరాజు స్వామివారికి స్వర్ణ అశ్వవాహనాన్ని, వెండి గజవాహనాన్ని, వెండి సమర భూపాల వాహనాన్ని బ్రహ్మోత్సవపు కానుకలుగా సమర్పించి చరితార్థుడయ్యాడు. ఈ బ్రహ్మోత్సవ సమయంలో ఐదవనాడు గరుడ వాహనోత్సవం, ఎనిమిదవనాడు రథోత్సవం స్వామికి నిర్వహింపబడినట్లు శాసన సాక్ష్యాధారాలు కానవస్తున్నాయి. క్రీ. శ. 1476 వ సంవత్సరపు శాసనం బ్రహ్మోత్సవసమయంలో శ్రీ వేంకటేశ్వరస్వామి వారి రథోత్సవవైభవాన్ని వర్ణించింది. ఈనాటికీ స్వామివారి బ్రహ్మోత్సవంలో 5వ రోజున గరుడోత్సవం, 8వనాడు రథోత్సవం సంప్రదాయ విధేయంగా జరుగుతూనే ఉన్నాయి. శ్రీవారి వాహన సేవావైభవాలు, రథోత్సవపువేడుకలు చరిత్రపుటలలో, శాసనాలలో ఆవిధంగా గోచరిస్తున్నాయి. చరిత్ర పాఠకుల్ని అందరిని అలరిస్తున్నాయి. ఆనందపరవశుల్ని కావిస్తున్నాయి.

దైవదర్శనానికి వృద్ధాప్యంచేత, అనారోగ్యంచేత మరి ఇతర కారణాలవలన రాలేని వారి సౌకర్యంకోసం, వారికి దైవదర్శనభాగ్యం ప్రసాదించడంకోసం ఆగమశాస్త్రాలు వాహనసేవలను, ఉత్సవవరులకు వీధి భ్రమణోత్సవాలను విధించాయి. బ్రహ్మోత్సవ సమయంలో శ్రీవారు పొందే వాహనసేవలలో గొప్పఆధ్యాత్మిక సందేశం భక్తులకు లభిస్తుంది. స్వామివారు ఆదిశేష, హంస, సింహ, కల్పతరువు, గరుత్మంత, హనుమంత, సూర్య, చంద్ర, అశ్వ, గజ, రథాదివాహనాలు అధిరోహించి, రాజాధిరాజోచితవైభవాలు అనుభవిస్తూ, ఛత్రచామరాదులతో అలంకరింపబడి తిరువీధులలో ఊరేగుతున్నారు. తూర్యనాదాలతో, వేదనాదాలతో స్తుతింపబడుతున్నారు. ఈవిధంగా ఆరాధనలు పొందుతూ అందరినీ అలరిస్తున్నారు. భక్తులకు నిగూఢమైన ఆధ్యాత్మిక తత్త్వోపదేశం అందిస్తున్నారు. చేతనులను ఆధ్యాత్మిక చింతనలో లగ్నం చేస్తున్నారు. నిమగ్నంచేస్తున్నారు. ఆధ్యాత్మికంగా చైతన్యవంతుల్ని చేస్తున్నారు.

శేష వాహనం

"నివాస శయ్యాసన పాదుకాంశుకోపధానవర్షాతపవారణాదిభిః
శరీరభేదైస్తవ శేషతాంగతైః యథోచితం శేష ఇతీర్యతే
జనైః"

శేషుడు శ్రీమన్నారాయణ పరాయణుడు. ప్రప్రథమపాదసేవకుడు. శ్రీహరిదాసుడు. శేషత్వపాత్రుడై ఆదిశేషుడయ్యాడు. పాలకడలిలో స్వామికి శయనమయ్యాడు. వైకుంఠంలో ఆసనమయ్యాడు. వస్త్రమయ్యాడు. పాదుకాద్వయమయ్యాడు. ఆదిశేషుని వలె ఆశేషభక్తజనం తనతో శేషత్వం పొందిననాడే- తనకుదాస్య భక్తి నెరపిననాడే పశుత్వంపోయి మానవత్వం కలుగుతుందని. దానినుండి దైవత్వం, అమరత్వం సిద్ధిస్తుందనే- దివ్యసందేశం అందివ్వడానికే శేషాద్రి శిఖర

వాసుకు ఆది శేషవాహనరూఢుడై విహరిస్తాడు. తనను సేవించిన ఆ పాములోని విషం హరించినట్లే, తనను సేవించే మానవులోని కిల్బిషం కూడా హరిస్తుందని శ్రీహరి శేష వాహనాలంకారుడై ప్రకటిస్తాడు. ఇదే శ్రీనివాసుని శేషవాహన సేవలోని సందేశరహస్యం.

హంస వాహనం

నీటిపైన, నేలపైన, నింగిలోను సంచరించే పక్షి హంస. పాలలో కలసిన నీళ్ళను వదలి పాలను త్రాగగలది హంస. మధు కైటభులు వేదాలను అపహరిరచారు. ఆవిధంగా బ్రహ్మదేవుని శాస్త్ర దృష్టిని హరించారు. బ్రహ్మ విష్ణువును ప్రార్థించాడు. శ్రీహరి హంస రూపములో ప్రత్యక్షమై వేదాలనుఉద్ధరించి బ్రహ్మ కుపదేశించాడు. 'హం' శివబీజము. 'స' కారము శక్తిబీజము. హంసః అంటే శివశక్తి సంపుట మైన బ్రహ్మాండం. హంస అంటే ప్రాణం. హంస అంటే సూర్యభగ వానుడు. "హకారేణ బహిర్యాతి, సకారేణ పునర్విశేత్." శ్వాస హకారంతో బయటకు వస్తుంది. సకారంతో మరలలోనికి ప్రవేశి స్తుంది. ప్రతిదినం మానవుడు 21,600 హంసమంత్ర మనబడే అజప గాయత్రిని జపిస్తాడు. ఆ అజపగాయత్రిని 'హంస స్సోహం హంస స్సోహం హంసః' అనే ఉపనిషద్వాక్యానుసారం 'స్సోహం' భావన చేయాలి. హంసజీవునికి, జీవేశ్వరునికి సంకేతం. 'హంసస్తు పరమే శ్వరః' అని ఉపనిషద్వచనం. హంస మానస సరస్సులో సంచరిస్తుంది. పరమేశ్వరహంసకు మానవుని మనస్సు అనే సరస్సు విహారస్థానం. 'సోహం' భావంకలిగిన భక్తులలో అహం భావం తొలగించి 'దాసోహం' అనే భావం కలిగించడానికే శ్రీనివాసుడు హంస వాహనారూఢుడై బ్రహ్మోత్సవసమయంలో తిరువీధులలో విహరిస్తాడు. హంసస్వరూపు డైన భగవానుడు హంసరూపులైన మానవులకు హంసతత్త్వం నిరూ

పించడానికి - వివరించడానికి హంసవాహనం అలంకరిస్తాడు. ఇది శ్రీని వాసుని హంసవాహన సేవలోని పరమార్థం.

సింహ వాహనం

శ్రీకృష్ణుడు గీతలో తాను మృగాలలో సింహాన్ని అని ప్రకటించాడు. సింహం మృగరాజు. నరుడు ప్రహ్లాద సాధనచేస్తే నారసింహంగా పరిణమిస్తుంది. దుష్టగుణ నిర్మూలనాన్ని, దుష్టసంహారాన్ని నరునకు నారాయణుడు నరసింహావతారంలో అనుగ్రహిస్తాడు. ప్రతి మానవుడు సింహబలతుల్యమైన అచంచల భక్తిభావనాబలాన్ని ప్రకటించి తనను స్వాధీనం చేసికోవాలని నిరూపించడానికై శ్రీనివాసుడు సింహారూఢుడై వాహనసేవలు అందుకొంటాడు. సింహంబలం తన బలానికి అధీనమైనదనీ, భక్తులకు బలవంతులపీడలు ఉండవని తెలపడానికి సింహ విక్రముడై, సింహవాహనుడై బ్రహ్మోత్సవంలో స్వామి ఊరేగుతాడు.

కల్పవృక్ష వాహనం

పక్షులలో హంస, మృగాలలో సింహం, వృక్షాలలో కల్పవృక్షం గణనీయాలు. కల్పవృక్షానికి కామితార్థ వరప్రదానంచేసే శక్తి సర్వాంతర్యామియైన భగవంతుని వరప్రసాదంవలన లభించింది. సర్వభూతాలకుకీర్తి, శక్తి ప్రసాదించేవాడు సర్వేశ్వరుడే! "ప్రసిద్ధి హేతుర్భూతానాం, ప్రాయశః ప్రభుసంగ్రహః" అని ప్రసిద్ధికదా! కల్పవృక్షం ఈసత్యాన్నే వ్యక్తంచేస్తోంది. కల్పవృక్ష వాహన సేవ పొందే స్వామివారు బ్రహ్మోత్సవసమయంలో సమావేశమైన సురులను, నరులను ఉద్దేశించి ఉపదేశం అందించే స్థితిలో గోచరిస్తారు.

హనుమంత వాహనం

ఆంజనేయుడు శ్రీరామ దూత. రామద్వారపు కాపరి. సీతారాముల పాదసేవకుడు. సూర్యభగవానునివద్ద వేదాలు నేర్చాడు. నవ

వ్యాకరణ పండితుడు. భావి బ్రహ్మదేవుడు. చిరంజీవి. లంకాదహనం కావించి రాక్షససంహారం సాధించాడు. లక్ష్మణ ప్రాణ రక్షకుడు. విభీషణ ప్రియకరుడు. శ్రీరాముణ్ణి తన భుజంపైన వహించిన ధన్యుడు హనుమంతుడు. రామనామంపైన మనస్సు, రామపాదంపైన శిరస్సు ఉంచిన శ్రీరామభక్తుడు ఆంజనేయుడు. ఆంజనేయుని జన్మస్థానం వేంకటాద్రిలోని అంజనాచలం. శ్రీనివాసుడు త్రేతాయుగంలో శ్రీరామావతారం తను ధరించినదానికి ఆనవాలుగా బ్రహ్మోత్సవంలో హనుమద్వాహనోత్సవం పొందుతున్నాడు. సత్యం, ధర్మం అవలంబించమనే ప్రబోధం చేస్తూన్నట్లు మలయప్పస్వామి ఆ సమయంలో గోచరిస్తాడు. హనుమంతునివలె దాస్యభక్తి సల్పినవారికి తాను వశుడనౌతానని ప్రకటించడానికి శ్రీవారు హనుమద్వాహన సేవ పొందుతారు.

## సూర్యప్రభ, చంద్రప్రభ వాహనాలు

"భాస్కరాయ విద్మహే మహద్ద్యుతి కరాయ ధీమహి తన్నో ఆదిత్యః ప్రచోదయాత్" అని శ్రుతి వాక్యం. సూర్యుడు లోక సాక్షి. కర్మ సాక్షి. ఆత్మ సాక్షి. గాయత్రీ మంత్రం ఆదిత్య స్తోత్రం. అగస్త్యు డుపదేశించిన ఆదిత్యహృదయాన్ని ముమ్మారు జపించి శ్రీరాముడు రావణసంహారం కావించాడు. 'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అని శాస్త్రవచనం. "సూర్యుడు ఇంద్రుడై దేవతా సార్వభౌముడయ్యాడు. ధాతయై సృష్టి చేస్తున్నాడు. పర్జన్యుడై మేఘాలను నడుపుతాడు. పూషుడై ఆహారపదార్థాలలో ప్రవేశించి జీవకోటికి బలమిస్తాడు. త్వష్టయై వృక్షకోటిని పెంచుతాడు. అర్యముడై జీవుల శరీరాలలో వాయువును నడుపుతాడు. వివస్వంతుడై అగ్నిలో ప్రవేశించి జీర్ణక్రియకు తోడ్పడతాడు అంశుమంతుడై వాయుచలనానికి సహాయపడతాడు. వరుణుడై నీటిలో నిండిఉండి ప్రాణాధారు డవుతాడు" అని

సాంబపురాణం సూర్యునిగూర్చి వర్ణించింది. సూర్యకాంతివలన చంద్రుడు వెన్నెలలు కురిపిస్తున్నాడు. సూర్యచంద్రులు భగవంతుని నేత్రాలు. మానవునకు దృష్టి సూర్యునివలన మనస్సు చంద్రునివలన యేర్పడింది.

"భీషాస్మాద్ వాతః పవతే- భీషోదేతి సూర్యః భీషాస్మాదగ్నిశ్చంద్రశ్చ" అని శ్రుతి. "సవితృమండలమధ్య వర్తీ నారాయణః" అని మనం నిత్యం సంధ్యావందనంలో అనుసంధానం చేస్తాము. విభూత్యధ్యాయంలోని భగవద్వాక్యం "నక్షత్రాణా మహంశశీ"- అని. సూర్యచంద్రలోకాలను పాలించేవాడు శ్రీనివాసుడు. శ్రుతి, పురాణేతిహాస వాక్యాలను, వర్ణనలను నిరూపించి, భక్తులకు మహదానందం కల్పించడానికి బ్రహ్మోత్సవసమయంలో శ్రీనివాసుడు సూర్యప్రభ, చంద్రప్రభ వాహనసేవలు అందుకుంటాడు. జన్మకికారకుడు మథనుడు. నిధనానికి కారకుడు కాలస్వరూపుడు. శ్రీనివాసుడు మన్మథునకు తండ్రి. కాలనిర్ణేతలైన సూర్యచంద్రులకు అధినాయకుడు, శ్రీనివాసుని సూర్యప్రభ, చంద్రప్రభ వాహనసేవలు కామున్ని, కాలున్ని జయించే శక్తులను భక్తులకు ప్రసాదిస్తాయి. జనన మరణాలనుండి విముక్తిని కల్పిస్తాయి.

## అశ్వవాహనం

రాక్షసులతో యుద్ధంచేసి అలసిపోయిన విష్ణుమూర్తి ఎక్కుపెట్టిన ధనుస్సుపై తలపెట్టుకొని నిద్రించాడు. దేవతలు యజ్ఞభాగాలు విష్ణుదేవునికి సమర్పించ సంకల్పించగా శ్రీహరి నిద్రిస్తూన్నట్లు కనుగొన్నారు. శివుడు నారినిత్రెంపితే హరినిద్రనుండి లేస్తాడని ఉపాయం చెప్పాడు. బ్రహ్మదేవుని కోరికప్రకారం వమ్రి అనే క్రిమినారిని కొరికింది. ధనుస్సు అతని మెడకు తగిలింది. శిరస్సు తెగిపోయింది. దేవి

గుఱ్ఱంతల అతికించమని దేవతలకు చెప్పింది. విశ్వకర్మ నిర్మించిన హయగ్రీవాన్ని అతికించారు. శ్రీమహావిష్ణువు హయగ్రీవుడయ్యాడు, లక్ష్మి శ్రీపతిని హయగ్రీవుడవు అవుతావని శపించింది. ఒకరాక్షసుడు దేవిని ప్రత్యక్షంచేసుకొని తనకు మృత్యువులేకుండా చేయమన్నాడు. ఆమె అది అసంభవమంది. హయగ్రీవునివలనమాత్రమే తనకు మరణం కలగాలని కోరుకొన్నాడు. బ్రహ్మకు, లోకానికి. హయగ్రీవస్వరూపంలో శ్రీహరి పాతాళంలోని వేదాలను ఉద్ధరించి అందించాడు. శ్రీనివాసభగవానుడు ధరించిన హయగ్రీవావతారం జ్ఞానానందమయమైనది. హయగ్రీవుడు సర్వవిద్యలకు ఆధారభూతుడు. విశుద్ధజ్ఞానప్రకాశస్వరూపుడు. విజ్ఞానదాన దీక్షాపరిపూర్ణుడు. హయగ్రీవావతారపు వేడుకలను చూపడానికై బ్రహ్మోత్సవంలో శ్రీవారు అశ్వవాహనారూఢులై విహరిస్తారు. శ్రీనివాసుడు రాజాధిరాజు. భక్తుల పల్లకి. రథ, గజ, తురగాదులు లోకాధిపత్యసూచకాలు. ప్రభుత్వసంపదలు. ప్రభువులకు ప్రభువైన శ్రీనివాసుడు అశ్వవాహనారూఢుడై భక్తహృదయ సామ్రాజ్యాలను పాలించే మనోహరదృశ్యం శ్రీనివాసుని అశ్వవాహనసేవలో గోచరిస్తుంది.

గజ వాహనం

గజేంద్రమోక్ష కథ భక్తజనులను భక్తిపరవశులను కావించే గాథ. శరణాగతి పరమప్రయోజనాన్ని వివరించే పవిత్రగాథ అది. అది ప్రపత్తియోగవివరణ ప్రకరణం. మకరిచే పట్టుబడిన కరి హరిని-

"ఎవ్వనిచేజనించు జగ మెవ్వనిలోపలనుండు లీనమై
యెవ్వనియందు డిందు పరమేశ్వరు డెవ్వడు మూలకారణం
బెవ్వ డనాదిమధ్యలయు డెవ్వడు సర్వముతానయైన వా
డెవ్వడు వానినాత్మభవు నీశ్వరు నేశరణంబు వేడెదన్.

ఒకపరిజగములు వెలినిడి, యొకపరిలోపలికిగొనుచును భయముదానై
సకలార్థసాక్షియగున, య్యకలంకునినాత్మమూలు నర్థితలంతున్.

లోకంబులు లోకేశులు, లోకస్థులు తెగిన తుదిన లోకంబగు పెం
జీకటికవ్వలనెవ్వం, డేకాకృతి వెలుగునతని నే సేవింతున్."

అని ప్రార్థించాడు.

"కలుగడే నాపాలికలిమి సందేహింప కలిమిలేములులేక కలుగువాడు
నాకడ్డపడరాడె నలినసాధువులచే బడినసాధుల కడ్డపడెడువాడు
చూడడే నాపాటు చూపులచూడక చూచువారల కృపచూచువాడు
లీలతో నా మొఱాలింపడే మొఱగులమొఱ లెఱుంగుచు తన్ను
మొఱగువాడు

అఖిలరూపముల్ దనరూపమైనవాడు
ఆదిమధ్యాంతములు లేక యడరువాడు
భక్తజనముల దీనులపాలివాడు
వినడె చూడడె తలపడె వేగరాడె"

అని గజేంద్రుడు శ్రీహరిరాకకోసం, అతని రక్షణకోసం ఎదురు
చూసాడు.

"లావొక్కింతయులేదు ధైర్యమువిలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్ తప్పెను మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప నితఃపరంబెరుగ మన్నింపదగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా"

అని గజరాజు అహం వదలుకొని, శ్రీహరికి 'దాసోహం'
అన్నాడు.

ఆపన్నప్రసన్నుడైన శ్రీమన్నారాయణుడు గజేంద్రుని ఆర్తిని
తొలగించడానికి, రక్షించడానికి ఈవిధంగా తరలివచ్చాడు.

"అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబుదా
పల మందారవనాంతరామృతసరః ప్రాంతేందుకాంతోపలో

త్పలపర్యంక రమావినోదియగు నాపన్న ప్రపన్నుండు వి
హ్వాల నాగేంద్రము పాహిపాహియన గుయ్యాలించి సంరంభియై.
సిరికింజెప్పడు శంఖచక్రయుగముం జేదోయి సంధింప డే
పరివారంబును జీర డభ్రగపతిం బన్నింప డాకర్ణి కాం
తరధమ్మిల్లము చక్కనొత్తడు వివాదప్రోత్థిత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడడు గజ ప్రాణావనోత్సాహియై.
తనవెంటన్ సిరి లచ్చివెంట నవరోధ వ్రాతమున్ దాని వె
న్కను పక్షీంద్రుడు వానిపొంతను ధనుఃకౌమోదకీ శంఖ చ
క్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండురా వచ్చిరో
య్యన వైకుంఠపురంబునంగలుగు వారాబాల గోపాలమున్"

చక్రి చక్రాన్ని ప్రయోగించి మకరాన్ని సంహరించి గజేంద్రుణ్ణి రక్షించాడు. బ్రహ్మోత్సవంలో శ్రీనివాసుడు పొందే గజవాహన సేవలో గజేంద్ర మోక్షకథ భక్తుల మానసవీధులలో కదలాడుతుంది. వారి దృష్టిపథాలలో గోచరిస్తుంది. సంసారం ఒక కాసారం. కర్మ మకరం. జీవుడు గజేంద్రుడు. జీవుని సంసారబంధం, కర్మబంధం, జననమరణబంధంనుండి విముక్తిని ప్రసాదించేవాడు శ్రీహరి ముకుందుడు. బ్రహ్మోత్సవం తిలకించే ప్రతిభక్తుడూ ఒకగజేంద్రుడు. గజేంద్రమోక్షం ప్రసాదించే కరుణాంతరంగుడు శ్రీనివాస ప్రభుడు. ఐశ్వర్యానికి పరాకాష్ఠ ఏనుగు. గజాంతైశ్వర్యం అని ఐశ్వర్యానికి ఇది కొలబద్ద. ఐహిక ఆముష్మిక ఐశ్వర్యం ప్రతిబింబింపచేసికొని, భక్తజనావళికి వానిని ప్రసాదించే విభూతి ప్రకాశ ప్రసాద మహోత్సవం [illegible]ారి గజవాహనోత్సవం

[illegible] ఛమోహి [illegible] హు [illegible] రక్షువీరం మహాబలం
గజేన మహతాయాంతం - రామం ఛత్రావృతాననం"

అని శ్రీ రామపట్టాభిషేక సమయంలో అయోధ్యా నగరమందలి పౌరులు కోరుకొన్నారు. వారి వాంఛితాన్ని అర్చామూర్తియై బ్రహ్మోత్సవంలో శ్రీనివాసుడు గజవాహనారూఢుడై పూరిస్తున్నాడా అన్న భావం కలుగుతుంది. ఆ దివ్యదృశ్యం చూచిన మనం శ్రీవారిలో గజారూఢులైన పట్టాభిరాముని దర్శించి అయోధ్యానగర పౌరులమై తరిస్తాము.

## గరుడోత్సవం

శ్రీవారికి బ్రహ్మోత్సవంలో ఐదవనాడు సర్వ శుభప్రదమైన గరుడోత్సవం జరుగుతుంది. ఇది రాత్రి సమయంలో జరుగుతుంది. "దాసః సఖా వాహన మాసనం ధ్వజోయస్తే వితానం వ్యజనం త్రయీమయః" అని గరుడుడు కీర్తింపబడ్డాడు. గరుడుడు శ్రీనివాసునకు పరమ దాసుడే కాదు; ప్రాణమిత్రుడుకూడ. శ్రీనివాస సర్వస్వం తెలిసిన సర్వజ్ఞుడు గరుత్మంతుడు.

"సువర్ణో సి గరుత్మాం స్త్రివృత్ తే శిరః గాయత్రం చక్షుః
స్తోమ ఆత్మాసామ తే తనూర్వామదేవ్యం బృహద్రథంతరే
పక్షౌ యజ్ఞా యజ్ఞియం పుచ్ఛం ఛందాగ్ం స్యంగానిధిష్ణియా
శఫాయజూంషినామ సువర్ణోసిగరుత్మాన్ దివంగచ్ఛసువఃపత."

శ్రుతి గరుత్మంతుడు వేదశరీరుడు, వేదస్వరూపుడు, వైదికములైన సామాదులకు ప్రతిరూపాలైన అంగప్రత్యంగాలు కలవాడని ప్రకటించింది. వేదాలకు రాశీభూతుడు గరుత్మంతుడు. వేదస్వరూపుడు గరుడుడు. శ్రుతిశిరస్సుపై ఉండే స్వామి శ్రీనివాసుడు. గరుడసేవలో మహర్షులు ప్రతిపాదించిన 'విష్ణుగరుడ' సమ్మేళనం వేదస్వరూపశోభాలుగా వ్యక్తమవుతుంది. 'అప్పాళ్ళిన్ పోన నెంజమే' అంటే 'ఆ గరుడుని తో వెన్నంటి వెళ్ళిపోయిన మనసా' అని ఆళ్వార్లు మనస్సును

సంబోధిస్తూ మురిసిపోయారు. పెరియాళ్వారు గరుడవాహనారూఢుడైన శ్రీవిష్ణుభగవానుని దర్శించి, పరవశించి పల్లాండు, తిరుపల్లాండుపాటలు పాడుకొన్నారు. 'వరదరాజు తురగ విహగరాజు' అన్నారు వేదాంత దేశికాచార్యులవారు. 'మాల్ గరుడవాహన నాయ్ త్తోన్ది' అనికూడ దేశికాచార్యులవారు అన్నారు. అంటే భగవానుడు గరుడవాహనంపై వచ్చి దర్శనమిస్తున్నాడని అర్థం. పోతరాజు విష్ణునివెంట గజేంద్ర మోక్ష ఘట్టంలో పక్షీంద్రుడు వచ్చినట్లు వర్ణించాడు. "ఖగరాజు నీ ఆనతి విని వేగచనలేదో, గగనానికి ఇలకు బహుదూరం బనినాడో, జగమేలేపరమాత్మా ఎవరితో మొరలిడుదు?" అని త్యాగరాజు ఖగ రాజు ప్రశంసకావించాడు. "గరుడగమనరార ననునీ కరుణనేలుకోరా" అంటూ గోపరాజు కీర్తించాడు. ఈవిధంగా రామభక్తి సామ్రాజ్య పాలకులైన పోతరాజు, త్యాగరాజు, గోపరాజుల మన్ననలు గరుడుడు పొందాడు. వేదనాదాలలో, దివ్యప్రబంధకీర్తనలలో, వాగ్గేయకారుల సంకీర్తనలలో ప్రశంసలు పొందాడు గరుడుడు. కవితానీరాజనాలూ అందుకొన్నాడు. శ్రీవారికి జరిగే ఉత్సవాలలో ముఖ్యమైనది బ్రహ్మో త్సవం. బ్రహ్మోత్సవానికి మకుటాయమానమైనది గరుడోత్సవం. ఈ గరుడోత్సవం మూలంగా వేంకటాచలం కలియుగవైకుంఠం అనే సార్థకనామం సంతరించుకొన్నది.

స్వామిమూలవిగ్రహానికి ఉండే లక్ష్మీహారం, మకరకంటి, సహస్రనామమాల నాటిరాత్రి గరుడోత్సవసమయంలో మాత్రం ఉత్సవమూర్తియైన శ్రీమలయప్పస్వామికి అలంకరిస్తారు. ఆసమయంలో మూలవిరాట్కు ఉత్సవమూర్తికి భేదంలేదన్నది సంప్రదాయవాక్యం. ఈసమయంలో శ్రీమలయప్పస్వామివారి దర్శనం శుభప్రదం. సౌఖ్య దాయకం. పరమపావనం. ఆనందసంధాయకం. అందుకే ఆనాడు లక్ష

లాది యాత్రికులు వేలాదిమంగళహారతులు స్వామివారికి అర్పించు కొంటారు. ఈరోజునే 'ఆండాళ్' కు అర్పించిన 'తోమాల' లను గరుడ వాహనంపై గల స్వామివారికి సమర్పిస్తారు. ఆనాడే మద్రాసు గొడు గుల ధర్మసంస్థవారు పాదయాత్రలోవచ్చి వేరువేరు కొలతలుగల నాలుగుజతల గొడుగులు గరుడవాహనసేవ పొందే మలయప్పస్వామికి కానుకలుగా అందిస్తారు. వాహనమండపంలో ఆంధ్రప్రదేశ్ ప్రభు త్వం గరుడసేవనాడు ఆంధ్రమహాజనులపక్షాన స్వామివారికి నూతన వస్త్రాలను సమర్పిస్తుంది. ఇవన్నీ గరుడసేవలోని దర్శనీయాలైన సన్ని వేశాలు. "నాభుజస్కంధాలపై నిలచి ముందుకుసాగే ఈమలయప్ప స్వామి జగత్కారణుడు. జగత్కల్యాణకారణుడు. భక్తజనవరదుడు, అభయప్రదుడు. ముక్తిప్రదుడు శరణాగతవత్సలుడు" అని శ్రుతి రూపుడైన గరుత్మంతుడు శ్రుతిప్రతిపాద్యుడైన శ్రీనివాసప్రభువుని గూర్చి ఎలుగెత్తి చాటుతూన్న భావనభక్తులకు గరుడసేవలో కలుగు తుంది.

"దాసవర్గములకెల్లా దరిదాపు మీరే కాన
వాసికి నెక్కించరాదా వసుధలో మమ్మును
ఆయితమై గరుడుండ! అట్టేమీరుం చేయరాదా
యేయెడ విన్నపము మాకేమివలసినాను"

అని అన్నమయ్య, తనకోసం, మనకోసం గరుడుని స్వామికి విన్నపం చేయుమని విన్నవిస్తున్నాడు. ఇది శ్రీవారిగరుడవాహన సేవా వైభవం. ఇదే గరుడోత్సవ వైభవం.

## రథోత్సవం

శ్రీవారి బ్రహ్మోత్సవంలో ఎనిమిదవనాటి ఉదయాన రథో త్సవం జరుగుతుంది. అశేషంగా భక్తజనులు ఈ రథయాత్రావిశేషం

చూడడానికి వస్తారు. శ్రీవారి రథపుపగ్గాలు పట్టుకొని అందరూ 'గోవిందా' అంటూ లాగుతారు. శ్రీవారి రథయాత్రలో శ్రీవారికి సేవలు చేయడానికి సర్వులకూ సమానమైన భాగస్వామ్యం, ప్రాతినిధ్యం లభిస్తుంది. "రథస్థం కేశవం దృష్ట్వా - పునర్జన్మ నవిందతి" అని ప్రమాణం మనశరీరమే రథం. శరీరమనేరథంలో అంతర్యామి ఉన్నాడు. ఆ అంతర్యామి ఆత్మసాక్షియై, కర్మసాక్షియై, సర్వసాక్షియై, ప్రధానఫలభోక్తయై, శరీరరథసారథియై, జీవరథాన్ని ధర్మపథంలో నడిపిస్తాడు. "ఆత్మానం రథినంవిద్ధి - మనఃప్రగ్రహ ఏవచ" అని కఠోపనిషత్తు కంఠోక్తిగా పలికింది.

"సహస్ర శీర్షాపురుషః", "సహస్ర శీర్షం దేవం," "అనేక బాహూదరవక్త్రనేత్రం" అనే ప్రమాణవాక్యాలను నిరూపిస్తూ అనంతరూపియై, విశ్వస్వరూపియై శ్రీనివాసుడు రథంలో గోచరిస్తాడు. స్వామివారి రథం ఈ సువిశాలవిశ్వంగా కనపడుతుంది. ఈ విశ్వరథాన్ని నడిపిస్తూన్న సనాతనసారథిగా శ్రీనివాసుడు రథయాత్రలో సాక్షాత్కరిస్తాడు. ఈ అపూర్వమైన విశ్వరూపం బ్రహ్మాది దేవతలకు సహితం దుర్లభమైనది. బ్రహ్మోత్సవ రథయాత్రలోని శ్రీనివాసుని విశ్వరూపసందర్శనభాగ్యంవలన భయ, విస్మయ, సందేహాలు తొలగిపోతాయి. ఆ రథయాత్రలో పాల్గొన్న ప్రతిభక్తునకు ఆత్మానుభూతి, ఆత్మశాంతి, ఆత్మానందం, ఆత్మసాక్షాత్కారం సిద్ధిస్తాయి. "సుదుర్దర్శ మిదం రూపం దృష్టవానసియన్మమ, దేవా అప్యస్యరూపస్య నిత్యం దర్శన కాంక్షిణః", "అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేనచ ప్రవ్యథితం మనోమే" అనే మధురభావపరంపరలు శ్రీనివాసుని రథయాత్రలోని యాత్రికుల మనస్సులలో కలుగుతాయి. ఈవిధంగా శ్రీనివాసుడు భక్తుని ఆత్మరథంలో, జీవుని శరీరరథంలో, విశ్వరథంలో రథయాత్ర సాగిస్తాడు. బ్రహ్మరథంలోను, పార్థునిరథంలోను యాత్ర

సాగించి వారి మనోరథాలను పూరించినట్లుగానే బ్రహ్మోత్సవ రథ యాత్రలోని భక్తుల మనోరథాలను శ్రీనివాసుడు ఫలప్రదం చేస్తాడు.

"కొండంత పొడవుతోడ కోనేటిరాయుడు వీడే
నిండుకొని రథమెక్కి నిలుచున్నవాడు
పాతాళవాసులైన బలురక్కసులు మీద
యేతులం బరపెం దేరు యిదె దేవుడు
ఆతల జలధి చొచ్చినట్టి దానవులమీద
ఘాతతోడం దోలెనదె కడుగభసమున
ఆకాశము దూరినట్టి యదటు దైత్యుల మీద
దాకతో నడపించెం బంతాన దేవుడు
దీకొని యష్టదిక్కులం దిరిగి యసురులపై
భీకరముగా మోగించి బిరుదులు మెరసి
ధరమీద కలిగిన దనుజకోట్ల నెల్ల
సొరిది శ్రీ వేంకటేశుడు పారదోలెను
గరిమ నలమేల్మంగ నురమునం బెట్టుకొని
తిరము కొలిపె తేరు దిక్కులెల్ల గెలిచి
కొండంత పొడవుతోడ కోనేటిరాయుడు వీడే
నిండుకొని రథమెక్కి నిలుచున్నవాడు"

— అన్నమయ్య ఆధ్యాత్మిక సంకీర్తన

శ్రీవారికి ఈవిధమైన వివిధవాహనసేవలు బ్రహ్మదేవుని చేత పౌరాణికకాలంలో నిర్వహింపబడ్డాయి. చారిత్రకకాలంలో మహారాజులు ఈ సేవలు జరిపించారు. వానిని నేటికీ అవిచ్ఛిన్నంగా బ్రహ్మోత్సవసమయంలో తిరుమల తిరుపతిదేవస్థానంవారు కాపిస్తున్నారు. క్రీ. శ. 1583 నాటి శాసనం ఈ ఉత్సవవేడుకలలో టపాసులు పేల్చే ఆచారం ఉన్నట్టు తెలిపింది. ఆ సంప్రదాయం నేటికీ కొనసాగు

తోంది. ఈవిధమైన వివిధ వాహన సేవావైభవాలు శ్రీవారి బ్రహ్మోత్సవంలో ప్రసరిస్తాయి.

## నేటి బ్రహ్మోత్సవపు తీరుతెన్నులు

### అంకురార్పణం

నేడు దేవస్థానంవారు ప్రతిసంవత్సరం ఆశ్వయుజమాసంలో శ్రీవారికి బ్రహ్మోత్సవం నిర్వహిస్తున్నారు. అధికమాసం వచ్చినప్పుడు భాద్రపదమాసంలో బ్రహ్మోత్సవం, ఆశ్వయుజమాసంలో నవరాత్రి జరిపిస్తున్నారు. ప్రతిసంవత్సరం ఆశ్వయుజశుద్ధపాడ్యమినాడు స్వామివారి బ్రహ్మోత్సవానికి అంకురార్పణ జరుగుతుంది. ఆనాటి సాయంకాలంలో వైకుంఠసేనాధిపతియైన విష్వక్సేనుని స్వామివారి ఆనందనిలయానికి ప్రదక్షిణం చేయిస్తారు. పిమ్మట తిరుమల తిరువీధులలో సేనాధిపతికి ఊరేగింపు జరుగుతుంది. శ్రీవారి ఆలయ కల్యాణమండపంలోని యాగశాలకు ఊరేగిన సేనాధిపతి వస్తాడు. పిమ్మట సేనాధిపతికి తిరుమలరాయమండపంలోని ఆస్థానమండపంలో సన్మానం జరుగుతుంది. ఈవిధంగా సేనాపతి విష్వక్సేనుడు శ్రీవారి బ్రహ్మోత్సవానికి వలసిన కట్టుదిట్టాలు చేస్తాడు. అంగరంగ భోగాలతో శ్రీవారికి జరిగే బ్రహ్మోత్సవానికి రావలసిందని చతుర్దశభువనాలలోని ముక్కోటిదేవతలకు ఆహ్వానాలు అందిస్తాడు. దీనికి సేనాధిపతి ఉత్సవం అంటారు. ఈ కార్యక్రమం అంకురార్పణనాడు జరుగుతుంది. పాలికలలో నవధాన్యాలను విత్తుతారు. యాగశాలలో పూర్ణకుంభాన్ని కూడ నిలుపుతారు. ఇవి అంకురార్పణలో జరిగే ముఖ్యాంశాలు.

### ధ్వజారోహణం

బ్రహ్మోత్సవంలో పేర్కొనదగిన ప్రధానమైన ఘట్టం ధ్వజారోహణం. ఆశ్వయుజమాసంలో శుక్లపక్షంలో శ్రీవారి జన్మనక్షత్రమైన శ్రవణం నక్షత్రమునకు అవభృథం (చక్రస్నానం) సంకల్పించి

దానికి తొమ్మిదిరోజులు ముందుగా ధ్వజావిష్కరణం జరుపుతారు. తమిళనాడులోని దేవాలయాలలో ఉదయమే ధ్వజారోహణం జరుగుతుంది. ఆంధ్ర దేశంలో ధ్వజావిష్కరణం సాయంసమయంలో చేయడం ఆచారం. తిరుమలలో ఈతంతు సాయంత్రం జరుగుతుంది. బంగారు తిరుచ్చిలో వజ్రకవచాద్యాభరణాలు ధరించిన మలయప్పస్వామి శ్రీ భూదేవులతో వీధిభ్రమణోత్సవానికి బయలుదేరుతారు. నూలైన వస్త్రంపైన గరుడాకృతి చిత్రింపబడుతుంది. దాన్ని గరుడపటం, లేక గరుడపతాకం అంటారు. అది ధ్వజస్తంభంవద్ద సిద్ధంగా ఉంటుంది. భేరీతాడనపూర్వంగా లోకాంతరాలనుండి వచ్చిన దేవతలకు 'నవసంధి' అనే దేవతాహ్వానం, దేవతాబలి కార్యక్రమాలు యథావిధిగా జరుగుతాయి. స్వామివారు ఊరేగి ధ్వజస్తంభంవద్దగల మండపానికి వేంచేస్తారు. అర్చకస్వాములు గరుడపతాకాన్ని పూజించి ఆశుభసమయంలో మంగళవాద్యనాదాల, వేదఘోషలమధ్య ధ్వజస్తంభంపైన ఆవిష్కరిస్తారు. ఇదే స్వామివారి బ్రహ్మోత్సవ ధ్వజారోహణ మహోత్సవం. ఉత్సవం, పరిసమాప్తి అయ్యేవరకు గరుడపతాకం వినువీధిలో ఎగురుతూంటుంది. వర్షాతపాలకు లోనైనా దీనికి సంప్రోక్షణ అవసరంలేదు. పిమ్మట స్వామివారికి తిరుమలరాయమండపంలో ఆస్థానం జరుగుతుంది; ఈసమయంలో స్వామికి నివేదింపబడే ముద్గాన్నప్రసాదం వంధ్యాస్త్రీలు స్వీకరిస్తే వారు దీర్ఘాయుస్సు కలిగిన సత్సంతానం పొందుతారన్నది శాస్త్రవాక్యం. ఇట్టి ఉత్సాహభరితమైన వాతావరణంలో శ్రీవారి బ్రహ్మోత్సవధ్వజారోహణ కార్యక్రమం సాగిపోతుంది.

## వాహనసేవలు

ధ్వజారోహణం జరిగిననాటిరాత్రి స్వామివారికి పెద్దశేషవాహనంపైన ఊరేగింపు జరుగుతుంది. రెండవనాడు ఉదయం చిన్నశేష

వాహనంపైన, రాత్రి హంసవాహనంపైన, మూడవరోజున ఉదయం సింహవాహనంపైన, రాత్రి ముత్యపుపందిరి వాహనంపైన నాల్గవ రోజున ఉదయం కల్పవృక్షవాహనంపైన, రాత్రి సర్వభూపాలవాహనం పైన, ఐదవరోజుఉదయం మోహినీ అవతారంతో పల్లకీపైన, రాత్రి మకరకంఠి శ్రీ మహాలక్ష్మీహారాద్యాభరణాలంకారాలతో గరుడ వాహనంపైన, ఆరవరోజున ఉదయం హనుమద్వాహనంపైన, రాత్రి గజవాహనంపైన, ఏడవనాడు ఉదయం సూర్య ప్రభవాహనంపైన, రాత్రి చంద్ర ప్రభవాహనంపైన, ఎనిమిదవ రోజున ఉదయం రథం పైన, రాత్రి అశ్వవాహనంపైన, తొమ్మిదవరోజు ఉదయం పల్లకీలోను శ్రీవారికి ఊరేగింపులు, వాహనసేవలు అపూర్వంగాను, నయనానంద కరంగాను జరుగుతాయి. బ్రహ్మరథం, గజద్వయం, వేదపారాయణం కావించే విప్రసమూహం, ఆచార్యసంఘం, మంగళవాద్య బృందం ముందు సాగుతూంటే భక్తులు సమర్పించే కర్పూరహారతులు స్వీక రిస్తూ, వారిని అనుగ్రహిస్తూ శ్రీవారు వివిధవాహనసేవలు అందు కుంటారు. తొమ్మిదవనాడు ఉదయం పల్లకీఉత్సవంజరిగినవెంటనే అవ భృథోత్సవం జరుగుతుంది. స్వామివారు స్వామిపుష్కరిణికి వస్తారు. చక్రస్నానం జరుగుతుంది. భక్తులు స్నానం చేస్తారు. ఈఅవభృథోత్స వానికే తీర్థవారి, చక్రస్నానం అని నామాంతరాలు. రాత్రి ధ్వజావరోహణంతో బ్రహ్మోత్సవం పరిసమాప్త మవుతుంది.

## ఊంజల్ సేవ

బ్రహ్మోత్సవసమయంలో నిత్యం రాత్రి వాహనసేవలకుముందు అద్దాలతో నిర్మించబడిన డోలామండపంలో శ్రీదేవీ భూదేవీ సమేతులైన మలయప్పస్వామికి అపూర్వమైన పుష్పాలంకారాలతో ఒప్పారుతుంది. రంగురంగుల విద్యుత్ కాంతులతో ఒకపరికొకపరి వయ్యారంగా శ్రీవారు ఉయ్యాల లూగుతారు. కౌసల్యారాముడై

స్వామిడోలలూగుతాడు. యశోదాతనయుడై, బాలగోపాలుడై సాంగ నుగా డోలోత్సవం అందుకుంటాడు. ఆ ఊంజల్ సేవ చూసే ప్రతి భక్తుడు పరవశంతో, ఆనందపరవశంతో కౌసల్యగా, యశోదగా భావించుకొని స్వామికి తామే ఉయ్యాలసేవకావిస్తూనట్లు తన్మయు లవుతారు. ఆ దివ్యదృశ్యం తిలకించే భక్తులు తమ మనోమందిరాలే డోలామందిరాలైనట్లు భావిస్తారు. తమ మనస్సునే ఉయ్యాల చేసికొని స్వామి క్రీడిస్తూ, విహరిస్తున్నాడని పట్టలేని సంతోషంతో పొంగి పోతారు. అందుచేతనే ఈ బ్రహ్మోత్సవాలను తిలకించాలని భక్తులు నేల నాలుగు చెరగులనుండి తండోపతండాలుగా తిరుమల యాత్రకు తరలి వస్తారు.

## బ్రహ్మోత్సవ సేవాఫలము

బ్రహ్మోత్సవసమయంలో నిర్వహింపబడే వైదిక ప్రక్రియలో, మంత్రపఠనంలో ఆ ఉత్సవ పరిసమాప్తి పర్యంతం పరబ్రహ్మకు (శ్రీని వాస పరబ్రహ్మకు) దేవతలు, దిక్పాలురు, ఇంద్రాదులు సన్నిధాన వర్తులై సేవిస్తూనట్లు వ్యక్తమవుతుంది.

"త్వయా దృష్ట స్తుష్టిం భజతి పరమేష్ఠీ నిజపదే
వహన్ మూర్తీ రష్టా విహరతి మృడానీ పరివృఢః
బిభర్తి స్వారాజ్యం వృషశిఖరి శృంగారి కరుణే
సునాసీరో దేవాసుర సమరనాసీర సుభటః"

"తత్రారూఢైర్మహతి మనుజైః స్వర్గభిశ్చావతీర్ణైః
సత్యోన్మేషాద్ వ్యపగత మిథ స్తారతమ్యాది భేదైః

— వేదాంత దేశికులు

"వృషశైలంపై నగల అందరాని కారుణ్యమా! నీ కారుణ్య దృక్కులతో పరమేష్ఠి తుష్టి పొందుతున్నాడు. శివుడు అష్టమూర్తియై

విహరిస్తున్నాడు. దేవాసుర యుద్ధంలో ఇంద్రుడు విజయశ్రీ సము పేతుడై స్వర్గాన్ని పాలిస్తున్నాడు."

"క్రిందనుండి మెట్లు ఎక్కి కొండపైకి వచ్చే జనులతోను, దివి నుండి కొండకు దిగివచ్చిన దేవతలతోనుకూడిన మహాగిరి వృషగిరి" అని వేదాంత దేశికాచార్యులవారు ప్రకటించారు. వారి ప్రశంసలో బ్రహ్మోత్సవం పొందే స్వామివారి దయామహిమ— దేవతల సేవా భావం వ్యక్తమవుతున్నాయి.

"నాకు బ్రహ్మోత్సవంచేసినవారికి ఇహపరాలు సిద్ధిస్తాయి. ఈ ఉత్సవానికి సేవింపవచ్చేవారికి వైకుంఠం సమీపమవుతుంది. సిరిసంప దలు అప్రియత్నంగా లభిస్తాయి. ఈఉత్సవసమయంలో నన్ను సేవించే వారికి రాజలాంఛనాలు ప్రాప్తిస్తాయి. అన్నదానం చేసినవారికి, వికలాంగులను ఆదరించినవారికి నా అనుగ్రహం లభిస్తుంది. బ్రహ్మో త్సవ అవభృథస్నానం చేసినవారికి జన్మజన్మలపాపాలు హరిస్తాయి." అని శ్రీనివాసుడు బ్రహ్మోత్సవసేవాఫలం ప్రకటించాడు. ఇట్టి అను రూపమైన ఫలితం బ్రహ్మోత్సవంవలన లభిస్తుందని వరాహపురాణం నిర్దేశిస్తోంది. అందుచేతనే శ్రీవారు తనకు నిత్యం జరిగే సహస్రనామ పూజాసమయంలో 'ఓం బ్రహ్మోత్సవ మహోత్సుకాయ నమః' అనే నామంతోను, శ్రీవేంకటేశాష్టోత్తర శతనామ పూజాసమయంలో 'ఓం బ్రహ్మాత్సవాయ శ్రీవేంకటేశాయనమః' అనే నామంతో స్మరింపబడి పూజింపబడుతున్నారు.

"వీథుల వీథుల విభు డేగీ నిదె
మోదము తోడుత మొక్కరో జనులు

గరుడధ్వజ మదె కనకరథం బదె
అరదముపై హరి యులవాడె

ఇరుదెసల నున్నారు యిందిరయు భువియు
పరగ పగ్గములు పట్టరో జనులు
ఆడేర దివ్యాప్సర లెల్లను
పాడేరు గంధర్వ పతులెల్లా
వేడుకతో వీడె విష్వక్సేనుడు
కూడి యిందరును చూడరో జనులు

శ్రీ వేంకటపతి శిఖరము చాయదె
భావింప బహు వైభవములవే
గోవింద నామపు ఘోషణ లిడుచును
దైవం బితడని తలచరో జనులు."

— అన్నమయ్య ఆధ్యాత్మిక సంకీర్తన.



# కవితానీరాజనం

"పావనముగావో జిహ్వా, బ్రతుకవో జీవుడా
వేవేల కితని నింక, వేమారునుం పాడి

హరినామములే పాడి, అతనిపట్టపురాణి
ఇజవై మించినయట్టి, యిందిర, పాడి
సరస నిరువంకలాను, శంఖచక్రములు, పాడి
వరద కటిహస్తాలు, వరుసతో పాడి
ఆదిపురుషుని పాడి, అట్టె భూమిసతి పాడి
పాదముల పాడి, నాభిపద్మము పాడి
మోదపుబ్రహ్మాండాలు, మోచే, ఉదరముపాడి
ఆదరాన కంబుకంఠము, అంకెతో పాడి
శ్రీవేంకటేశు పాడి, శిరసి, తులసిం, పాడి
శ్రీవత్సముతోడు, ఉరము, జెలగిపాడి
లావుల మకరకుండలాల, కర్ణములు, పాడి
ఆవటించి, యితని, సర్వాంగములు, పాడి

పావనముగావో, జిహ్వా, బ్రతుకవో జీవుడా
వేవేలకితని నింక, వేమారునుం పాడి."

— అన్నమయ్య సంకీర్తనం.

**పావనముగావో జిహ్వా!**

శ్రీనివాసుడు భక్తుల నీరాజనాలు, సాహితీపరుల కవితా నీరాజనాలు అందుకొనే పరమపురుషుడు. ఆవిరాట్పురుషునిపై కవితా గానం చేసి పావనముగావో జిహ్వా అన్నాడు పదకవితాసార్వభౌము డైన ఆది వాగ్గేయకారుడైన అన్నమాచార్యుడు. పురుషసూక్త మంత్రియుక్తంగా 'వేదాహమేతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణం తమసస్తుపారే సర్వాణి రూపాణి విచింత్యధీరః నామానికృత్వాఽభివద

న్యదాస్తే" అనిపురుషోత్తమునకు ఆనందకర్పూర నీరాజనంఅర్పిస్తాము. శ్రీవేంకటాద్రిని, శ్రీవేంకటాద్రినాథుని కవులు తమరచనలలో ప్రస్తుతించారు. సాహితీప్రపంచం శ్రీనివాససాహిత్యంతో, శ్రీనివాస సాహితీవైభవంతో అలరారుతోంది.

"అరాయి కాణె వికటేగిరిం గచ్ఛ సదాన్వే శిరింబిఠస్య సత్వభిస్తేభిష్టాశ్చాతయామసి" అని ఋగ్వేదమంత్రం వేంకటాచలాన్ని, వేంకటాచలపతిని వర్ణించింది. కీర్తించింది. ఉపనిషత్తులలో పారమాత్మ్యోపనిషత్తు ఈకొండను, ఈస్వామిని ఎలుగెత్తి చాటింది. వ్యాసభగవానుడు తాను సంతరించిన పురాణేతిహాసాలలో శ్రీనివాసగిరి ప్రాభవాన్ని, శ్రీనివాసవైభవాన్ని ప్రసరింపజేసాడు.

## తమిళసాహిత్య సమారాధనము

శ్రీనివాస సమారాధనంతో తమిళవాఙ్మయం శ్రీకారం చుట్టుకొంది. 'తొల్కాప్పియం' తమిళుల భాషాలక్షణ గ్రంథం. దీన్ని వారి తొలిభాషాగ్రంథమనవచ్చును. 'తొల్కాప్పియం' వేంకటాచలాన్ని 'వేంగడం' అని పేర్కొంది. 'వేంగడం' తమిళ, వడుగు దేశాల సరిహద్దు ప్రాంతంలోని అరణ్యప్రదేశం. ధన, విజయకాంక్షలతో ఆప్రాంతానికి వేళ్ళే తమిళవీరుల భార్యలు హృదయవేదనకు లోనౌతారు" అని 'తొల్కాప్పియం' వేంగడంగూర్చి హెచ్చరించింది. ఈగ్రంథం క్రీ.పూ. 2వ శతాబ్దానికి చెందినదిగా భావింపబడుతోంది. తమిళుల తొలిగ్రంథం 'తొల్కాప్పియం' వేంగడాన్ని ఈవిధంగా వర్ణించింది.

తమిళపురాణకావ్యాలలో 'శిలప్పదికారం' ఒక సుప్రసిద్ధ కావ్యం. "ఇరువంకలా జలపాతాలతో ఒప్పారే కొండ. సూర్యచంద్రులు తమకిరణాలతో ప్రకాశింపజేసే కొండ, ఆపర్వతశిఖరంపైనిలచిన స్వామి– శంఖుచక్రాలు ధరించినస్వామి! వనమాలాధరుడు.

పద్మాలువంటి హస్తాలుకలిగి, పీతాంబరధారుడై, నీలమేఘశ్యాముడై హరివిల్లులోని అందాలు, సౌదామనిలోని కాంతులు వెదజల్లుతాడు" అంటూ 'శిలప్పదికారం' శ్రీవేంకటాచలానికి, శ్రీవేంకటాచలపతికి నివాళులు అర్పించింది. ఈ తమిళకావ్యం క్రీ. శ. 2వ శతాబ్దంనాటిదని కొందరు, 8వ శతాబ్దంనాటిదని మరికొందరు వాదిస్తారు. వాదనలు ఎలాఉన్నా శ్రీవేంకటేశ్వరవర్ణనతో అది అమరకావ్యమైంది. తిరుపతి ప్రాచుర్యాన్ని, శ్రీపతి ప్రాముఖ్యాన్ని విశేషంగా కీర్తించిన ప్రముఖ తమిళపురాణకావ్యం 'శిలప్పదికారం'. తమిళసాహిత్య చరిత్రలో 'సంగమసాహిత్యం' ప్రత్యేకప్రశస్తి పొందింది. ప్రాచీన తమిళసంఘం కవులలో కల్లాదనార్, నక్కీరార్, శణకాయనార్, తాయంగణ్ణన్, కణ్ణన్, మామూలనార్ ప్రభృతులు ప్రధానులు. ప్రాచీనతమిళసంగం సాహిత్యం 'వేంగడాన్ని' ఏదోరూపంలో కీర్తించింది, మామూలనార్ తమిళసంగం కవి సంతరించిన సుప్రసిద్ధ తమిళ కావ్యం 'అహనానూర్'. ఆకావ్యం శ్రీవారి దివ్యక్షేత్రమైన తిరుమలను, దానిలోజరిగే ఉత్సవ వైభవ శ్రీని విపులంగా వర్ణించింది. పన్నిద్దరాళ్వారులు తమ 'ద్రావిడ దివ్యప్రబంధము' లో శ్రీవేంకటగిరిని, శ్రీవేంకటగిరినాథుని భక్త్యావేశంతో, కవితావేశంతో కీర్తించారు. ఈవిధంగా క్రీ. శ. 8వ శతాబ్దం వరకుగల 'తొల్కాప్పియం', 'శిలప్పదికారం' 'సంఘం సాహిత్యం' ద్రావిడ దివ్యప్రబంధం' శ్రీనివాససాహిత్య సమారాధనం కావించాయి. క్రీ. శ. 12 వ శతాబ్దంనాటి కంబరామాయణం వేంగడపు (వేంకటాచలపు) పవిత్రతను అభివర్ణించింది. కిష్కింధకాండలో సుగ్రీవుడు సీతాన్వేషణకు బయలుదేరిన హనుమంతునితో ఈవిధంగా వివరించాడు. "నాలుగు వేదాలలోని సత్యం నెలకొన్న కొండ వేంకటపు కొండ. పవిత్రమైన నదులతో, పరమపావనమైన ఋష్యాశ్రమాలతో అనంతసత్యరూపంగా శ్రీవేంకటాద్రి రూపొందింది.

పరస్పర శత్రుభావంతో ప్రవర్తించే ప్రాణికోటి ఆకొండపైన సహజ సహజీవనం సాగిస్తుంది. ఆకొండను, ఆకొండపై ఋషులను సేవిస్తే, ఆయాత్రా విశేషంవల్ల సీతాన్వేషణయాత్ర విజయవంత మవుతుంది." ఈవిధంగా కంబరామాయణం శ్రీ వేంకటాచలపు పవిత్ర తనను వినుతించింది. రమణీయంగా శ్రీవేంకటరమణునికొండను అభి వర్ణించి పాఠకజనుల మనోనేత్రాలముందు సాక్షాత్కరింప జేసింది.

## సంస్కృత సాహిత్య నీరాజనం

"సప్తగిరినాథుడు భక్తజనసులభుడు. వైకుంఠంపై విరక్తి కల్పించుకొని వేంకటాచలంపై అనురక్తి పెంచుకొని శ్రీనివాసుడు రమయారమమాణుడై శ్రీస్వామి పుష్కరిణీతీరంలో విహరిస్తున్నాడు. భక్తులను ఆదుకొని అలరిస్తున్నాడు.సృష్టి, స్థితి, లయకారకుడు శ్రీవేంక టేశ్వరుడు. వేదాలు పతిపాదించే పరమార్థానికి ప్రాతినిధ్యం వహించే పరమాత్ముడు శ్రీవేంకటరమణుడు. కుచేలుని అటుకులుతిని సర్వసంప దలు అనుగ్రహించిన శ్రీకృష్ణ పరమాత్ముడితడు. భక్తులు సమర్పించే చిన్నకానుకలు స్వీకరించి వారికి పెద్ద బహుమానాలు అనుగ్రహించే కలియుగేశ్వరుడు శ్రీవేంకటేశ్వరుడు. చెవిటివారికి వినికిడి, గ్రుడ్డివారికి దృష్టి, మూగవారికి మాట, ఈస్వామి అనుగ్రహిస్తాడు. అవిటివారికి తన కొండ ఎక్కే శక్తినిస్తాడు." అని వేంకటాధ్వరికవి 17 వ శతా బ్దంలో తన సంస్కృతచంపూకావ్యం 'విశ్వగుణాదర్శంలో' తిరుమ లేశ్వరునకు కవితానీరాజనం అర్పించాడు. బదరీనుండి సేతువువరకూ ఇద్దరుగంధర్వులు సుందర భారతయాత్ర కావిస్తారు, ఈసుందర భారత యాత్రలో అతిలోకమనోహరమైన తిరుమలను సేవిస్తారు. దివ్యసుందర మూర్తియైనశ్రీనివాసమూర్తిని దర్శిస్తారు. విశ్వావసు అనే గంధ

ర్యుడు శ్రీవారిమహిమను, భక్తజన రక్షాదీక్షను వర్ణిస్తాడు. ఆవర్ణనను మనకు 'విశ్వగుణా దర్శం' అందించి నేత్రానందం, శ్రవణానందం కలిగిస్తోంది. విశ్వవిభుడు, విశ్వరూపుడైన శ్రీ వేంకటేశ్వరుని 'విశ్వ గుణాదర్శం' వినుతించింది. సన్నుతించింది.



# శ్రీవేంకటేశ్వరాంధ్ర సాహిత్యం

కవిత్రయంలోని శంభుదాసుడు, ప్రబంధపరమేశ్వరుడైన ఎఱ్ఱా ప్రగడ తన 'నృసింహపురాణం'లో గాలవమహర్షి సేవించిన తీర్థయాత్రా క్రమం వర్ణిస్తూ 'వేంకటాచలం' ఒక పుణ్యక్షేత్రమని పేర్కొన్నాడు. 'వేంకటాచలాన్ని' వేంకటాచలపతిని పేర్కొన్న తెలుగుకవులలో ఎఱ్ఱయ్య తొలికవి. ఆతని 'నృసింహపురాణం' తొలితెలుగు గ్రంథం.

ఎఱ్ఱాప్రగ్గడతో ప్రారంభమైన శ్రీవేంకటేశ్వరాంధ్ర సాహిత్యం శ్రీస్వామివారికి అంకితం కావింపబడిన రచనలతో, శ్రీవారిని స్తుతించే ప్రాచీనకృతులతో, శ్రీవేంకటేశ్వరమాహాత్మ్య కథాప్రబంధాలతో, శ్రీ తాళ్ళపాకవారి రచనలతో వికాసం పొందింది. ఆంధ్రసాహిత్య నందనంలో శ్రీనివాససాహిత్య పారిజాతం పరిమళాన్ని ప్రసరిస్తోంది.

శ్రీపాదానికి అంకితమైన ఆముక్తమాల్యద

"శ్రీమదికిం బ్రియంబెసగఁ జేర్చినయుయ్యెలలీల వైజయం
తీమిళితాచ్ఛకౌస్తుభము నిద్దపుఁగాంతి దనర్చియాత్మవ
క్షోమణి వేదిపొల్పెసగఁ జూడ్కులపండువు సేయు వేంకట
స్వామి కృతార్థుఁజేయు నరసక్షితినాథుని కృష్ణరాయనిన్"

"వేంకటగిరివల్లభ
సేవాపరతంత్ర హృదయ! చిన్నమదేవీ
జీవితనాయక! కవితా
ప్రావీణ్యఫణీశ! కృష్ణరాయమహీశా!

— ముక్కుతిమ్మన

శ్రీకృష్ణదేవరాయలు 'శ్రీవేంకటగిరివల్లభ సేవాపరతంత్ర హృదయుడు. అర్థితార్థప్రదుడైన శ్రీవేంకటస్వామి చూడ్కులపండు వుకు పాత్రుడై కృతార్థుడైనవాడు. ఏడుకొండలవాణ్ని యేడుసార్లు

సము వేంకటపతి రచించిన 'లక్ష్మీ విలాసమనే' ప్రబంధాన్ని తనకు అంకితం కావింపమని ఆదేశించాడు. కర్ణాటక రాజ్య ప్రభువైన శ్రీ రంగరాయలు చంద్రగిరిని పాలిస్తూన్న కాలంలో సకలాధిపత్య నిర్వాహకుడుగా రాయసం వేంకటపతి ఉండేవారు. శ్రీవారి ఆదేశాన్ని శిరసావహించి వేంకటపతి శ్రీవేంకటాచలపతికి తన 'లక్ష్మీవిలాస' ప్రబంధాన్ని అంకితం కావించాడు.

"తను సేవించు జనాళికిం గరుణ నిద్ధాత్రిన్ మనోవాంఛ లె
ల్లను బూరింతు నటంచు లోకులకు నెల్లం దెల్ప ప్రత్యక్షమై
జనసంఘంబుల నిందురమ్మనుచు నోజం బిల్చునట్లాశ్రితా
వనహస్తాబ్జము జూపు వెంకట నగస్వామిం ప్రశంసించెదన్."

ఈవిధంగా వేంకటపతి కవి వేంకటనగ స్వామికి కవితానీరాజనం సమర్పించాడు. 16 వ శతాబ్దంలో ఎట్టిన 'సకలనీతి కథావిధానము', వేంకటపతి 'లక్ష్మీవిలాసము' ఆవిర్భవించాయి. శ్రీవారికి అంకితం కావింపబడ్డాయి. లక్ష్మీపతియైన శ్రీవేంకటాచలపతి వేంకటపతి 'లక్ష్మీ విలాసా'నికి తనకు తానుగా కోరి కృతిభర్త అయ్యాడు. ఆ విధంగా లక్ష్మీపతి 'లక్ష్మీవిలాస'పతి అయ్యాడు.

**రాజవాహనవిజయము - వాణీవిలాసము**

"కొడుకు మన్మథుఁ డాడుపడుచు భాగీరథి
యిల్లాలు భూకాంత యిల్లు కొండ
యన్నదాబలభద్రు డగ్రసూనుడు బ్రహ్మ
కోడలు శారద కొలములోన
మఱది కల్వలరేఁడు మామ సముద్రుండు
మఱియును రెండవమామ భోజుఁ
డలర పేరెదసొమ్ము వెలలేని మాణిక్య
మచ్చబంగారు మైపచ్చడంబు

నన్న వెచ్చంబు ముక్కంటికెన్న నరిది
జగము లీరేడు గర్భవాసమున నిముడు
సిరి మొడయఁ డెంత సంసారి శేషశైల
వల్లభునివంటిదాత దైవంబుగలఁడె."

అని కాకమానిమూర్తికవి శేషశైలవల్లభుని స్తుతించాడు.

"అప్పప్ప చూడవలదా
యప్పనికోవెల పటీరహైమజలంబుల్
కప్పురము పునుగు మృగమద
మెప్పట్టున తావిగల్గు భృగుదివసమునన్."

అంటూ శ్రీవారి శుక్రవార అభిషేకాన్ని మూర్తికవి అభివర్ణించాడు.

"బ్రహ్మతిరునాళ్ళ కరుదెంచి ఫలముగాంచు కటక కళ్యాణ ఢిల్లీని కటజనంబు" అంటూ స్వామివారి బ్రహ్మోత్సవశోభను సాక్షాత్కరింపజేసాడు.

"వేంకటేశ విశాఖతీర్థనిరీక్ష కరుగు
దెంచు నాసేతు కాశీతైర్థికజనంబు"

అంటూ వేంకటాచలాన్ని, వేంకటాచలపతిని సేవించడానికి ఆ సేతు హిమాచలంనుండి తరలివచ్చే తైర్థికజనాన్నిగూర్చి 'రాజవాహనవిజయము'లో మూర్తికవి వివరించాడు. అడిగినన్ని వరాలిడు కొండమీఁది తిమ్మప్పవంటి గావ్యపతి యబ్బుట యబ్బుర మిబ్బుధాళికిన్' అని ఆ ఏడుకొండలవానికి తన 'రాజవాహనవిజయము' కాకమానిమూర్తికవి అంకితంకావించి ధన్యుడయ్యాడు. పేకునుళ్ళ రంగశాయికవి, మూర్తికవి 17వ శతాబ్దానికి చెందిన కవులు. రంగశాయికవి తన 'వాణీవిలాసము' శ్రీవేంకటేశ్వరునకు అంకితం కావించాడు. వాణీవిలాసము

సర్వవిషయసంగ్రహం. అదొక సకలవిషయ సంగ్రహాసర్వస్వం. ఉషః కాలాన రంగశాయికవికి స్వప్నంలో సాక్షాత్కరించి తనకు వాణీవిలాసం అంకితం కావింపుమని శ్రీనివాసుడు ఆదేశించాడు. స్వామివారి అభిమతాన్ని అనుసరించి రంగశాయికవి తన వాణీవిలాసం శ్రీవేంకటేశ్వరునకు అంకితం కావించాడు. వాణీవిలాసానికి ఆ భాగ్యంకలగడానికి శ్రీనివాసవిలాసమే కారణం.

"వలనగు నలమేల్మంగన్
కలుముల చెలిపెండ్లియాడి కంజదళాక్షున్
డలరుం చెలువగు సొబగున
నిలపై కల్యాణవేంకటేశ్వరు డనగన్"

అంటూ రంగశాయికవి లోకకల్యాణప్రదుడైన కల్యాణవేంకటేశ్వరుని వర్ణించి మనల్ని తన్మయులను చేస్తాడు.

శ్రీకృష్ణవిలాసము

"నీకావ్యాంకిత మిమ్మటంచు కృపతో నీయిష్టదైవంబు దా
నాకాంక్షింపుము వేంకటేశ్వరుడె డాయన్వచ్చి వేడన్ భళా
నీకోర్కెల్ సమకూరె నీదుకృతియున్ విఖ్యాతమై భూమిలో
నాకల్పస్థితిగాంచె రంగవిభు వెంగా! యెంతధన్యుండనో."

చల్లపల్లి వెంకనార్యుడు తన 'శ్రీకృష్ణవిలాసము' శ్రీనివాసుని ఆదేశంతో స్వామికి అంకితం చేసి ధన్యుడయ్యాడు. ఇతడు 17 వ శతాబ్దం తరువాతివాడు.

ప్రబంధరాజ విజయవేంకటేశ్వరవిలాసము

శకుంతలాపరిణయము

17వ శతాబ్దానికి చెందిన గణపవరపు వెంకటకవి తన "ప్రబంధ రాజ విజయ వేంకటేశ్వరవిలాసము" శ్రీనివాసునకు అంకితం చేసాడు.

18వ శతాబ్దంలో చింతపల్లి ఛాయాపతి రాఘవాభ్యుదయము, కృష్ణ కవి తన శకుంతలాపరిణయము శ్రీవారికి అంకితం చేసారు.

"కొండలరాయనిఁ గొలుచుకవులకు బం
గారపు ముడుపు మోకాళ్ళ ముడుపు
పరమదాసవ్రాత పాపంబు లెల్లను
గడలకుఁదుడుపు మోకాళ్ళ ముడుపు
దిటమున నెక్కు నెంతటివారి కొదవించుఁ
గన్నంతజడుపు మోకాళ్ళ ముడుపు
నానాదిగాగత నరసంతతికిఁ బున
ర్గమనంబు లుడుపుమోకాళ్ళ ముడుపు

తడుపులిడనట్టి మేనులు నిడుపుజూపు
నొడవుమది నెంచి తపములు గడుపుమునుల
పొడవులెటిగించు జీకటి నిడుపుగహాల
కడుపొలుపలరు నిడుపు మోకాళ్ళ ముడుపు"

ఈవిధంగా గణపవరపు వేంకటకవి కొండును, కొండత్రోవలోని మోకాళ్ళముడుపును, ఆపదుకొండలవాణ్ణి తనప్రబంధరాజవిజయ వేంకటేశ్వర విలాసంలో వినుతించాడు. "అలమేల్మంగాభిధానేందిరా జేవింగాగిట చేర్చు వెంకటపతిన్ ధీయుక్తి కీర్తించెదన్" అంటూ కృష్ణకవి తన శకుంతలాపరిణయం శ్రీవారికి అంకితం జేస్తూ శ్రీవేంకటరమణ మూర్తి సత్కీర్తిని కీర్తించాడు.

ఈకవుల కావ్యాలను అంకితంపొంది ఆకవులను చిరజీవులను చేసాడు శ్రీనివాసుడు. వారిరచనలను సాహిత్యప్రపంచంలో చిరస్థాయిగా నిలిపాడు శ్రీవేంకటేశ్వరుడు. ఈవిధంగా ఎందరుకవులో శ్రీనివాసునకు తమకావ్యాలను అంకితంజేసికొని తరించగా ఎందరెం

దరో కవులు శ్రీనివాసుని తమ కావ్యనాయకుని చేసికొన్నారు. శ్రీ వేంకటేశ్వర వృత్తాంతాన్ని తమ కావ్యానికి యితివృత్తంగా తీసికొని రచనలు సంతరించారు. తమ కవితాగానంలో శ్రీ వేంకటేశ్వర వైభవ గానం చేసారు.

## కళాపూర్ణోదయములో శ్రీనివాసుడు

అట్టివారిలో పింగళి సూరన ఆద్యుడు. పింగళిసూరన తన 'కళా పూర్ణోదయం' లో తిరుమలను, తిరుమలేశ్వరుని, దర్శనానుభూతిని హృద్యమైన పద్యాలలో వర్ణించాడు. మణికంధరుని యాత్రలలో తిరుమలను వర్ణించాడు.

"ఘనప్రమద ప్రేమవిశేష సంభృత పరిరంభక్రియా సంభ్రమ భ్రమకారాభిముఖ ప్రసారలహరీబాహాసమూహాసమాన మనోజ్ఞంగా" స్వామిపుష్కరిణి ఉందని సూరన మనోహరంగా చిత్రించాడు.

"మణిమయ ప్రాకారమంటప గోపుర
దీర్ణ కాంతులచేత తేజమునకు
జారు నదీహస్త చామరవీజన
వ్యాపారముచేత వాయువునకు
నారాధనార్థయాతాయాతజనవిభూ
పారజోవృష్టిచే ధారుణికిని
హాద్యచతుర్విధ వాద్యస్వనోపమో
గ ప్రవర్తనచే గగనమునకు
నిజసితాగరు ధూమజనీరవాహ
జననసంబంధ మహిమచే సలిలమునకు
పావనత్వంబు గలుగంగ బరగు వేంక
టేశునగరు దాఁ జేరి యింపెసక మెసగ"

పృథివ్యాపస్తేజో వాయురాకాశాది పంచభూతాలు ఏవిధంగా తిరుమలలో పావనములకంటే పావనమయ్యాయో సూరన చమత్కారంగా ఆవిష్కరించాడు. పావనమైన పంచభూతాలు తిరుమలపై తిరుమలేశుని ప్రభావంమూలంగా నెలకొని ఉండటంవల్ల తిరుమల యాత్రి కావించే పంచభూతాలతో నిర్మింపబడిన దేహధారులు తమ పంచభూతాలను ఆశ్రయించిన దోషాలు తొలగించుకొని వారు పావన గాత్రులవుతున్నారు. పుణ్యాత్ము లవుతున్నారు. పంచభూతాలు పావన మవుతున్నాయని సూరన్న చెప్పిన చమత్కారంలోని రహస్య మిది.

"మృదు పదాంబుజములు మెఱుగుటందెలు పైడి
దుప్పటియును మొలమువ్వడియును
మణిమేఖలయు బొడ్డుమానికంబును వైజ
యంతియు నురమున నలరు సిరియు
వరదహస్తమున కటివర్తిల్లు కేలు శం
ఖము చక్రమును దాల్చు కరయుగంబుఁ
దారహారంబులు చారుకంఠంబు ని
ద్దపు చెక్కులును నవ్వుదళుకు పసలు
మకరకుండలములును దామర తెగడు
కన్నులు మనోజ్ఞనాసయు కలికిబొమలు
ముత్తియపునామమును రత్నమకుటవరము
నెసగ కనుపట్టు శ్రీవేంకటేశు చూచె."

అట్టి శ్రీనివాసమూర్తి దివ్యాకృతినిచూచి పులకించిపోతాడు సూరన మణికంధరుడు. తనదృష్టి ఎలా స్వామిపై ప్రసరించిందో, తన దృష్టి స్వామిప్రత్యంగంపై నిలచి ఎలామరల లేదో, మరలిన తనదృష్టి స్వామిపై మరల ఎలానిలచిందో- నిలచినప్పుడు తనమనోగతభావం ఎలాఉందో మణికంధరుడు మనకు తెలుపుతున్నాడు, చూడండి.

"పదపద్మముల చిక్కి పాయదు నాదృష్టి
కనకాంబరమున కేకరశి తెస్తు
కనకాంబరమున కీల్కొనిన చలింపదే
నుదరబంధమున నెట్లో దిగూర్తు
నుదరబంధమున నింపొంది భేదిల్లదు
శ్రీవత్సమున కెట్లు చేరదిగుతు
శ్రీవత్సమున తారసిలిన గానేరదు
కేలు దామరల కేకియమరల్తు
కేలుదామరల గళశ్రీలమోవి
మకరకుండలముల గండమండలముల
నాస కనుగవ బొమల కుంతలములందు
నెందుపర్వివ విడజాలదేమి జెప్ప"

ఆనాటి మణికంధరునిస్థితినే స్వామిని దర్శించే ఈనాటి భక్తులు మణికంధరుని అనుభూతిని పొందుతున్నారు. మణికంధరుడు శ్రీవారి దర్శనంతో ఇతరం మరిచిపోయాడు. ప్రపంచాన్ని మరిచిపోయాడు. ఆ దేవదేవుడైన శ్రీనివాసుని సౌందర్యంతో తనమనస్సును నింపుకొని ఇంపుగా దేవునిగుణగానం చేశాడు. తెలుగుపాఠకుని హృదయంలో కలకాలం నిలిచే తిరుమల వర్ణన, శ్రీవేంకటేశ్వర భక్తుని మనస్సులో చిరకాలం నిలిచే తిరుమలేశ్వరుని వర్ణన సూరన తనకళాపూర్ణోదయంలో అందించాడు. కళాపూర్ణోదయ రచన క్రీ. శ. 1560 లో జరిగింది. అందుచేత దాన్ని ఆనాటి తిరుమలవర్ణనగా మనం స్వీకరించాలి.

## తెనాలిరామకృష్ణుని వర్ణనలో శ్రీనివాసుడు

108 దివ్యతిరుపతులలో ఘటికాచలక్షేత్రం ఒకటి. ఘటికమాత్రంలో- ఒక్కగడియకాల మాత్రంలో ఈక్షేత్రమందలి నరసింహ

స్వామిని దర్శిస్తే భక్తులవాంఛితాలు నెరవేరతాయని స్థలపురాణం ప్రకటిస్తోంది. ఈ క్షేత్రప్రాశస్త్యంగూర్చి తెనాలిరామకృష్ణకవి "ఘటికాచల మాహాత్మ్యము"లో రచించాడు. దానిలో తిరుపతి వేంకటేశ్వరు వర్ణన కావించాడు. భక్తుల మనస్సులను అలరించే చక్కనివర్ణన అది. సప్తఋషులు శతశృంగపర్వతంపైన శ్రీనివాస దర్శనాపేక్షతో తపస్సు చేస్తూంటారు. వారి తపోభంగం కావించడానికి ఇంద్రుడు విఫల ప్రయత్నం చేస్తాడు. ఆకాశవాణి వారిని ఘటికాచలం సేవించమని ఆజ్ఞాపిస్తుంది. వారు పురుషోత్తక్షేత్రం (పూరీజగన్నాథం), శ్రీకాకుళ ఆంధ్రక్షేత్రం సేవించి, కృష్ణానదీస్నానం చేసి తిరుపతి వేంకటేశ్వరుని దర్శించడానికి శేషశైలం సమీపిస్తారు.

"చని చని కాంచిరా దివిజసంయము లందరుముందరన్ గన
త్కనకమణిప్రభాజన కధాతు గుహాతటశృంగ సాలమున్
జనజని బంధ సేంధనధనంజయ దంచితతీర్థజాలమున్
సనకసనందనాది మునిసంస్తుతశీలము శేషశైలమున్"

సప్తఋషిపుంగవులు చూచి ఆనందించిన శేషశైల ప్రభలను తెనాలిరామకృష్ణకవి తన 'ఘటికాచలమాహాత్మ్యమున' ఈవిధంగా వర్ణించాడు.

"పొడుపుగుబ్బలిమీద బొడుచు భానునిలీల
గలకిరీటము తలకలుగువాని
అఱచందురుని వెనుజరుచు నెన్నుదిటిపై
ముత్యాల తిరుమణి మెరుపువాని
వెలుసలి వామించుల మిసమిసల్ దీపించు
నొసపరి కుండల యుగమువాని
సెలవుల తుదికెక్కు చిరునవ్వుడాల్ చొక్కు
తళుకు లేజెక్కుల కులుకువాని

కలువతామర కొలముల వలువజేయు
చూపులను చలివేడియు జూపువాని
విమలలావణ్య జలనిధి వేలబొడము
పగడమనవొప్పు వాతెరసొగసు వాని.

కరశంఖమునకు ఏకగ్రీవముగు శేవ
గలగ్రీవ చెలువున చెలగువాని
తనువెత్తుకీర్తి ప్రతాపంబులన మించు
కరగత శంఖచక్రముల వాని
అకల్పఫలమిచ్చు నాకల్ప శాఖల
దాయాదులౌ కేలుదోయి వాని
ఆలకనిర్జిత భృంగయూ అలమేల్మంగ
కిరమైన పచ్చనియురము వాని

కోరియిరుదుగ మొగముల కుట్టిగన్న
అమ్మ నాజను పొక్కిటి తమ్మివాని
ఘోరదానవ విపిన కుఠారమైన
బలుకటారంబు కటితటి గలుగువాని"

శ్రీవారి వదనసౌందర్యం, ఆయుధసౌభాగ్యం ఈరెండు సీసాలలో వర్ణించి సప్తఋషులచేత దర్శింపజేశాడు. భక్తితత్పరతతో స్వామివారి దివ్యమంగళవిగ్రహాన్ని, ఆవిగ్రహసౌందర్యాన్ని, సౌభాగ్యాన్ని అభివర్ణించాడు. "శృంగారరసరుచి శ్రీలకు నెలవైన మెరుగు చామనచాయ మేనివానిగా" శ్రీనివాసుని తీర్చిదిద్దాడు.

"మొలకటారవు టెక్కు గలవాని కలవాని
నెనరువాని బాగడ దనరు వాని
దయతోడకూడి చేతనవాని తనవాని
తనయంతవానిగా నునుచు వాని

పదములు వెదలు నా పగవాని పగవాని
పగవాని బురుకుడు బిరుకువాని
నెమ్మోము నగవు వెన్నెలవాని నెలవాని
చెలికన్నుదోయిగా జెలగువాని
అంబుదంపుడంబు మీరు గాత్రింబువాని
కొండనని కోర్కికొండను కొండవాని
నిలువుగల పైడి చెలవుల వలువవాని
మేలుసముకూర్చు నలమేలు మేలువాని"

ఇట్టి భక్తవత్సలుడైన సప్తగిరీశుని సప్తఋషిపుంగవులు సేవించారు. తెనాలిరామకృష్ణకవి ఏడు సీసపద్యాలలో ఏడుగురు దివ్యమునులు ఏడుకొండలవాణ్ని సేవించినతీరును తీర్చిదిద్దాడు. ఏకగ్రీవంగా ఎనిమిదవసీసంలో శ్రీవారివైభవాన్ని కీర్తించారు. 'ఘటికాచల మాహాత్మ్యం'లో తెనాలిరామకృష్ణకవి సప్తఋషులు దర్శించిన తిరుమలను, తిరుమలేశ్వరుని చిరస్మరణీయంగా ఆవిష్కరించాడు. తిరుమల దివ్యదృశ్యం మనకు సాక్షాత్కరింపజేశాడు.

## శ్రీపాదరేణు మాహాత్మ్యం

16వ శతాబ్దంలో సిద్ధిరాజు తిమ్మరాజు తన 'పరమయోగివిలాసము'లోను, తరిగొప్పుల మల్లన తన 'చంద్రభానుచరిత్ర'లోను శ్రీ వేంకటేశ్వరుని కీర్తించారు. వేంకటాచలాన్ని ప్రస్తుతించారు. 17వ శతాబ్దం తుదిభాగంలో రేపల్లూరి వేంకటాచార్యులు శ్రీ వేంకటేశ్వరుని శ్రీపాదరేణుమాహాత్మ్యాన్ని యితివృత్తంగా తీసికొని 'శ్రీపాదరేణు మాహాత్మ్యం' సంతరించాడు.

"పైత్యభ్రమధ్వాన్త పటల భానూదయం
బతిమేహ దావానలాభ్రవృష్టి

కఫరోగ బుస్పృక తర్కద్రుమ గ్రీష్మంబు
పాండుమదుష్టోరగ పక్షిరాజు
పటు పురాణజ్వర పర్వతదంభోళి
క్షయకాలకూట విషప్రతిహరాలి
కుత్సిత శ్లేష్మాబ్ధిమంథ సంభవమూర్తి
ధాతుప్రసూన చైత్రిక దినంబు
వాత జీమూత సంఘాత వాయుపథము
చిరతరాయురభివ సంజీవకరణి
వేంకటేశ్వర శ్రీపాద పంకజాత
రేణువు మదీయ రుజలు హరించుగాక”

శ్రీ వేంకటేశ్వరమహిమను, శ్రీ వేంకటేశ్వర శ్రీపాదరేణువు మహిమను రేవణూరి వేంకటాచార్యులు ఆ రచనలో వివిధరీతులలో సాక్షాత్కరింపజేశారు. శ్రీపాదరేణుమాహాత్మ్యస్మరణ, పఠనాదులు ఇహపర సుఖాలు ప్రసాదిస్తాయి.

శ్రీనివాసవిలాససేవధి

“స్వామిపుష్కరిణికి సాటి తీర్థంబు
వేంకటాద్రికి నుద్ది విష్ణుస్థలంబు
వేంకటేశ్వరుఁబోలు వేఱె దైవంబు
సత్యంబుగాఁగ నెచ్చట లేదు లేదు
ప్రత్యక్షముగను మా పలి యిందు”

— శ్రీనివాస విలాససేవధి

“శ్రీనివాసవిలాససేవధి” కృతికర్త శ్రేష్ఠలూరి వేంకటాచార్యుడు. బహుపురాణాలలో ప్రతిపాదింపబడిన తత్కథ భక్తులకు అవగాహనకాక గహనంగా పరిణమించినదని- తనకథలో సమన్వయం సాధించి కావ్యం రచించమని శ్రీనివాసుడే వేంకటాచార్యుని ఆదేశించి

నాడట. పురాణకథలలో ప్రతిపాదింపబడిన శ్రీనివాసగాథలకు సంబంధించిన పరస్పరభిన్నాంశాలను, పరస్పర విరుద్ధమైన విషయాలను సవరించి, సమన్వయంచేసి శ్లోకమాలికగా 'శ్రీనివాసవిలాస సేవధి'ని ఉత్కృష్టమైన రచనగా రూపొందించాడు. ఇది శ్రీనివాసుని ఆదేశం మేరకు వెలువడిన రచన. ఈ రచన 18వ శతాబ్దంలో వెలువడింది.

## మధురవాణీవిలాసం

'మధురవాణీవిలాస' కవి చింతలపల్లి వీరరాఘవకవి. ఈ కవి శ్రీ వేంకటేశ్వర వరప్రసాదంపొందిన కవి. కన్యాని ప్రబంధం తనపేర రచింపుమని శ్రీనివాసుడు ఈ కవిని ఆదేశించాడు. ఏడుకొండలవాని దయవలన ఈతనివంశంవారు ఏడుతరాలవరకు కవులయ్యారు. ఇతని ఆరుగురుకుమారులు కవులై వర్ధిల్లారు.

"దండము పన్నగేంద్ర వసుధాధరనాథ! గతాపరాధ వే
దండ కులేంద్ర రక్షణవిధాననిదాన! కృపార్ణవేంద్ర! నీ
దండను జేర్చి ప్రోవు జగదండ నివాసవిలాస నన్ను పూ
దండగ నేలుకోవ వసుధామధురాధర! భార్గవీధరా!"

ఈవిధంగా వీరరాఘవకవి అలమేలుమంగచేత శ్రీనివాసుని ప్రార్థింపజేస్తాడు తనప్రబంధంలో. ప్రతిపతిత, ప్రతిభక్తుడు చేయవలసిన ప్రార్థన అది. శ్రీ వేంకటేశ్వరభక్తులు స్వామిని ప్రార్థించుకోవడానికి వీలైన ఇలాంటిపద్యాలు ఎన్నో దీనిలో ఉన్నాయి. మనం హృదయాలలో భద్రపరచుకోవలసిన భావాలతో, ఈ పద్యాలు నిండిఉన్నాయి.

## వేంకటేశ్వరవిలాసం

"వలరాజుగాన్పు చిల్వలరాజు పాన్పు గ
ల్వలరాజు లొాన్పుగా గలుగువాడు
కడలేనికల్మి యెక్కడలేని బల్మి ని
క్కడబోని చెల్మి సంగరమువాడు

కావన్నెచాలదు విన్కలిగన్నమాయలు కో
ల్కరి కన్నమాయ నెన్నకెవాడు
కరమున్నరూపు సత్కరమున్న రూపము
క్కరమున్న రూపు చెక్కలుకువాడు
మేలువాడు జగజ్జాల మేలువాడు
నోమువాడు వరంబిచ్చు నోము వాడు
వన్నెవాడు దలంప మువ్వన్నెవాడు
యీశ్వరుండగు శ్రీ వేంకటేశ్వరుండు."

ఈపద్యం 18వ శతాబ్దం తుదిలోను, 19వ శతాబ్దం తొలి భాగంలోను తూర్పుగోదావరిజిల్లా కడియంగ్రామంలో నివసించిన చెళ్ళపిళ్ళ నరసకవి రచించిన వేంకటేశ్వర విలాసంలోనిది. శ్రీనివాసుడు చెంచులక్ష్మిని పెండ్లాడిన కథ దీనిలో వర్ణించబడింది. శ్రీ వేంకటేశ్వర భక్తి పరిమళంతో గుబాళించే కావ్యం చెళ్ళపిళ్ళ నరసకవి సంతరించిన వేంకటేశ్వర విలాసం.

## తరిగొండ వెంకమాంబ

తరిగొండ వెంకమాంబ తిరుమలలో నివసించి తపస్సు చేసి, సాహిత్యతపస్సు కావించి తరించిన మహాభక్తురాలు. వాయల్పాడు సమీపంలోని తరిగొండ ఆమె జన్మస్థానం. ఆమె బాలవితంతువు. తరి కొండ అంటే పెరుగుకుండ అన్నమాట. దానిలో పుట్టిన నరసింహుడు తరిగొండ నరసింహుడు. ఆ నారసింహుడు ఆమె ఇలువేల్పు. ఆ నరసింహునిలో శ్రీ వేంకటేశ్వరుని, తిరుమలేశ్వరునిలో నరసింహుని చూచి తరించిన పరమభక్తురాలు వెంకమాంబ. బాలవితంతువుగా తిరుమలకు చేరుకొంది. మొదల గోగర్భంలో, తరువాత పాండవ తీర్థంలో తపస్సు చేసింది. [illegible]జనులు, భక్తజనులు అంతరాయం కల్పించగా నిర్జనమైన తుంబురతీర్థ సమీపంలోని పాండారణ్యంలో తపస్సు

కొని సాగించింది. ఆమె ఏకాంతస్థానంనుండి ఆమె నందనవనానికీ, తిరుమల ఆలయానికి రహస్యమైన బిలమార్గం ఉండేదట. అర్ధరాత్రిసమయాలలో తన తపఃస్థానంనుండి తిరుమల శ్రీవారి ఆలయానికి ఆ రహస్య మార్గంద్వారా ప్రవేశించి స్వామికి పూజలుచేసి, నివేదనలు సమర్పించి మరలిపోయేదట. అర్ధరాత్రి శ్రీవారి ఆలయంమూసిన పిమ్మట పూజలు జరిపేవ్యక్తిని దర్శించాలని ప్రయత్నించిన ఆ నాటి మహాంతు శ్రీ సేవాదాస్‌జీకు వెంకమాంబ దర్శనభాగ్యం లభించింది. ఆమెకు శ్రీవారి ఏకాంతసేవ చేసే అవకాశం కల్పించమనే శ్రీవారి ఆదేశం అందింది. వెంకమాంబ తపస్సిద్ధి పొంది తిరుమలపై స్థిరనివాసం ఏర్పాటు చేసికొని జీవితాంతం శ్రీవారి ఏకాంతసేవ చేసికొంది. ఆమె ముత్యాలహారతి స్వీకరించి స్వామి పవ్వళించేవారు. ఆమె పేరు మీదుగా ఏకాంతసేవానంతరం ముత్యాలహారతి నేటికీ జరుగుతూనే ఉంది.

శ్రీనివాసుని తన తపస్సిద్ధిసమయంలో సాక్షాత్కరింపజేసికొంది. శ్రీవారి అనుగ్రహంతో యోగశక్తులను సాధించింది. ఆమె పిలిస్తే శ్రీనివాసుడు ఆమెముందు నిలిచి పలికేవాడట. ఆమె కోరినప్పుడు కనిపించేవాడట. ఆ వేంకటేశ్వర భక్తురాలు నిరక్షరాస్యురాలు. ఓనమాలు రాని అవిద్యావంతురాలు. యోగశక్తితో, శ్రీ వేంకటేశ్వర భక్తితో సంస్కృతాంధ్రాలలో మహాపాండిత్యం సంపాదించింది. కవయిత్రిగా రాణించింది. అసంఖ్యాకములైన, అపూర్వమైన రచనలు సంతరించింది. వానిని నరసింహస్వామికి అంకితం చేసింది. వానిలో 'శ్రీ వేంకటాచల మాహాత్మ్యము', 'శ్రీ రమాపరిణయము' శ్రీ వేంకటేశ్వరునిపై రచించిన గ్రంథాలు. మొదటిది శ్రీ వేంకటేశ్వర మహిమను, రెండవరచన శ్రీనివాసుని కల్యాణవేడుకలను వర్ణించింది. 1850 ప్రాంతంవరకు వెంకమాంబ తిరుమలపై నివసించి ఇట్టి గణనీయమైన

కృషి సల్పి, శ్రీ వేంకటేశ్వర భక్తవరాలుగా ప్రసిద్ధివహించి తరించింది. ఈ విధంగా వెలువడిన శ్రీ వేంకటేశ్వ రాంధ్రసాహిత్యంలోని రచనలలో అత్యధికసంఖ్యాకములైన రచనలు శ్రీ వేంకటేశ్వర మహిమలను, శ్రీ వేంకటేశ్వరమూర్తి దర్శనవిశేషాలను, వేంకటేశ్వర పౌరాణికగాథలను, శ్రీ వేంకటేశ్వరకల్యాణపు వేడుకలను వర్ణించినవే! ఆ రచనలు సాగించినవారు శ్రీ వేంకటరమణుని ప్రత్యక్షమైన దివ్య ప్రేరణతో కావ్యాలువ్రాసి శ్రీవారికి అంకితం చేసారు. మిగిలినవారు శ్రీ వేంకటేశ్వరభక్తితో పరిభావితులై రచనలు సాగించారు. శ్రీ వేంకటేశ్వరాంధ్రసాహిత్య క్షీరసాగరమథనంలో ఉద్భవించే శ్రీనివాసుని భక్తి అనే అమృతాన్ని అందరూ ఆస్వాదించి తరించాలి!

## శ్రీ వేంకటేశ్వరశతకసాహిత్యం - లఘుకృతులు

ఆంధ్రశతక వాఙ్మయాన్ని శ్రీ వేంకటేశ్వర శతక సాహిత్యం సుసంపన్నం చేసింది. 15వ శతాబ్దంలో అన్నమయ్య అలమేలుమంగాంబికాస్తుతి పరంగా శ్రీ వేంకటేశ్వర సంబోధనతో వ్రాసిన శ్రీవేంకటేశ్వర శతకంతో ఆంధ్రవేంకటేశ్వరశతక సాహిత్యానికి శ్రీకారం చుట్టబడింది. కలితలక్ష్మీశ! శర్వజగన్నివేశ! విమలరవికోటిసంకాశ! వేంకటేశ!" అంటూ చెప్పిన అన్నమాచార్యుని కుమారుడైన పెదతిరుమలాచార్యుని వేంకటేశ శతకం శ్రీ వేంకటేశ్వర భక్తులకు లభించిన శ్రీనివాస ప్రసాదం. 15వ శతాబ్దంనుండి నేటివరకు ఎన్నో వేంకటేశ్వర శతకాలు వెలువడ్డాయి. వానిలో పత్రి రమణప్పకవి వేంకటరమణశతకం, రత్నమాంబ, వేంకటరమణశతకం, భుజమెళ్ళ భగవచ్ఛాస్త్రి తిరుమలవేంకటేశ్వరశతకం, ఊదుమూడి సూరపరాజు శ్రీవేంకటేశ్వరశతకం, నల్లాం చక్రవర్తుల వేంకటాచార్యుల శ్రీ తిరుమలగిరి వెంకటేశ్వరశతకం, మంచెళ్ళ కృష్ణకవి వెంకట

నగాధిపశతకము' పేర్కొనదగినవి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంపాదకత్వంలో తిరుమల తిరుపతి దేవస్థానాలవారు 'శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు' ప్రకటించారు. దానిలో ధర్మపురి వెంకటశాస్త్రి వేంకట రమణ, వేంకటేశ్వరశతకాలు, వేంకటాచలధామ తారావళి, గణపవర వేంకటేశ్వరకవి వేంకటశైల నాయకశతకం, నామయోగి శ్రీ వేంక టేశ్వర పంచచామరములు, తరిగొండ వెంకమాంబ రమాపరిణయం ప్రకటింపబడ్డాయి. ప్రకటన, ప్రచారంకోరని, కీర్తికోసం కాక వేంకట రమణమూర్తిని కీర్తించడమే లక్ష్యంగా పెట్టుకొన్న, ఆత్మానందం కోసం రచించిన అజ్ఞాతరచయితల వేంకటాచలవిహారశతకం, పంకజాత భవాండేశశతకము, వేంకటశైల నాయకశతకము, వేంకటాచలేశశత కము, వేంకటాచలపతి శతకము, వేంకటేశ్వర పంచకము, శ్రీ వేంకటే శ్వర కల్యాణము, అలమేల్మంగా స్తవము, ప్రసన్న వేంకటేశ్వరమంజరి, రెండు వేంకటేశ్వర దండకాలు ప్రచురింపబడ్డాయి. ఇవి శ్రీ వేంకటే శ్వర భక్తిసమన్వితమైన, హృద్యమైన, ఆస్వాద్యమైన మంచిరచనలు.

## ధార్మికసాహిత్య పోషకుడు

తిరుపతి వేంకటకవులనుండి నేటివరకూగల అందరు సాహితీ పరులు వివిధసాహిత్యప్రక్రియలలో శ్రీ వేంకటేశ్వరుని స్తుతించారు. కీర్తించారు, కీర్తిస్తున్నారు. శ్రీనివాసునిపై కథలు, కావ్యాలు, నాటికలు, నాటకాలు, గేయాలు, పాటలు, పద్యాలు, బుర్రకథలు, హరికథలు, ఇలా ఎన్నో ఆధునికాంధ్రసాహిత్యంలో వెలువడ్డాయి. వెలువడుతున్నాయి. నేడు శ్రీనివాసుడు ఉత్తమధార్మిక సాహిత్య పోషకుడై వేలాదిరచయితలకు కోట్లాదిరూపాయలు ఆర్థికపురస్కారం అందజేస్తున్నాడు. నేటికి సుమారు వేయి ఉత్తమధార్మికరచనలు వెలువడ్డాయి. వేలాలు ప్రచురించడానికి శ్రీ వేంకటేశ్వరుడు తోడ్పడు తున్నాడు. ప్రతిరచయిత శ్రీకృష్ణదేవరాయలు కావాలి!

ఆంధ్రసాహిత్యలోకం చేత కీర్తింపబడిన, కీర్తింపబడుతూన్న శ్రీ వేంకటేశ్వరుడు ఆంధ్రసాహిత్యవికాసానికి, భావికాంధ్రసాహిత్య వికసనానికి చేయూతనిచ్చి ముందుకు నడిపిస్తున్నాడు. శ్రీ వేంకటేశ్వర ఆంధ్రసాహిత్య సమారాధనలో ఘనమైన కవితానీరాజనం సమర్పించి శ్రీ వేంకటేశ్వరాంధ్ర సాహిత్యవిజయాన్ని భావనవిజయం చేసిన శ్రీకృష్ణదేవరాయలు మనకు సదా, సర్వదా సంస్మరణీయుడు. తన 'ఆముక్తమాల్యద'ను శ్రీనివాసునకు అంకితం చేసిన శుభసమయాన చేసిన శ్రీనివాసస్తవం ఆంధ్రసాహితీపరులను శ్రీనివాససాహిత్య సృజనకు సదా ఉత్తేజపరుస్తుంది. ఉత్సాహం కల్పిస్తుంది.

"శ్రీకమనీయహారమణిఁ జెన్నుగఁదానును గౌస్తుభంబు నం
దాకమలావధూటియును నందగఁదోప పరస్పరాత్మ లం
దాకలితంబులైన తమయాకృతులచ్చుగఁ జూడఁదోప న
స్తోకతనందుఁ దోఁచెనన శోభిలు వేంకటభర్త గొల్చెదన్"

— శ్రీకృష్ణదేవరాయలు

'శ్రీ వేంకటేశ్వరభక్తి' శ్రీకృష్ణదేవరాయునకు 'ఆముక్తమాల్యద' సంతరించే శక్తినిచ్చింది. ఆభక్తి కుదిరిన ప్రతి ఆంధ్రసాహితీపరుడు శ్రీకృష్ణదేవరాయలై 'ఆముక్తమాల్యదను' అందివ్వగలుగుతాడు!

'మనుజుడై పుట్టి మనుజుని సేవించి అనుదినమును దుఃఖమంద నేల' అన్నది అన్నమయ్య ఆత్మప్రబోధంమాత్రమే కాదు. అతడు కవులకు కళాకారులకు అందించిన దివ్యసందేశం! శ్రీ వేంకటేశ్వరభక్తి భావనతో సాహిత్యం సృజిస్తే, దానిలోని దైవస్పృహ, ధార్మికస్పృహ సామాజికస్పృహను సాధించి, సమాజాన్ని చైతన్యవంతం చేస్తుంది. లోకాన్ని ప్రగతిపథంలో నడిపిస్తుంది. అవశ్యం అన్నమయ్య

సందేశం సాహితీపరులందరికి శిరోధార్యం! అందునా శ్రీనివాస సాహితీ స్రష్టలకు ఇది మరీముఖ్యం.

"మనుజుడై పుట్టి మనుజుని సేవించి
అనుదినమును దుఃఖమంద నేల
పట్టెడు కడుపుకై చోరని చోట్లు చొచ్చి
పట్టెడు కూటికై బ్రతిమాలి
పుట్టినచోటికే పొరలి మనసుబెట్టి
వట్టిలంపటము వదలనేరము గాన
అందరిలో బుట్టి అందరిలో చేరి
గద్దరి రూపము లటుదానై
అందమైన వేంకటాద్రీశు జపించి
అందరాని పదమందె నటుగాన"

— అన్నమయ్య అధ్యాత్మసంకీర్తన.



# సంకీర్తన భాండారం

"హరి యవతార మీతడు అన్నమయ్య
అరయ మాగురు డీతడన్నమయ్య
వైకుంఠనాథునివద్ద వడి పాడుచున్నవాడు
ఆకరమై తాళ్ళపాక అన్నమయ్య
ఆకసపు విష్ణుపాదమందు నిత్యమైయున్నవాడు
ఆకడీకడ తాళ్ళపాక అన్నమయ్య
క్షీరాబ్ధిశాయి నిట్టె సేవింపుచు నున్నవాడు
ఆరి తేరి తాళ్ళపాక అన్నమయ్య
ధీరుడై సూర్యమండల తేజమువద్ద నున్నవాడు
ఆ రీతుల తాళ్ళపాక అన్నమయ్య
యీవల సంసారిలీల నిందిరేశుతో నున్నవాడు
ఆవటించి తాళ్ళపాక అన్నమయ్య
భావింప శ్రీ వేంకటేశు పాదములందె వున్నవాడు
హావభావమై తాళ్ళపాక అన్నమయ్య"

— చిన తిరుమలాచార్యులు

## కారణజన్ముడు అన్నమయ్య

శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనం చేసికొని ప్రదక్షిణంచేసి శ్రీవారి హుండీవద్దకు వచ్చేయాత్రికునకు హుండీ ఎదురుగా తాళ్ళ పాకవారి అర కనిపిస్తుంది. అన్నమాచార్యుని సంకీర్తనలను రాగిరేకులపై చెక్కించి భద్రపరచబడిన శ్రీ భాండారమది. ఆ శ్రీ భాండారపు ద్వారానికి ఎడమప్రక్క అన్నమాచార్యుని శిలాప్రతిమ, కుడి ప్రక్క పెదతిరుమలాచార్యుని శిలాప్రతిమ మనకు గోచరిస్తాయి. శ్రీ వేంకటేశ్వరదర్శనం చేసినవారికి అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరసంకీర్తనం స్ఫురణకు వస్తుంది. అన్నమయ్య సంకీర్తనలో శ్రోత శ్రీనివాసుని

దర్శించగలుగుతాడు. శ్రీరాముని సంకీర్తనం జరిగినతావులో శ్రీరామదూత ఉంటాడు. శ్రీరామదూతఉన్న నెలవులో శ్రీరామ సంకీర్తనం విధిగా ఉంటుంది. అన్నమయ్య సంకీర్తనంజరిగే తావులో శ్రీనివాసుడు నెలకొని ఉంటాడు. శ్రీనివాసుడు రావాలి, కావాలి అంటే అన్నమయ్య సంకీర్తనం జరగాలి!

శ్రీనివాసుని ఆదేశం

శ్రీ వేంకటేశ్వర సంకీర్తనంకోసం జన్మించిన కారణజన్ముడు అన్నమయ్య. ఇతనితల్లి లక్కమాంబ, తండ్రి నారాయణసూరుడు. వీరు పుత్రసంతానంకోసం తిరుమలయాత్ర చేశారు. శ్రీ వేంకటేశ్వరుడు వీరిని అనుగ్రహించాడు. శ్రీ వేంకటేశ్వరుని నందకఖడ్గపు అంశలో కారణకారణుడైన శ్రీ వేంకటరమణుని సంకీర్తనం చేయడంకోసం కారణజన్ముడై వీరికడుపున అన్నమయ్యపుట్టాడు. తల్లి మాధవుని భక్తురాలు. ఆమె పిలిస్తే మాధవుడువచ్చి ఆమెతో మాట్లాడేవాడట. భక్తిలో తల్లికి వారసుడయ్యాడు అన్నమాచార్యుడు. అతని పదహారవ యేట కలగాంచాడు. కలలో మేల్కాంచాడు. సాక్షాత్కరించిన శ్రీని వాసుని చూచాడు. "అన్నమయ్యా! నీవు కారణజన్ముడవు. నా వర ప్రభావంమూలంగా నీ జిహ్వారంగ సీమపై విద్యలన్నీ తమంత తామే జొచ్చి నాట్యమాడతాయి. నీవు ఆడినమాటెల్ల అమృతకావ్య మవు తుంది. నీవుపాడిన పాటెల్ల పరమగానమవుతుంది. నాపై సంకీర్తనం కావింపుము." అన్నమయ్యకు ప్రత్యక్షమైన శ్రీనివాసుడు అన్నమ య్యను ఈవిధంగా ఆదేశించాడు. అంతలోనే అదృశ్యుడయ్యాడు. అన్నమయ్య పుట్టింది క్రోధి సంవత్సరంలో విశాఖనక్షత్రంతోకూడిన వైశాఖపౌర్ణమి అన్నమయ్య జయంతి. తారీఖు నెల సంవత్సరమైతే 9-5-1408లో అన్నమాట. శ్రీనివాస సాక్షాత్కారం పొందింది క్రోధి సంవత్సరంలో - 1424లో.

కలలో కనిపించినవాడు ఇలలో తిరుమలలో ఉన్నాడని అన్నమయ్య తిరుమలకు పోవాలనుకొన్నాడు. తెల్లవారింది. కల అతణ్ణి మార్చివేసింది. తెలుగుభాషకు, తెలుగుజాతికి ఆది వాగ్గేయకారుణ్ణి, హరిసంకీర్తనాచార్యుణ్ణి,పదకవితాపితామహుణ్ణి ప్రసాదించింది. తెలుగు జాతినే ప్రభావితం చేసింది ఆ కల జాతిలో జాగృతి తెచ్చింది. ఉదయం అన్నమయ్య కొడవలి చేపట్టి పొలానికి వెళ్ళాడు. గడ్డి తవ్వడం, కోయడం. మోపులు కట్టడం, నెత్తినపెట్టుకోవడం, ఇంటికి తేవడం,సంతలకు వెళ్ళి సరుకులు సమకూర్చుకు రావడం, ఇది అతని నిత్యకృత్యం. గడ్డి కోస్తున్నాడు. కలగూర్చి, తిరుమలగూర్చి ఆలోచిస్తున్నాడేమో వేలు తెగింది. పొలంగట్టున తిరుమలకు యాత్రికులు గోవిందనామాలు పాడుతూ వెళ్ళడం చూచాడు. రక్తం కారుతూన్న వేలు చూచుకుంటే అన్నమయ్యకు తనకర్తవ్యం బోధపడింది. కొడవలి విసరివేసాడు. కోసినగడ్డి, మోపుకట్టినగడ్డి పొలంలో వదలిపెట్టాడు. పొలంగట్టున తిరుమలయాత్రకు వెళ్ళేవారివెంట పడ్డాడు.

## అలమేలుమంగ అనుగ్రహం

వారితో తిరుపతి పొలిమేరకు వచ్చాడు. గ్రామదేవత గంగమ్మకు చేతులెత్తి మ్రొక్కుకొన్నాడు. కొండవద్దకు వచ్చాడు. కొండను చూచాడు.

"అదిగో అల్లదిగో హరివాసము
పదివేల శేషుల పడగలమయము"

అని పాడుకుంటూ కొండ ఎక్కాడు. మోకాళ్ళముడుపువద్దకు వచ్చాడు. అలసిపోయి ఎదురుగా ఉన్న రాతిబండపై వెదురుపొద [illegible] ఉన్నాడు. అలమేలుమంగ వచ్చి అన్నమయ్యను [illegible]పి [illegible] పెట్టింది. ఆకలి తీర్చింది. చెప్పులువిప్పి వెళ్ళమంది. ఆమె పైన తెకం చెప్పి అలాగే చేశాడు. దారిలో ఆ పాదాలు చూశాడు.

కరువునంబికథా శిల్పం చూచాడు. 'బ్రహ్మకడిగిన పాదము బ్రహ్మము దానీపాదము' అని గానంచేసాడు. కరువనంబిపై పాటపాడినాడు. తిరుమల సమీపించాడు. 'దేవునికి దేవికిని తెప్పలకోనేటమ్మ - వేవేలు మొక్కులు లోకపావని నీకమ్మ'అంటూ స్వామిపుష్కరిణిపై పాటలు కట్టి పాడి దానిలో స్నానమాడి గుడిలో దేవుడిముందు నిలిచాడు. తాను కలలోచూచిన తిరుమలస్వామి ముందు నిలచినందులకు ఆనంద పరవశుడయ్యాడు. తన్మయుడై స్వామిపై సంకీర్తనం చేశాడు. స్వామిపై పాడి స్వామిముందు ఆడిఆడి తన జిహ్వాను తనదేహాన్ని పావనం చేసికొన్నాడు. "ఇందరికి అభయంబు లిచ్చు చేయి - కందువగు బంగారుచేయి" అని స్వామివారి అభయహస్తపుమహిమను అభివర్ణించుకుంటూ పాడుకొన్నాడు. తనవద్దఉన్న ఒక్కకాసు స్వామికి కానుకగా అర్పించుకొన్నాడు. అన్నమయ్యకు ఈ భాగ్యం కలిగింది ఒక ఏకాదశినాడు.

## తిరుమల నివాసం

మరునాడు ఆకాశగంగ పాపనాశన తీర్థాలను సేవించాడు. తన తడిబట్టలు పొడారేలోపల ఆసువుగా శ్రీవేంకటేశ్వరునిపైని శతకం చెప్పుకొన్నాడు. గుడికి మరలివచ్చేసరికి గుడిమూసి ఉంది. మూసిన గుడి తెరవడానికి అర్చకులు అడ్డుచెప్పారు. అన్నమయ్యస్వామిని చూడాలి, స్వామిపై పద్యాలు చెప్పాడు. పాటలు పాడినాడు. తలుపులు వాటికవే తెరచుకొన్నాయి. తనతలపు తెలిసికొని తన గుడితలుపులు తెరచుకొనేలాగ జేసిన తిరుమలయ్య ముందు అన్నమయ్య నిలిచాడు. మరల పద్యాలు పాటలు పాడాడు. అన్నమయ్యను అనుగ్రహించినదానికి సూచనగా శ్రీవారి కంఠహారం శ్రీవారి దక్షిణపాదం పైపడింది. అర్చకులు అన్నమయ్యను మహిమాన్వితుడని గుర్తించారు. గౌరవించారు. ఘనవిష్ణువు శ్రీనివాసుని ఆదేశానుసారం అన్నమయ్యకు

పంచసంస్కారాలు చేసి పరమవైష్ణవుని చేశారు. గజ్జెలకాళ్ళతో ఆడుతూ, చిడతలువేస్తూ, పండెమిగాటుకుంటూ, అనునిత్యంగా శ్రీని వాససంకీర్తన చేస్తూ తిరుమలలోనే అన్నమయ్య ఉండిపోయాడు.

దక్షిణనాయకత్వం

ఇల్లువిడిచిన అన్నమయ్యకోసం తల్లిదండ్రులు వెదుకసాగారు. లక్కమాంబకు తిరుపతివెంకన్న కలలోకనిపించి అన్నమయ్య తిరుమల పైఉన్నాడని చెప్పాడు. తల్లి తిరుమలకువచ్చి తనయుణ్ణి కలసికొని తనతో తాళ్ళపాకకు రమ్మంది. రానన్నాడు అన్నమయ్య. అన్న మయ్యను తల్లితో వెళ్ళమన్నాడు తిరుమలయ్య. పెళ్ళిచేసికొని పిల్లా పాపల్ని కని పెంచమన్నాడు. సంకీర్తనమాత్రం మానవద్దన్నాడు. తల్లితో అతడు ఇంటికివచ్చాడు. వివాహవయస్సు వచ్చింది— అన్న మయ్యకు. 'హరిగోవింద' అని పాడేవాడికి ఎవరుపిల్లనిచ్చి పెళ్ళిచేస్తారు. పెళ్ళిసంబంధాలు రావడంలేదు. వచ్చినవి కుదరడంలేదు. అన్న మయ్యకు పెళ్ళిజరగాలి. తల్లిదండ్రుల దిగులుపోవాలి. అన్నమయ్య పుట్టుటకు వరమిచ్చినవాడు వేంకటేశ్వరుడు. అతనికి ప్రత్యక్షమై పండితునిచేశాడు. కవిని కావించాడు. 'వాగ్గేయకారునిగా రూపొందిం చాడు తిరుమలకు పిలుచుకొని వెళ్ళాడు. ఇంటికెళ్ళి పెళ్ళిచేసికొమ్మ న్నాడు. అతడే అన్నమయ్యకు పెళ్ళిసంబంధాలు నిర్ణయించాడు. అంతే! ఒకరుకాదు ఇద్దరుకన్యలు— తిమ్మక్క, అక్కలమ్మలు అన్న మయ్యను పెండ్లాడారు. శ్రీనివాసుడు తనభక్తుడైన, దాసుడైన అన్న మయ్యను ఈవిధంగా తనవలె దక్షిణనాయకుణ్ణి చేశాడు. అన్నమయ్య వారితో సంసారంచేశాడు. సంతానం పొందాడు. ప్రతిసంవత్సరం శ్రీవారి బ్రహ్మోత్సవంలో విధిగా పాల్గొనేవాడు. నిత్యం శ్రీనివాసునిపై సంకీ ర్తనచేసి గానంచేసేవాడు. పద్మావతీ శ్రీనివాసుల మధురశృంగార ప్రణయగాథను 'శృంగారమంజరి' గా రచించి, గానంచేసి, ఆకల్యాణ

దంపతులైన పద్మావతీ శ్రీనివాసులకు అంకితం కావించాడు. రామాయణం ద్విపదలో సంతరించాడు. సంస్కృతంలో 'సంకీర్తన లక్షణము' చెప్పాడు. దానికి అనుగుణంగా శృంగారపదాలు, అధ్యాత్మ సంకీర్తనలు కావించేవాడు.

## నరసింహుని సాక్షాత్కారం, నరసింహునితో స్నేహం

పిల్లలు పెద్దవారయ్యాక అన్నమయ్య అహోబలం వెళ్ళాడు. లక్ష్మీనరసింహస్వామి అన్నమయ్యకు ప్రత్యక్షమై త్రిదండం, నరసింహ చక్ర, మంత్రాలను అనుగ్రహించాడు. అక్కడ శఠగోపయతీంద్రునివద్ద వేదాంత దేశిక సంప్రదాయంలోని విశిష్టాద్వైత వేదాంతం, ఆగమాలు నేర్చాడు. అహోబల నరసింహంవద్ద ఉన్నప్పుడే సాళువనరసింహంతో చెలిమికలిసింది. టంగుటూరికి అన్నమయ్యను రప్పించింది, రాయలు అన్నమయ్యపాట విన్నాడు ఆనందించాడు. మరల మరల పాడించు కొన్నాడు. "శ్రీకృష్ణునిలాగ మీరు సారథ్యంవహిస్తే నేను విజయుడనై భూచక్రం జయించి ఏకచక్రంగా పాలిస్తాను. నన్ను దీవించండి" అని అన్నమయ్యను రాయలు ప్రార్థించాడు. అన్నమయ్య రాయలును దీవించాడు.

రాయలు యుద్ధాలకు బయలుదేరాడు. అన్నమయ్య ధార్మిక యాత్రలకు ముందుకుసాగాడు. ఆంధ్రకర్ణాటక దేశాలలోని అన్ని గ్రామాలు, అన్ని క్షేత్రాలు దర్శించాడు. తాను వేదాంతకూటముల చేత ప్రభావితుడయ్యాడో వానిని చైతన్యవంతమైన కేంద్రాలుగా రూపొందించాడు. తానుదర్శించిన ప్రతిగ్రామాన్ని తిరుమలనుచేసాడు. ప్రతిగృహాన్ని ఆనందనిలయం కావించాడు. ప్రతిహృదయాన్ని శ్రీనివాససేవామందిరంగా మార్చాడు. గ్రామగ్రామాన తనసంకీర్తనలు గానంచేశాడు. శ్రీవేంకటేశ్వర భజనసమాజాలను, భక్తసంఘా

లకు, భక్తి కేంద్రాలను నెలకొల్పాడు. భాగవతధర్మం— శరణాగతి భావం జనపదాలలో, జనహృదయాలలో పాదుకొల్పాడు. అన్నమా చార్యుడు. వేంకటేశ్వర భక్తిప్రచారం విజయం సాధించి తిరిగివచ్చాడు. సాళువనరసింహుడు సాగించిన యుద్ధాలలో విజయం సాధించి విజయ నగరసామ్రాజ్యాధీశుడై మరలివచ్చాడు. అన్నమయ్య ఆశీర్వాదబలం, ఫలం రాయలవిజయమై విజయనగరసామ్రాజ్య వైభవమై ఫలించింది. ఆంధ్రకర్ణాట రాజ్య రమారమణుల కరితిసీలపుదండ పెనుగొండ నిండు సభకు అన్నమయ్యను రాయలు ఆహ్వానించి తనకృతజ్ఞులు తెలుపు కొన్నాడు.

## వేంకటేశునామమే

అన్నమయ్యను రాయలు శృంగారపదం పాడమని అర్థించాడు. "ఏమొకో చిగురు టధరమున యెడనెడ కస్తురినిండెను— భామినిప్రియుని కు వ్రాసినపత్రిక కాదుగదా" అనే శృంగారసంకీర్తనం అన్నమయ్య ఆలపించాడు. ఆ పదంవిన్న అహంకారియైన రాయలు ఒక శృంగార పదం తనపై పాడమన్నాడు. 'నేను హరిస్తుతి వినా నరస్తుతి చేయ లేను' అని అన్నమయ్య రాయల అభ్యర్థనను నిరాకరించాడు. అన్న మయ్యను మనస్సుమార్చుకొనేవరకు మొగసాలలో సంకెలవేసి నిలుపు మని రాజు భటుల్ని ఆజ్ఞాపించాడు. అన్నమయ్య సంకెల వేయించు కోవడానికి మొగసాలకు వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. రాయలుపై పదం పాడడానికి పెదవికదపలేదు. శ్రీ వేంకటేశ్వరుని వెంకను ఆ సంకెల బంధించింది తాత్కాలికంగామాత్రమే! 'మనుజుడై పుట్టి మనుజుని సేవించి అనుదినము దుఃఖమందనేల' అనుకొన్నాడు అన్నమయ్య.

"శ్రీ వేంకటేశ్వరుని సేవానిరతికిగాక
జీవనభ్రాంతి బడు సిరులేలా?

దేవోత్తముని నాత్మ దెలియ నొల్లక
పెక్కు త్రోవ లేగిన దేహిదొరతనం బేలా
అరయ నాపన్నుని కభయమీయవలె గాని
ఇరవైన సుఖిగావ నేలా
వఱుతబోయెడు వాని వడిదీయవలెగాని
దరివాని దివియగ దానేలా
ధృతిహీనుకృపజూచి తిరువేంకటేశ్వరుడు
తతిగావకుండిన దానేల?"

ఈ విధంగా భావిస్తూ 'నే నొక్కండ లేకుండితే నీకృపకు పాత్ర మేది? పూని నావల్ల నే కీర్తి పొందేవు నీవు' అని అన్నమయ్య విన్న వించుకొంటూ శ్రీనివాసుని తనకు శృంఖలావిముక్తి కల్పించమని ప్రార్థించాడు.

"ఆకటివేళల నలపైనవేళలను
తేకువహరినామమే దిక్కు మరిలేదు
సంకెళ పెట్టినవేళ చంపపిలిచినవేళ
అంకిలిగా అప్పుల వారాగినవేళ
వేంకటేశు నామమే విడిపించగతిగాక
మంకుబుద్ధి పొరలిన మఱిలేదు తెఱగు"

అన్నమయ్య ఆలపించిన ఈ సంకీర్తనతో ప్రసన్న వేంకటేశ్వరుని అనుగ్రహం అతనికి లభించింది. సంకెల తెగింది. విముక్తి లభించింది. రాయలు మరల సంకెల తనముందు వేయించాడు. అదీ తెగిపోయింది. రాయలు గర్వం పోయింది. రాయలు పాదాక్రాంతుడై అన్నమయ్యకు పాదసేవలుచేసి అతను ఆసీనుడైన పల్లకిమోసి సాగనంపాడు.

అన్నమయ్యపాత్రను శ్రీ పద్మావతీ శ్రీనివాసులు సూత్రధారులై అడుగడుగునా నడిపించారు. ఆద్యంతం నడిపించారు.

అన్నమయ్యపాట - తిరుమలయ్యఆట

"అన్నిమంత్రములు నిందే ఆవహించెను
వెన్నతో నాకుకలిగె వేంకటేశమంత్రము"

అట్టి వేంకటేశమంత్రజపసిద్ధి పొందాడు అన్నమయ్య. సప్తకోటి మహా మంత్రాలశక్తి సప్తగిరివాసుని నామంలో ఆవహించింది. నిండి నిబిడీకృతమైఉంది. వెన్నతోకలిగిన వేంకటేశమంత్రశక్తితో అన్నమయ్య 'పరమంత్రములు ముప్పదిరెండువేలు' సృష్టించాడు. అతడు సంతరించిన ముప్పదిరెండువేల సంకీర్తనలూ అవే! 'ఆలకించి వింటేను అన్నియు నీపలుకులై వేలసంఖ్యపై తోచెవీనులకు' వేంకటేశ్వరునిపలుకులు విన్న అన్నమయ్య పలికిన పలుకులివి. అన్నమయ్య నిత్యం తనమనోనేత్రంతో శ్రీనివాసుని చూచేవాడు. శ్రీనివాసుని మాటలు హృదయంలో వినే వాడు. తాను చూచేవానిపైన - తాను చూచినవానికి, తాను విన్నది సంకీర్తనచేసి వినిపించేవాడు. అది అన్నమయ్య నిత్యవ్రతం అన్నమయ్య జీవించిన 96 ఏండ్లలో 80 సంవత్సరాలు శ్రీ వేంకటేశ్వర సంకీర్తనాలు చేసి శ్రీ వేంకటేశ్వరసేవలో గడిపాడు. శ్రీనివాసునిపై శృంగారస కీర్తనలు చేశాడు. ఆధ్యాత్మసంకీర్తనలు కావించాడు.

"చందమామ రావో జాబిల్లి రావో
కుందనంపు పైడికోర వెన్నపాలు తేవో" అని అన్నమయ్య

పాడితే శ్రీవారు నైవేద్యంగా సమర్పించిన పాలు, వెన్న ఆప్యాయంగా ఆరగించేవారట. "జో అచ్యుతానంద జోజో ముకుందా - రావె పరమానంద రామగోవింద" అని అన్నమయ్య జోలపాట పాడితే స్వామివారు పసిబిడ్డడై హాయిగా పవ్వళించేవారట. అతని అధ్యాత్మ సంకీర్తనలు విని స్వామి వైరాగ్యవేంకటేశ్వరుడయ్యేవారట. అల

మేలుమంగ వైరాగ్యవేంకటేశ్వరుని చూచి దిగులుపడుతూంటే అన్నమయ్య శృంగారసంకీర్తన కావించేవాడట. వైరాగ్యవేంకటేశ్వరుడు మంచి ప్రాయపువాడై, శృంగారరాముడై, కొండలకోనేటి రాముడై అలమేలుమంగను అలరించేవాడట. అన్నమయ్య మహాభక్త్యావేశంతో స్వామివారి సంకీర్తనం చేసినప్పుడు శ్రీ వేంకటేశ్వరుడు ఆనందనృత్యం చేస్తూ ప్రత్యక్షమై అనుగ్రహించేవాడట. 'మామా! నాకు కల్యాణోత్సవం చేస్తూ మామవయ్యావు. నాకు సంకీర్తనకన్యలను అంకితం చేస్తూ మామ వయ్యావు. నీవూ, నీ సంతతి వారు పాడే సంకీర్తనలంటేనే నాకు ప్రీతి. ఇవి విన్న నేను అన్యుల గానం వినలేనయ్యా! మామా' అని శ్రీ వేంకటేశ్వరుడు అన్నమయ్యకు ప్రత్యక్షమై అభినందించేవాడట!

శృంగారమంజరి

"కొంచదు ప్రాణంబు గురుతుగాజేసి
యెంచదు వీణవాయించదు పరిణ
మించదు మదిసంభ్రమించదు చెలియ
కించుకేనియు నయించదుగాని
కప్పదు చనుదోయి కనుఱెవరెప్ప
విప్పదు తనప్రాణవిభుని మీఁది మనసు
ద్రిప్పదు మదిలోన దీకొన్నప్రేమ
చెప్పదెవరితోడ జెప్పునో కాని
పెట్టదుకస్తూరి పేరొక్కని చేతఁ
బట్టదు సేవంతిబంతి నెత్తమ్మి
ముట్టదు సిగ్గుల మొదలించుకైన
బుట్టదు తలపెందు బుట్టునో కాని"

శ్రీవేంకటేశ్వరునిపై మనసునిలిపిన మనువస్థితిని అన్నమయ్య తన 'శృంగారమంజరి' లో చిత్రించాడు. ఆమెను విరహావిషాదనిషా హామేషాగా రూపొందించాడు.

"చిట్టంబు చేతలసేదలు దీర్చి
చెదరినయలకల చిక్కులు దీర్చి
యెడలేని వలపులయింపు పుట్టించి
కళలమర్మంబుల కడగానుపించి
యాలింగనాది సౌఖ్యముల నందించి
కరగించి, మరగించి కలికిగావించి
యుడివోని సురతాబ్ధి నోలలాడించి
చిత్తసామ్రాజ్య సింహాసనమున
బాలికారత్నంబుగట్టి...."

శ్రీనివాసుడు ఆవిరహిణిని అనుగ్రహించాడు. మధురశృంగార క్రీడలలో ఆమెను ఆనందపరవశను కావించాడు. 'శృంగారమంజరిలోని' ఈ సన్నివేశాలు అన్నమయ్య మధురభక్తిని నిరూపించే ఉదాహరణలు.

శృంగారపదాలు

"పలుకుతేనెలతల్లి పవ్వళించెను
కలికితనముల విభుని కలసినదికాన"
"అలరులు కురియగ నాడెనదే
అలకల గులుకుల నలమేలు మంగ"
"అలమేలు మంగ నీ అభినవరూపము
జలజాక్షు కన్నులకు చవులిచ్చే వమ్మా"

అలమేలుమంగా శ్రీవేంకటేశ్వరుల మధురశృంగార సమాగమాలను, సుమధుర, మనోహర ప్రణయసన్నివేశాలను వర్ణిస్తూ, అత్

వర్ణిస్తూ అన్నమయ్య వేలాది శృంగారసంకీర్తనలు సంతరించాడు. మధుర భక్తిభావనతో తన్మయుడై గానం చేసికొన్నాడు.

"ఇన్నిరాసుల యునికి యింతి చెలువపురాశి
కన్నెనీరాశి కూటమి కలిగినరాశి
కలికిబొమవిండ్లుగల కాంతకును ధనురాశి
మెలయు మీనాక్షికిని మీనరాశి
కులుకుకుచకుంభములు కొమ్మకును కుంభరాశి
వెలుగుహరిమధ్యకును సింహరాశి
చిన్నిమకరారిపుబయ్యెద చేడకు మకరరాశి
కన్నెప్రాయపు సతికి కన్నెరాశి
వన్నెమైపైడి తులతూగు వనితకుందులరాశి
తిన్నని వాడిగోళ్ళసతికి వృశ్చికరాశి
ఆముకొను నొరపులమెరయు నతివకు వృషభరాశి
గామిడిగుట్టుమాటల సతికి కర్కాటకరాశి
కోమలపు చిగురుమోవి కోమలికి మేషరాశి
ప్రేమ వెంకటపతి కలిసెప్రియ మిథునరాశి"

మానవులంతా జన్మించేది పన్నెండురాశులలోనే. ఆపన్నెండు రాశులే మానవుల భవితవ్యాలను నిర్దేశిస్తాయి. అన్నమయ్య శాస్త్రీయమైన ఉత్తమజాతి స్త్రీలక్షణాలు, మేషాదిరాశులు సమన్వయమై అలమేలుమంగను ఆశ్రయించినట్లు భావనచేశాడు. పన్నెండురాశులలో జన్మించే మానవులను రక్షించే చల్లనితల్లిగా మంగమ్మతల్లిని సంభావించాడు. పన్నెండురాశులతో కలసిన అందాలరాశియైన ప్రియసతియైన అలమేలుమంగను ప్రేమమూర్తియైన వెంకటపతితో మిథునరాశిలో కలిపి నమస్కారంచేసి అన్నమయ్య తనశృంగార సంకీర్తనల రచనలో పరాకాష్ఠనందుకొన్నాడు. వానిరచనలోని పరమప్రయోజనాన్ని సాధించాడు. వేంకటపతిపై, అలమేలుమంగాంబికాసతిపై

శృంగారపదాలు చేసి, పాడకంలో తానే ఆద్యుడనని, తనను అధిగమించేవారు లేరని అన్నమయ్య నిరూపించుకొన్నాడు.

అధ్యాత్మసంకీర్తనలు

"నానాటిబదుకు నాటకము
కానకకన్నది కైవల్యము
పుట్టుటయు నిజము పోవుటయు నిజము
నట్టనడిమిపని నాటకము
యెట్టనెదుటఁగల దీ ప్రపంచము
కట్టఁగడపటిది కైవల్యము
కుడిచే దన్నము, కోక చుట్టెడిది
నడుమంత్రపుపని నాటకము
వొడిగట్టుకొనిన వుభయకర్మములు
గడిదాటినపుడె కైవల్యము
తెగదుపాపము తీరదు పుణ్యము
నగినగి కాలము నాటకము
యెగువనె శ్రీ వేంకటేశ్వరుఁ డేలిక
గగనము మీదిది కైవల్యము"

బ్రతుకునాటకం. కైవల్యం గగనం. ఈ నాటకనిర్మాత, ఆ కైవల్యప్రదాత శ్రీ వేంకటపతి. ఇది మనకు అన్నమయ్య చెప్పిననీతి. ఇది ఆ అన్నమయ్య అధ్యాత్మసంకీర్తనంలోని సారం. పాడుకుంటూ వేడుకొంటే అగపడి శ్రీ వేంకటేశ్వరుడు ఆ మానవుణ్ణి కాపాడుతాడు. అది కోరవడిన మానుషజన్మ ఎత్తినఫలం మేముంది అని మనకు హితవు చెప్తున్నాడు అన్నమయ్య.

"ఎక్కడి మానుషజన్మంబెత్తిన ఫలమేమున్నది
నిక్కము నిన్నేనమ్మితి నీచిత్తంబికను....

మరువను ఆహారంబును, మరువను సంసారసుఖము
మరువను ఇంద్రియభోగము - మాధవనీమాయ
తగిలెద బహులంపటముల తగిలెదబహుబంధంబుల
తగులను మోక్షపుమార్గము, తలపున యెంతైనా"

"భావములోనా బాహ్యమునందును
గోవింద గోవింద యని కొలువవో మనసా
హరి యవతారములే యఖిలదేవతలు
హరిలోనివే బ్రహ్మాండంబులు
హరినామములే అన్నిమంత్రములు
హరిహరిహరిహరి యనవో మనసా
విష్ణుని మహిమలే విహితకర్మములు
విష్ణుని పొగడెడి వేదంబులు
విష్ణుడొక్కడే విశ్వాంతరాత్ముడు
విష్ణువు విష్ణువని వెదకవో మనసా
అచ్యుతుడితడే ఆదియునంత్యము
అచ్యుతుడే యసురాంతకుడు
అచ్యుతుడు వెంకటాద్రి మీదనిదె
అచ్యుత అచ్యుత శరణనవో మనసా"

దీనిలో వేంకటేశ్వరనామసంకీర్తనంతో, శ్రీ వేంకటేశ్వర చరణాలకు శరణు పొందమని మన మనస్సులకు పట్టేలాగ ఉపదేశించాడు అన్నమయ్య.

"యం శైవాస్సముపాసతే శివఇతి! బ్రహ్మేతి వేదాంతినో
బౌద్ధా బుద్ధఇతి! ప్రమాణపటవః కర్తేతి నైయాయికా
అర్హన్ ఇత్యథ జైనశాసనరతాః! కర్మేతి మీమాంసకాః!
సోయం నో విదధాతు వాంఛితఫలం శ్రీ దేవకీనందనః

మాలాబర్హ మనోజ్ఞకుంతలభరా వన్యంప్రసూనేక్షితాం
శైలేయ ద్రవక్లృప్త చిత్ర తిలకాం శశ్వన్ మనోహారిణీం
లీలావేణు రవామృతైక రసికాం లావణ్యలక్ష్మీ మయీం
బాలాం బాలతమాల నీలవపుషాం వందే పరాందేవతాం

లావణ్య వీచీ రచితాంగ భూషాం
భూషా పదారోహిత పుణ్యబర్హాం
కారుణ్య ధారాళ కటాక్ష మాలాం
బాలాంభజే వల్లవవంశ లక్ష్మీం"

— లీలాశుకుడు

లీలాశుకుడు కృష్ణుడు ఆదిశక్తిగూర్చి చెప్పిన శ్లోకాలు ఇవి. ఊరు, పేరు, రూపంలేనివాడే అసలు దేవుడు. భక్తులకోసం క్షేత్రాలలో వెలసి నామాలు, రూపాలు ధరించాడు. ఏడుకొండలవాడు యే పేరుతో పిలిచినా పలుకుతాడు. అతడే వేయినామాల వెన్నుడు. పది అవతారాలు ఎత్తినవాడు అతడే! ఆదిమూలుడూ, ఆదినాథుడూ, ఆది మధ్యాంతరహితుడూ వడ్డికాసులప్రభుడే! ఏడుకొండలప్రభుడే! అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుణ్ణి సర్వదేవతాస్వరూపుడని - సర్వ దేవతా సార్వభౌముడని సంభావించాడు. ఆ భావనను తనసంకీర్తనలో రూపకల్పన చేశాడు. ఇదిగో చూడండి.

"బ్రువంతి బౌద్ధా బుద్ధ ఇతి
స్తువంతి భక్త్యాస్సులభ ఇతి
గదంతి కిల సాంఖ్యా స్త్వాం పురుషం
పదవాక్యజ్ఞా! పదమితి చ!
విదంతి త్వా వేదాంతినస్సదా
బ్రహ్మం సత్వర మితి చ
జపంతి మీమాంస కాస్త్వాం చ

విపుల కర్మణో విభవ ఇతి
లవంతి నయ సకలా స్సతతం
కృపాభుకర్తా కేవల మితిచ
భణంతి వేంకట పతయే మునయో
అణిమాది పదం అతుల మితి
గుణవంతం నిర్గుణం పునరితి
గృణంతి సర్వే కేవల మితిచ"

అన్నమయ్య ఈ సంస్కృతసంకీర్తనను తెలుగులో 'ఎంత మాత్రమున నెవ్వరు దలచిన నంతమాత్రమే నీవు అంతరాంతరము లెంచిచూడ పిండంతే నిప్పటియన్నట్లు' అంటూ దానిభావం ప్రకటించాడు.

## అన్నమయ్యపాటలు – లోకకల్యాణానికి బాటలు

భర్తృహరి ప్రకటించిన నీతి, శృంగార, వైరాగ్యశతకాల ప్రయోజనం, పరమార్థం కేవలం అభిరాస్యులకు, విద్యావంతులకు మాత్రమే పరిమితమైంది. ప్రబంధప్రక్రియలోగాక నిబంధప్రక్రియలో అన్నమయ్య ఆపాతమధురమైన సంగీతంతో సమ్మేళనంచేసి ఆలోచనామృతాన్ని ఆంధ్రులకు జగన్మోహినీ అవతారస్వరూపుడై పంచాడు. తేట తేట తెలుగుమాటలతో కూడిన తేనెఊటలు అన్నమయ్య పాటలు. అవి అచ్చమైన తెలుగువాని భక్తిపరిమళాలు ప్రసరింపజేసే పూలతోటలు. వాడని,వాసనవీడని తెలుగుతోటలోని నవపారిజాతాలు అన్నమయ్య పాటలు. అవి భక్తికి ఆలవాలాలు. అవి కలియుగ వైకుంఠానికి సోపానాలు. శ్రీ వేంకటేశ్వరుని వరాలమూటలు అన్నమయ్యపాటలు. ఆ పాటలు లోకకల్యాణానికి బాటలు.

"సురలకు నరులకు సొరిది వినవిన
అరుదు తాళ్ళపాక అన్నమయ్యపదములు
చెక్కెరలై చవిచూపే జాలై తావి చల్లీ
నక్కజపుమాతు వజ్రాలై మెఱసేని
నిక్కుటద్దములై మానిఱనుడిలు చూపీ
నక్కర తాళపా కాన్నమయ్య పదములు
పన్నీరై పైబూసీఁ గప్రంబై చలువ రేచీ
మిన్నగల ముత్యములై మెయినిండేని
వెన్నబలములై మా వెంట వెంటఁ దిరిగీని
అన్నిట తాళ్ళపాక అన్నమయ్య పదములు
నెట్టన వేదాంతములై నిత్యములై పొడచూపే
పుట్టుతోనె గురువులై బోధించీని
గట్టివరాలిచ్చే శ్రీ వేంకటనాథుని మెప్పించీ
నట్టె తాళ్ళపాక అన్నమయ్య పదములు"

— చిన్న తిరుమలాచార్యులు

"లక్షణములు పదకవితా
రక్షణములు వివిధకుకవి రాజీమదస
మోక్షణములు వేంకటపతి
వీక్షణములు తాళ్ళపాక విభుసత్కవితల్.

శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞానసారంబులై
యతిలోకాగమవీథులై విపుల మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైల వల్లభ రతిక్రీడారహస్యంబులై
నుతులై తాళ్ళపాకయన్నయ వచో నూత్నక్రియల్ చెన్నగున్.

"పావనములు హరిభక్తివి
భావనములు సర్వమంత్ర పరమరహస్యో

ద్భావనములు గాయకనిక
రావనములు తాళ్ళపాక యన్నయపదముల్''
— చిన తిరుమలాచార్యులు

"తేనెలపై తేట తిన్నని చెఱకు
పానకముల నేరుపఱచిన మేలు
చక్కెరలో తీపు చల్లఁదెమ్మెరలు
చిక్కని కపురంబు జీవరత్నములు

కలయమృతంబు మీఁగడిమీఁది చవులు .... .... .... ....

చిలుకుచు'' 'బహుదేశవిహారాలు', 'వాణీవీణానాదాలు', శ్రీ వేంకటే శ్వరవరాలైన తనసంకీర్తనలను అన్నమయ్య గానం చేసేవాడు.'ఎక్కడ నాభక్తుడు గానం చేస్తాడో నేను అక్కడఉంటాను అన్నాడు భగ వానుడు' ఇది నారదభక్తి సూత్రాలలో ప్రధానమైన సూత్రం. అన్న మయ్యగానం ఈసూత్రానికి భాష్యం. అన్నమయ్య శ్రీ వేంకటేశ్వర సంకీర్తన విన్న సుప్రసిద్ధ కన్నడవాగ్గేయకారుడు, పాండురంగవిట్ఠల భక్తుడైన పురంధరదాసు అన్నమయ్యను శ్రీ వేంకటేశ్వర అవతారం అని ప్రస్తుతించాడు. పన్నిద్దరాళ్వారులు రచించిన 4,000 పాటలున్న 'నా లాయిరం'ను 'ద్రావిడవేదం' అంటున్నారు. అన్నమయ్య ఒక్కడే ముప్పదిరెండువేల పాటలు శ్రీనివాసునిపై రచించి గానం చేసాడు. నేడు మనకు పోగా మిగిలినవి సుమారు 10,000 అన్నమయ్య సంకీర్తనలు ఉన్నాయి. ద్రావిడవేదంలోని పాటలకన్న ఎనిమిదిరెట్లు పాటలు వ్రాశాడు. ద్రావిడవేదంకన్న సుమారు మూడురెట్ల పాటలు మిగిలాయి. అన్నమయ్య సంకీర్తనం సముదాయం నిజంగా 'ఆంధ్ర వేదమే'!

## ఒక్క సంకీర్తనే చాలు....

"దేవుడా నాదేహమే నీకు తిరుమలగిరి పట్టణము
భావింప నాహృదయకమలమె బంగారు ప్రమేడ

వేవేలు విజ్ఞానాదులు వేడుక పరిచారికలు
శ్రీవల్లభా యిందులో నితరచింతలు వెట్టకులే
పరమాత్మా నామనసె బహురత్నంబుల మంచంబు

... .... .... ....

ననిచిననావూరువులే నీకు నారదాదుల పాటలు
వినయపు నాభక్తియే నీకును వినోదమగుపాత్రి"

ఇట్టి ఆత్మార్పణభావంతో, శరణాగతి బుద్ధితో అన్నమయ్య నిత్యం ఒకసంకీర్తన తక్కువగాకుండా ముప్పది రెండువేల సంకీర్తనలు శ్రీవేంకటేశ్వరునిపై చేసి గానంచేశాడు. అన్నమయ్య ఒకమహాసంస్థ-వ్యక్తి కాదు. అతడొక మహావ్యవస్థగా నిలిచిపోయాడు. ఆమహాసంస్థలో మానవాళికి సుఖం, శాంతి ఉంది. మానవుల ఆశలు, ఆకాంక్షలు, ఆదర్శాలు ఫలవంతంచేసే సంస్థ అది. శ్రీవేంకటేశ్వరభక్తుల ఉజ్వల భవిష్యత్తుకు ఉత్తమపథకాలు అందులో ఉన్నాయి. తన ముప్పది రెండువేల సంకీర్తనలతో నేటి హుండీకి ఎదురుగా రామానుజుని సన్నిధికి సమీపంలో ఆ శ్రీ భాండారం నెలకొల్పాడు. అన్నమయ్యను మహాసంస్థను చేసింది ఆ శ్రీభాండారమే! ఆ శ్రీభాండాగారం నెలకొల్పుతూ శ్రీనివాసునకు ఏమని నివేదించుకొంటున్నాడో వినండి.

"దాచుకో నీపాదాలకు దగనే చేసినపూజలివి
పూచి నీకీరితి రూపుపుష్పములివి యయ్యా
ఒక్కసంకీర్తనే చాలు ఒద్దికై నన్ను రక్షించగ
తక్కినవి భండాగాన దాచివుండనీ
వెక్కసమగు నీనామము వెలసులభము ఫలమధికము
దిక్కై నన్నేలితివింక నవితీరని నాధనమయ్యా!
నానాలికపైనుండి నానా సంకీర్తనలు

పూచి నాచే నిను పాడించితివి
వే నామాల వెన్నుడా వినుతించ నెంతవాడ
కానిమ్మని నాకీపుణ్యము గట్టితివింతే యయ్యా!
ఈమాట గర్వముగాదు నీమహిమే కొనియాడితిగాని
చేముంచి నాస్వాతంత్రము చెప్పినవాడగాను
నేమానఁ బాడేవాడను నేరము లెంచకు మీా
శ్రీమాధవ శ్రీనివాసుడ శ్రీవేంకటేశుడవయ్యా''

శ్రీనివాసునకు తన ముప్పదిరెండు వేల సంకీర్తనకుసుమాలతో పాదపూజలు కావించుకొన్న ధన్యుడు అన్నమయ్య. అన్నమయ్య తనవరిసుతుడైన పెదతిరుమలాచార్యుని పిలిచి ''సరిలేనిదిదియపో సంకీర్తనం— సరుస వేంకటవిభుని సంకీర్తనం.' నేను ఏ వేంకటవిభుని సంకీర్తనం నిత్యం వ్రతంగాచేసానో నువ్వు దాన్ని కొనసాగించాలి. ఇదే నా చివరికోరిక.'' అని ఆజ్ఞాపించాడు. పెదతిరుమలాచార్యుడు ''మీా సంగీతసారస్వతాలకు, మీాభక్తికి, మీావాగ్గేయకారకత్వానికి ఉత్తమ వారసుడనై నిత్యం శ్రీనివాససంకీర్తనం చేస్తాను.'' అని తండ్రికిమాట ఇచ్చాడు. ఆ చల్లనిమాటవిన్న అన్నమయ్య తనకాలిగజ్జెలు, చిరుతలు, దండె పెదతిరుమలయ్యకిచ్చి తృప్తిగా శ్రీనివాసుని కొలువులో గానం చేయడానికి శాశ్వతంగా వెళ్ళిపోయాడు. దుందుభిసంవత్సర ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు అంటే 23-2-1503 తేదీన శ్రీనివాసునిలో లీనమయ్యాడు.

## తాళ్ళపాక నరసింహకవి

తిమ్మక్క— అన్నమయ్య పెద్దభార్య. అన్నమయ్య ఆదివాగ్గేయకారుడు. తిమ్మక్క— తొలి తెలుగుకవయిత్రి. మంజరీద్విపదలో ''సుభద్రా

కల్యాణం' రచించింది. తన 'సుభద్రాకల్యాణం' లో నన్నయ అర్జును నిచే చేయించని తిరుమలయాత్ర చేయించి తిరుమలేశునిపట్ల గల తన సహజభక్తి ప్రపత్తులు చాటుకొంది. పదకవితాపితామహుడైన అన్న మయ్య, విదుషీమణి, ప్రథమ ఆంధ్రమహిళారచయిత్రియైన తిమ్మక్క లకు జన్మించిన ప్రథమపుత్రుడు నరసింహకవి.

"చిన్నన్న ద్విపద కెఱగును
పన్నుగ బెదతిరుమలయ్య పదమున కెఱగున్
మిన్నంది మొరసె నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్యశ్రేణిన్"

"పాడగ చెప్పగ వర్ణపద్ధతి నీడుజోడు లేడన సభజొచ్చి వాదించి పరగినధీశాలి ప్రతివాదిగై [illegible] నరసింహుడనగల్గె నరసింహ గురుడు" అని చిన్నన్న 'అష్టమహిష [illegible]ల్యాణం' లో తాళ్ళపాక నర సింహకవినిగూర్చి ప్రస్తుతించాడు. 'కవి[illegible]ాయన' కర్త నరసింగన్నయే తాళ్ళపాక నరసింగన్న కావచ్చునని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించారు. జీవితంలో విరక్తుడై శ్రీరంగం చేరి శ్రీరంగనాథుని సేవలో చివరరోజులు గడపిన ధన్యుడు తాళ్ళపాక నరసింహకవి. 1450, 1540 మధ్యవాడు నరసింహకవి.

పెదతిరుమలాచారి

అక్కలాంబ, అన్నమయ్యల కుమారుడు పెదతిరుమలా చార్యుడు. ఇతడు అన్నమయ్య రెండవ కుమారుడు. తండ్రికి ఇతడు చనవరిసుతుడు. ఇతడు 1460–1547 మధ్య జీవించాడు. తిరుమలకోవె లలో శ్రీవేంకటేశ్వరునకు ఇతడు ద్వితీయసంకీర్తనాచార్యుడు. అన్న మయ్య ప్రథమసంకీర్తనాచార్యుడు. తండ్రికి తగిన తనయుడు, ఉత్తమ వారసుడు పెదతిరుమలాచార్యుడు. తండ్రి అన్నమయ్యవలె శ్రీ భాండా

రమువద్ద తన ప్రతిమామూర్తిని స్థాపింపజేసికొనే ఔన్నత్యం సంపాదించిన సుప్రసిద్ధ వాగ్గేయకారుడు పెద తిరుమలాచార్యుడు. ఇతడు సాళువ నరసింహరాయలు, తుళువ నరసరాయలు, శ్రీకృష్ణదేవరాయలకు సమకాలికుడు. అచ్యుతదేవరాయలకు ఆప్తమిత్రుడు. పెద తిరుమలయ్య శ్రీనివాసునకు అనుగ్రహపాత్రుడైన మహాభక్తుడు. అతని భక్తికి మెచ్చి, 'మూడు పురుషాంతరాలవరకు ప్రత్యక్షమవుతాను. ఏడు పురుషాంతరాలవరకు మోక్షమిస్తాను' అని శ్రీనివాసుడు వరమిచ్చాడు. తన సంకీర్తనంతో నిత్యం శ్రీ వేంకటేశ్వరస్వామిని ప్రత్యక్షం కావించుకొన్న మహాభక్తాగ్రేసరుడు పెద తిరుమలాచార్యుడు.

మ హి మ లు

శ్రీనివాసుని లీలలను, మహిమలను, విభూతులను జీవితంలో ప్రత్యక్షంగా అనుభవించిన మహాపురుషుడు, మహానుభావుడితడు. పెద తిరుమలాచార్యుడు ఒకసారి మండెముకోట వెళ్ళాడు. అక్కడున్న మండలాధిపతి నరసనాయకుడు ఇతని మెడపైకి కత్తి విసిరాడు. శ్రీనివాస విలాసంవల్ల ఆ కరవాలం పూలమాలయై అతని గళసీమను అలంకరించింది.

"మండెముకోటలో మండలం బెరుగ
మండలాగ్రాహతి మహనీయపువ్వు
దామమై ధర్మాంగదస్థితి పొలిచె
ఏ మహనీయుని అహీన గాత్రమున"

తండ్రిమహిమనుగూర్చి నాలుగవతరమూరుడైన చిన్నన్న తన 'అన్నమాచార్య' చరిత్రలో తెలిపినమాటలివి. కత్తి కలువదండమై తన మెడను అలంకరించిన సంగతిని పెద తిరుమలాచార్యుడు తనసంకీర్తనంలో తెలుపుకొన్నాడు.

"నాటికి నాడు క్రొత్త నేటికి నేడు క్రొత్త
నాటకపు దైవము నమోనమో
సిరుల రుక్మాంగదు చేతికత్తి ధారతొల్లి
వసుధ ధర్మాంగదుపై వనమాలాయు
హరి నీకృప కలిపినట్లనే అరులచే
కరఖడ్గ ధార నాకు కలువదండాయు
ఘనఖడ్గ ధార నాకు కస్తూరిబాటాయ
అలర శ్రీ వేంకటేశ ఆపదలన్నియు బాపి
యిల నన్ను గాచినది మొన్నకత లాయ"

"కరము జీడిపులుసు కలిగిన మామిడికరము సోకిన యంతనే
సరవి చక్కెరవలె చవి కలిగించువాని చనవరి సుతుడితడే
వే కరిమండెము కోట వెళ్ళితా విచ్చన విడిరాగా నొక
వీకతో వేసిన కత్తి తునకలాయ వెనుసోకిన యంతనే
గుములు కూడి యలుగులు తిరుగ బాటి చుట్టుకొన్న కురుదోవనతడు
కమలనయనుని దలచిన మాత్రాన శకపికలై పాటెను
దేవుడొక కన్ను దయచేసి తనవద్దకునంపిన నతడు
పావనుండితడు తానొక్క కన్నిచ్చె పరుషులు చూడగా
శ్రీ వేంకటప్పని సేవ జేయుగోరి చేకొన్న తను వితడు
భావించి పొగడరే భాగ్యముల తాళ్ళపాక తిరుమలయ్యను"

— శేషాచార్యులవారి వ్రాత ప్రతినుండి ఉదాహృతము
— అన్నమాచార్య చరిత్రపీఠిక

తండ్రి అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరానుగ్రహంతో మహిమలు చూపినట్లే పెద తిరుమలాచార్యుడు అనేకమహిమలు ప్రకటించాడు. పై సంకీర్తనలో వర్ణింపబడిన మహిమలు ప్రదర్శించిన ఘనచరిత్రుడు పెద తిరుమలాచార్యవర్యుడు.

## ర చ న లు

1. శ్రీ వేంకటేశ్వర ప్రభాత స్తవము
   (మేలికొలుపు ద్విపద)
2. వేంకటేశ్వర వచనములు
3. శృంగారదండకము
4. చక్రివాళ మంజరి
5. శృంగారవృత్త శతకము
6. వేంకటేశ్వరోదాహరణము
7. నీతిసీస శతకము
8. సుదర్శన రగడ
9. రేఫ అకారనిర్ణయము — శ్రీకృష్ణశతకము
10. భగవద్గీత తెలుగువచనము (అనువాదము)
    ఆంధ్ర వేదాంతము
11. ద్విపద హరివంశము
12. సంకీర్తనలక్షణవ్యాఖ్య
13. శ్రీ వేంకటేశ్వరునిపై శృంగారసంకీర్తనలు
14. శ్రీ వేంకటేశ్వరునిపై ఆధ్యాత్మసంకీర్తనలు.

### 'ప్రభాత స్తవం' – 'కల్యాణకగాథ'

పెద తిరుమలాచార్యుడు కావించిన ఈ పదునాలుగు రచనలలో అత్యధికసంఖ్యాకములైన రచనలు శ్రీ వేంకటేశ్వరభక్తిని ప్రకటిస్తున్నాయి. శ్రీ వేంకటేశ్వర ప్రభాత స్తవం శ్రీనివాసుని సన్నిధానంలో పెద తిరుమలాచార్యుడు నిత్యం గానం చేసేవాడు. ఆ విధంగా శ్రీవారికి మేలికొలుపు కావించేవాడు.

"శ్రీకర! వేంకటక్షితిధరావాస !
నాకేంద్రనుత రమానాథ మేల్కొనుము"

ఈవిధంగా భక్తితన్మయత్వంతో శ్రీనివాసుని మేల్కొలుపు తాడు.

"పికులగలిసిన వెలిదమ్మికన్ను
గోనలనమృతంబు గురియ మేల్కాంచి
కోరినవారికి కోర్కు లీడేర
నీరీతి జగముల నేలుచు నుండు"

దీనిలో శ్రీకృష్ణుని జీవితాంశాలు ప్రస్తావిస్తూ 'మేల్కొనుము' అనేమాట నుంటిమాటికి వాడాడు. శ్రీవేంకటేశ్వరుని దివ్యవైభవం దీనిలో పుష్కలంగా ఆవిష్కరింపబడింది. దీన్ని పఠించడంవల్ల మన ఆత్మలను పరమాత్మయైన శ్రీవేంకటేశ్వరునిలోనికి మేల్కొల్పగలుగు తాము. శ్రీవారికి తాళ్ళపాకవారు నిర్వహించే వైవాహికోత్సవం చేసే సమయంలో పాడడానికై పద్మావతీ శ్రీనివాసుల ప్రణయకథను, పరిణయగాథను చక్రవాళ మంజరిగా పెదతిరుమలాచార్యుడు సంతరించాడు. ఆ కల్యాణమూర్తుల కల్యాణవైభవం లోకకల్యాణప్రదం అని ప్రకటిస్తుంది చక్రవాళమంజరి. శృంగారదండకం ఇతని మరియొక రచన. దీనిలోని యితివృత్తం చక్రవాళ మంజరిలోని యితివృత్తం ఒకటే. ఈ రెండు రచనలు ముక్తపదగ్రస్తాలంకారాలతో నిండి ఉన్నాయి. పద్మావతీ శ్రీనివాసులపట్ల తనకుగల అనన్యసామాన్యమైన భక్తిని పెదతిరుమలాచార్యుడు ఈరెండు రచనలలో మిక్కుటంగా ప్రకటించుకొన్నాడు. ఇవి శ్రీవెంకటేశ్వరభక్తిపారవశ్యం పఠితలకు ప్రసాదిస్తున్నాయి.

శతకాలు

ఆంధ్రశతకసాహిత్యంలో పెదతిరుమలాచార్యుని శతకాలు ఉన్నతస్థానం ఆక్రమిస్తాయి. శృంగారవృత్తశతకం, నీతిసీసశతకం, శ్రీకృష్ణశతకం (రేఫ అకారనిర్ణయం) వంటి శతకాలు, శ్రీవేంకటేశ్వరోదాహరణం, సుదర్శనరగడవంటి లఘుకృతులు అతని భక్తిని, పాండిత్యాన్ని, లాక్షణికప్రతిభను వ్యక్తం చేస్తున్నాయి. తనను నాయికగాను, శ్రీనివాసుని నాయకునిగాను భావించి జీవాత్మ పరమాత్మల కలయికలోని అనుభవాన్ని శృంగారవృత్త శతకంలో పెద తిరుమలాచార్యుడు అందించాడు.

"(శ్రీ)రమణీమణీప్రదమజీవన జీవనవాస వాసవా
దార విశేష శేషవసుధాధరనాథ విహారహారకే
యూర విరాజిరాజిత మహోన్నత దేవ భుజంగజంగమ
స్మేర వికల్పకల్పకమ మిమ్ము నుతించెద వేంకటేశ్వరా!"

శతకారంభ పద్యమే ఇంతరమణీయంగా ప్రారంభమై పతితను శ్రీనివాసునికి నాయికగా మారుస్తుంది. భక్తితన్మయత్వంలో ఓలలాడిస్తుంది.

"(శ్రీ) దేవియురమున శిరసునఁ దులసి భూ
కాంత వీపునఁ బదాగ్రమున గంగ
కమలాసనుడు నాభిఁ గాముండు మనసున
సవ్యవామాక్షుల శశియు రవియు
ధ్వజమున గరుడుండు తపసులకాంతల
సకలవాయువులు నాసాపుటముల
జగములు కుక్షిని జలధగులు తరులందు
ఘనరోమములు దేవగణముల్లెల్ల

గలిగిశోభిల్లు నీమూర్తిఁదలచి నీకు
నీసశతకంబు చెప్పెదఁ జిత్తగింపు
కలితలక్ష్మీశ! సర్వజగన్నివేశ!
విమలకోటి సంకాశ! వేంకటేశ!"

"కలితలక్ష్మీశ! సర్వజగన్నివేశ! విమలకోటి సంకాశ! వేంకటేశ! "అన్నమకుటంతో పెదతిరుమలాచార్యుడు నీతిసీసపద్యశతకం చెప్పాడు. దానిలో లోకనీతి, రాజనీతి, సంఘనీతి, వ్యక్తిపాటించవలసిన నీతి మనోజ్ఞంగా ప్రతిపాదించాడు. ఇతడు సమకూర్చిన శ్రీకృష్ణశతకంలో శేషఆకారనిర్ణయం ప్రతిపాదిస్తూ మొదటిలక్షణశతకంగా దీన్ని రూపొందించాడు.

"శ్రీవేంకటేశ నీకుంగావించెద నంకితంబుగాతాారేఫల్
వావిరి నేర్పఱచిన కృతి శ్రీవనితానాథరామ చేకొను కృష్ణా"
అంటూ శ్రీకృష్ణశతకాన్ని తన ఇతరశతకాలతో పాటు అతడు శ్రీవేంకటేశుని పాదాలకు అంకితం కావించాడు.

## సుదర్శన రగడ

చిత్రమధురకవితా శాఖలకు చెందిన రగడలు ఆంధ్ర, కర్ణాటక సాహిత్యవీథులలో మణితోరణాలుగా ప్రకాశించాయి. ఆంధ్ర సాహిత్యంలో శైవ, వైష్ణవాలను ప్రచురపరచడానికి 'రగడల' ను ఆ యాకవులు వినియోగించుకొన్నారు. ఆంధ్రభాషలోని 'రగడరచనల'లో పెదతిరుమలాచార్యుని 'సుదర్శనరగడ' ఒక ప్రత్యేకస్థానం అలంకరించింది. సుదర్శనవైభవం 59 రగడలలో, 108 పంక్తులలో వర్ణితమైంది. శ్రీహరి ధరించే పంచాయుధాలలో 'సుదర్శనచక్రం' ముఖ్యమైంది. హరివంశం, భాగవతం సుదర్శనచక్రపు మహిమను వర్ణించాయి. అన్నమయ్య పలుతావులలో దీన్నిగూర్చి వర్ణించాడు. ఒకసంకీర్తనలో 'చక్రం' గూర్చి విపులంగా గానంచేశాడు.

"నమో నమో దానవవినాశ చక్రమా
సమరవిజయమైన సర్వేశు చక్రమా
అష్టదశ పదారుభుజాల నమరిన చక్రమా
పట్టిన ఆయుధముల బలు చక్రమా
నెట్టిన మూడుగన్నుల నిలచిన చక్రమా
అట్టుగా మన్నించవె మెఱయుచు చక్రమా
అరయ ఆనుకోణాల నమరిన చక్రమా
ధారలు వేయిటి తోడి తగు చక్రమా
ఆరక మీదికి వెళ్లే అగ్నిశిలల చక్రమా
గారవాన నీ దాసులఁ గావవే చక్రమా
రవి చంద్రకోటి తేజోరాశియైన చక్రమా
దివిజసేవితమైన దివ్య చక్రమా
తవిలి శ్రీవేంకటేశు దక్షిణకర చక్రమా
యివల నీ దాసులము యేలుకోవే చక్రమా

— అన్నమాచార్యుని సంకీర్తన

"ఓం కారాక్షరయుక్తము చక్రము
సాంక మధ్య వలయాంతర చక్రము
శతమఖ ఖండన చతురము చక్రము
కఠినపవినికర కల్పిత చక్రము
కాలదండ శతకాండము చక్రము
జ్వాలానల ముఖశౌర్యము చక్రము
విస్ఫులింగ చయవిభ్రమ చక్రము
సాస్ఫాలిత భుజహారము చక్రము
భద్రగజ ప్రభుపాలన చక్రము
రుద్రైకాదశ రూపము చక్రము

మిథ్యావాద తిమిరహార చక్రము
తథ్యానుస్మృత సంతర్పిత చక్రము
వేయివిధంబుల వెలసిన చక్రము
వేయంచులుగల విశ్వపుఁ జక్రము
భావించు సుజనపాలన చక్రము
శ్రీవేంకటపతి చేతిది చక్రము"

పెదతిరుమలాచార్యుని 'సుదర్శనరగడ' రచన సుదర్శనమహిమను వర్ణిస్తూ, అన్నమయ్య సుదర్శనసంకీర్తనకు మెరుగులు పెడుతూ సాగింది. తండ్రి, తనయుల ఈరచనలు పరిశీలించినవారికి వారుసుదర్శ చక్రోపాసకులేమో అనిపించి తీరుతుంది. వీనిని మననం చేసికొనేవారికి సుదర్శనచక్రోపాసనాఫలం, ప్రయోజనం సిద్ధిస్తాయి.

## శ్రీవేంకటేశ్వరోదాహరణం

"ఆ రవి తా రకంబుగ నుదహారణంబు రచించె భక్తి వి
స్తారతఁ దాళ్ళపాకపుర శాసను డన్నయ తిమ్మనార్యుఁ డిం
పారగఁ జక్రినందకగదాంబుజధారికి శ్రీ వధూమనో
హారికి వేంకటాచలవిహారికి శౌరికి నంకితంబుగన్"

పెద తిరుమలాచార్యులు శ్రీ వేంకటేశ్వరోదాహరణము అనే లఘుకృతి రచించి శ్రీ వేంకటేశ్వరస్వామికి అంకితం కావించాడు. పాల్కురికి సోమనాథుడు సంస్కృతాంధ్ర ఉదాహరణ వాఙ్మయశాఖకు శ్రీకారం చుట్టాడు. తెలుగులోని తొలిఉదాహరణం అతని బసవోదాహరణం. శ్రీకారంతో ప్రారంభమై, సంబోధనతో కలిసి, ఎనిమిది విభక్తులకు కలిపి ఇరవైనాలుగు పద్యాలు, అన్నివిభక్తులకు, అంకితానికి ఒక్కొక్క పద్యంవంతున మొత్తం 26 పద్యాలు ఉండే లఘుకావ్యం ఉదాహరణం. "అన్ని విభక్తులతో పరమేశ్వరుని చెప్పినప్పుడు

భగవంతుడు సర్వక్రియాస్థాన భూతుడవుతాడు. ఇది యుదహరణకావ్య రహస్యము" అన్నారు విశ్వనాథవారు. తెలుగులో వెలసి ఉదాహరణాలలో పెదతిరుమలాచార్యుని 'శ్రీ వేంకటేశ్వరోదాహరణం' మూడవది. రచనావిశేషంలో అతిముఖ్యమైంది. ఇట్టి అపూర్వమైన లాక్షణికరచనాసంవిధానంలో శ్రీ వేంకటేశ్వరోదాహరణం రచించి పెద తిరుమలాచార్యుడు శ్రీ వేంకటేశ్వరునిపై తనకుగల అనన్య భక్తిని వెల్లడించుకొన్నాడు. ఇతడు ద్విపదలో 'హరివంశం' రచించాడు. అది నేడు లభ్యం కావడంలేదు. తండ్రి అన్నమయ్య రచించిన 'సంకీర్తన లక్షణాని'కి ఇతడు వ్యాఖ్య సంతరించాడు. అదీ నేడు లభ్యంకావడం లేదు. సరళసుందరమైన, సులభమనోహరమైన తెలుగువచనంలో భగవద్గీత అందించాడు. దీనికే ఆంధ్రవేదాంతమని పేరు. విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని అనుసరించి దీనికి వ్యాఖ్యానం రూపొందించాడు. ఇతను సన్యాసాశ్రమనామం వెంకటపతియోగిట. సన్యాసాశ్రమం స్వీకరించిన తరువాత శ్రీకృష్ణశతకం, భగవద్గీతవచనం రచించాడని కొందరు భావిస్తున్నారు. ఇతని ఉపదేశగురువులు కందాడ అప్పలాచార్యులవారు.

## శ్రీ వేంకటేశ్వర వచనములు

పెద తిరుమలాచార్యుని మిగతారచనలన్నీ ఒక ఎత్తు. వేంకటేశ్వర వచనములు, శ్రీ వేంకటేశ్వరునిపై కావించిన శృంగార సంకీర్తనలు, అధ్యాత్మసంకీర్తనలు ఒక ఎత్తు. అవి అతనిరచనలలో మేలిజాతి రత్నాలు. అతడు శ్రీ వేంకటేశ్వరునకు అర్పించిన దివ్యాభరణాలు 'శ్రీ వేంకటేశ్వర వచనాలు'. శ్రీ వేంకటేశ్వరభక్తులకు లభించిన శ్రీ వేంకటేశ్వరుని ఆశీర్వచనాలు.

"నీవు చక్కనిమూర్తివి గావున నీవిగ్రహంబు నాయింటిలోపల నిడుకొని నావేడుకలకు దేవరంగా కొల్చితిని" అని పెద తిరుమ

లయ్యా తిరుపతి దేవునకు నివేదించుకొన్నాడు. 'నీ వాక్కు-భక్తిచేతనే సాధ్యుండవు,' 'నీ దాస్యమే మానంబు నీమూర్తిని సేవించుటే సదాను భవంబు', 'నీకంటె నీదాసు లధికులౌట తేటబడె,' 'మీ దాసానుదాసు లకు సేవకుండనవ్వాడ. మీ దాసీజనంబులకు నిప్పమానెద. నీలెంక లకు లెంకతనంబునకు చొచ్చి ముచ్చువేసుకొనియెద' అని శ్రీ వేంకటే శ్వర సేవాదీక్షను స్వీకరించాడు. శ్రీనివాసునకు ఆత్మార్పణం చేసి కొన్నాడు. స్వామికి దాసుడయ్యాడు. స్వామివారి దాసులకు దాసాను దాసుడయ్యాడు.

'నిన్ను మెచ్చి నీకేమి యొసగెదము? నిన్ను బొగడుటే మాచేత నైనపని' అని భావించాడు. "మీయంత మీరె నన్ను మన్నించి విచ్చేయుదురో యని మీ శ్రీపాదపద్మంబుల చప్పుడు నాలకింపుచును. మీకై నే నేవేళనైనను హృదయంపు వాకిళ్ళు గాచుచుండెద" అంటూ శ్రీవారి రాకకోసం ఎదురు తెన్నులు చూచాడు.

పెద తిరుమలాచార్యుని శ్రీ వేంకటేశ్వర వచనాలు నాస్తికుల్ని ఆస్తికులుగా మారుస్తాయి. శ్రీ వేంకటేశ్వర భక్తుల భక్తిని బలపరుస్తాయి. వారిని భక్తిసాధనలో నిలబెడతాయి. శరణాగతి తత్త్వానికి అవి విపుల వ్యాఖ్యలు. మనల్ని ప్రపత్తినిష్ఠలోనికి సులభంగా ప్రవేశింపజేస్తాయి.

శ్రీనివాసుని సర్వాంతర్యామిత్వం ప్రకటిస్తూ పెద్ద తిరుమలా చార్యుడు శ్రీ వేంకటేశ్వర వచనాలలో చెప్పిన మాటలు, చూపిన ఉదహారణలు మనం మననం చేసికొనవలసినవి. మనస్సులో గాఢంగా నిలుపుకోవలసినవీను.

"తిలలోని తైలంబు విధంబున, కాష్ఠంబులోని యనలంబు చందంబున, పుష్పంబులోని పరిమళంబుపోలిక, బీజంబులలోని వృక్షం బులకైవడి నీరీతి జగంబులోన నీవుగా, నీలోన జగంబులును, బాహ్యాం తరంబుల నీవు పరిపూర్ణుడవై యున్నావు" (వచనము - 138)

"నీలమేఘశ్యామలా! అణువులకు అణువవు. మహాత్ములకు మహా నీయుండవు. ప్రకృతిపురుషులకుం పరమాత్మవు. మూడుమూర్తులకు మూలమవు. విచారించిన నిర్గుణుండవు. నిసంగడంగిన కల్యాణగుణుం డవు. కన్నులంగానంచిన సాకారమవు. స్వరూపవ్యాప్తివి నిరవయ్యుం డవు. భక్తిపలలకు ప్రసన్నుండవు" (వచనము – 15)

భక్తసులభుడైన శ్రీ వేంకటేశ్వరుని ప్రసన్నుని కావించుకొనే ఉపాయాలు భక్తులకు ఎలా పెదతిరుమలాచార్యుడు అందిస్తున్నాడో తెలిసికోవాలి. వానిని భక్తులు అనుసరించాలి. తరించాలి. పరి శీలించండి.

"భక్తసులభుండవని వేదములలో నిన్నుం జెప్పంగాం జెవులు చల్లంగావినుట యొకటి, కన్నులపండువుగా నీమూర్తులు దర్శించుట యొకటి, నీరూపంబులు మనంబున తలపోయుటొకటి, కరంబుల నీకు మ్రొక్కుటొకటి, నీ నామంబులు జపించుటొకటి – ఇంతియకాని వేఱొక్క యుపాయంబు మాకిలేదు" (వచనము–117)

"ఆదిమూర్తీ! నేను భూలోకంబున నా కర్మంబు లనుభవింపం బుట్టితినిగాని నిన్ను గుఱుతెఱిగి కొలిచెదనని పుట్టినవాడనుగాను. ఇం తలో నిర్హేతుకలీలం గరుణించి, నన్ను బంటుగా నేలితివి."

(వచనము 46)

" .... శేషత్వ పారతంత్ర్యముల మఱుగున నిల్చి మిమ్ము సేవించు మీ దాసాను దాసుండ నని మొఱవుచూ శ్రీ వేంక టేశ్వరా!" (వచనము 53)

ఇవి పెదతిరుమలాచార్యుని 'శ్రీ వేంకటేశ్వర వచనాలు' మాత్రమేకావు. భక్తులు, ముఖ్యంగా శ్రీ వేంకటేశ్వరభక్తులు విధిగా పాటించవలసిన పరమప్రయోజనకరాలైన ప్రవచనాలు అవి. ఇంకొక

30

విశేషం. ఈవచనాలు వైరాగ్యవచనమాలికా గీతాలుమాత్రమే కావు రాగతాళబద్ధంగా సాగిన నూతనప్రక్రియలోని వచనగేయాలు కూడ. దానికి ఈక్రిందిది ఒక ఉదాహరణం.

రామక్రియరాగం – రూపకతాళం

"క్షీరాబ్ధిశయనా కమలంబు సూర్యుని కెదురుచూచినట్లు నా హృదయపద్మంబు రవిమండలవర్తివైన నీకెదురుచూచుచున్నది. కుముదంబులు చంద్రదర్శనం బపేక్షించినట్లు నాకన్నుంగలువలు భవదీయముఖ చంద్రదర్శనం బపేక్షించుచునవి"...

శ్రీవేంకటేశ్వరసంకీర్తనలు

తండ్రికి ఇచ్చినమాట నిలబెట్టుకోవడానికైతే, తండ్రివలె నిత్యం శ్రీనివాసునిపై సంకీర్తనచేసిన పుణ్యచరిత్రుడు పెదతిరుమలాచార్యుడు ఇతడు వేలకొలది శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు శ్రీవేంకటేశ్వర స్వామిపై సంతరించి స్వామివారి కోటిసంకీర్తనాచార్యుడై ధన్యుడయ్యాడు. సగంజీవితం తండ్రిచాటునగడిపాడు. తండ్రి అనుభవం ఆకళింపు జేసికొన్నాడు. తనసాహిత్యం, సంగీతం, పాండిత్యం, శ్రీవేంకటేశ్వరభక్తిలో పండించుకొని వానిని శ్రీవేంకటేశ్వరాంకితం జేసి చీకు, చింతలేకుండా జీవితం తృప్తిగా వెళ్ళబుచ్చాడు. "నీవు గుణసార్వభౌముడవు సుగుణభూషణుడవు. నాలో అవగుణాలను తలంచవద్దు" అని అతడు స్వామి నర్థించుకొన్నాడు.

"నాగుణాలు తలంచక నీగుణాలె తలంచుకో
ఏగతిని మానరాదు యింకనైనను"

శ్రీవేంకటేశ్వరశరణాగతి పదవులకంటే ఉత్తమమైన పరమపదాన్ని ప్రసాదిస్తుంది, రక్షిస్తుంది అని ప్రకటిస్తున్నాడు ఈక్రింది సంకీర్తనలో–

"హరిదాస్యమునకు నవియేమి సరిగావు
అరయశుకుండు నిన్నునంటి నీయంతామెను

... ... ... ...

అదియుగాన నేయుపాయములు నేనొల్లక
కదిసి నీశరణనే గలిగంటిని
యెదుట శ్రీవేంకటేశ యిట్టినా పెసజూచి
సదయుండవై మమ్ము చక్కఁగ నేలితివి..."

దేహసంబంధమైన బాంధవ్యాలు మమతలను పెంచుతాయి. మాయలలో ముంచుతాయి. ఆత్మసంబంధాలు, శ్రీవేంకటేశ్వర భక్తి బంధాలు మమతల్ని, మాయల్ని తొలగిస్తాయని అతడు ఒకసంకీర్తనలో వివరిస్తున్నాడు.

"ఇద్దరి దేహసంబంధ మిదిగో మాయ
గద్దించి యేడనుండునో కడసారితాను
తోడబుట్టిన మమత తొడగి కొన్నాళ్ళకు
వాడికపుత్రులమీదవలె నుండదు
వేడుక వారెవ్వరో వీరెవ్వరోకాని
కూడువెట్టి వీరికి కొట్లాడేవారికే
తల్లిమీదగల భక్తి తనకే కొన్నాళ్ళకు
ఇల్లాలిమీదవలె యింతవుండదు"

ఈ మమతలవల్ల అశాంతి పెరుగుతుంది. మనస్సులో శాంతి ఎలానెలకొంటుందో కూడ ఒక సంకీర్తనలో చెప్పాడు.

"ఇవియె తొల్లిటివారు యెంచి నడచినది శాంతి
వివరించి కొలిచితే విష్ణుడే శాంతి
వూరికే నిశ్చింతమున నుండగలదే శాంతి
కోరకుండే సాత్వికగుణమే శాంతి
భారము శ్రీవేంకటేశుపై బెట్టుటే శాంతి
ధీరతతోడుత గుణాతీతుండౌట శాంతి"

పెదతిరుమలయ్య శాంతిని ఎలా పొందాలో చెప్పాడు. శాంతి పొందితే సౌఖ్యం అదే వస్తుంది. త్యాగయ్య 'శాంతములేక సౌఖ్యము' లేదన్నాడు.

శ్రీహరి చరణాలను శరణువేడి హరిదాసుగా గుర్తింపు పొందడమే మానవుడు సాధించేది అంటున్నాడు పెదతిరుమలయ్య ఈ క్రింది సంకీర్తనలో—

"అప్పుడే కృతార్థుండు అప్పుడే లోకపూజ్యుండు
తప్పులేదు ముప్పులేదు దైవమే గురుతు
ఎవ్వడు పుణ్యుండు కాడు ఎవ్వడు పాతకి కాడు
ఇవ్వల తొంటి జన్మములెంచి చూచితే
నెవ్వగని జీవునికి నేరుపేది నేరమేది
అవ్వల శ్రీహరిశరణ మన్నదే గురుతు
పుట్టుగకులములే విభజించని వస్తువేది
ఇట్టి యీజీవులనెల్ల యెంచిచూచితే
గుట్టు తెలిసితి మిందు కొంచెమేది దొడ్డయేది
అట్టు నిట్టు హరిదాసుడైనదే గురుతు"

ఒక సంకీర్తనలో శ్రీవేంకటేశ్వరదాసుల సహవాసం ఎంతో గాఢంగా కోరుకొన్నాడు.

"ఇచ్చితివి తొల్లె నాకు యియ్యంగల వన్నియును
మచ్చిక నీ శరణన్నమాత్రమే చాలు
సామీప్యము నడుగ, సారూప్యము నడుగ
కామించి సాయుజ్య సాలోక్యము లడుగ
భూమిం గాని, పాతాళంబునగాని, దివింగాని
నమ్మాన నీ దాసులలో సహవాస మియ్యవే"

పెదతిరుమలాచార్యుడు తండ్రివలె రాజాశ్రయ విముఖుడు. తన రాజాశ్రయవ్యతిరేకతను కొన్నిసంకీర్తనలలో వివరించుకొన్నాడు.

"తామెంత దెలియరు తగం జెప్పిన వినరు
పామరపుం దమకర్మఫలమో హరిమాయయో
ధర గొందరుమూర్ఖులు తగనొక్క రాజు గొల్చి
పరిచారకని దిట్ట భంగపడ్డట్లు
ఇరువుగ శ్రీవేంకటేశుం గొల్చువారి వారు
విరసాలాడుచుం దామే విఫలులై పోవుదురు"

"శ్రీవేంకటేశ్వరుని జేరం జూపెం గురుండు
దావతి యితరులం దడవేలా"

పెదతిరుమలాచార్యులు శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్య, శ్రీరామానుజసిద్ధాంత స్థాపనాచార్య, వేదాంతాచార్య, కవితార్కిక కేసరి, శరణాగతవజ్రపంజర ఆదిగాగల బిరుదుపొంది దేశంలో శ్రీవేంకటేశ్వరభక్తిని, భాగవతధర్మాన్ని బహుళ ప్రచారం కావించాడు.

### 'అష్టభాషాకవిచక్రవర్తి' చినతిరుమలాచారి

పెదతిరుమలాచార్యునకు ఐదుగురుపుత్రులు. పెద్దకుమారుడు చినతిరుమలాచార్యుడు. పంచపాండవులకు శ్రీకృష్ణుడు సహాయపడినట్లు ఈ ఐదుగురు అన్నదమ్ములకు శ్రీవేంకటేశ్వరుడు సదా తోడ్పడేవాడట. వీరికి "విచిత్రముక్తాతపత్రరత్నకిరీట ముద్రికాప్రచండ మణిమండిత మకరకుండలోత్క రాహాః కరదీపికా పాదుకాది కానుకలను" శ్రీనివాసుడు అనుగ్రహించాడట.

వీరిలో పెద్దవాడైన చినతిరుమలాచార్యుడు సంస్కృతాంధ్రాలలో మహాకవి. "అష్టభాషాకవిచక్రవర్తి" శ్రీవేంకటేశ్వరునకు తృతీయసంకీర్తనాచార్యుడు. తండ్రితాతవలె శ్రీవారిపై శృంగార

అధ్యాత్మసంకీర్తనలు సంతరించాడు. శ్రీ వేంకటేశ్వరునిపై అష్టభాషా దండకం రచించాడు. అన్నమాచార్యుడు సంకీర్తనాపరిశుద్ధికై 'సంకీర్తన లక్షణము' అనే సంగీతలక్షణగ్రంథాన్ని సంస్కృతంలో రచించాడు. తండ్రి పెద తిరుమలాచార్యుడు దానికి సంస్కృతవ్యాఖ్య సంతరించాడు. ఆ మూలగ్రంథాన్ని, వ్యాఖ్యను చిన తిరుమలాచార్యుడు సరళమైన తెనుగులోనికి అనువదించి అందించాడు. పెద, చిన తిరుమలాచార్యాదులు అన్నమయ్యగ్రంథంలోని లక్షణ లక్ష్య సమన్వయం తెలపడానికి 4అ. వెడల్పు 7అ. ఎత్తుగల శిలాఫలకాలపై సంకీర్తనల సాహిత్యం సర్వసహితంగా చెక్కించారు. వానిని సంపెంగ ప్రదక్షిణంలో నిలిపారు. వానిని భక్తుల, సంగీతప్రియుల, పండితుల ఉపయోగార్థం ఆ విధంగా యేర్పాటు చేసారు.

వివిధప్రాంతాలనుండి వివిధభాషలు మాట్లాడేజనులు శ్రీనివాసుని దర్శనానికి 15వ శతాబ్దంనుండి వచ్చేవారని తెలుస్తోంది. వివిధ భాషలవారికి శ్రీవారివైభవం తెలియడానికై వివిధభాషలలో చిన తిరుమలాచార్యుడు దండకం రచించాడు. సంస్కృతం, ప్రాకృతం, శౌరసేనీ, మాగధీ, పైశాచీ, ప్రాచీ, అవంతీ, సార్వదేశీ అనే ఎనిమిది భాషలలో శ్రీ వేంకటేశ్వరునిపై దండకం రచించి శ్రీవారికి అంకితం కావించాడు. దేశం నాలుగుదిక్కులలోని, నాలుగుమూలలలోనివారి కోసం ఈ అష్టభాషాదండకం రచించాడు.

"శ్రీ వేంకటాద్రీశ జీమూతనీలాంజనగ్రావ బృంద ప్రభాభాసమానాంగశృంగార శృంగార రూపోల్లసత్కోటి కందర్పలావణ్యవారాన్నిధే, మన్నిధే, సన్నుతాశేష శేషాదిభాషావిశేషార్థగంభీర జంభారిశంభు స్వయంభూముఖామర్త్యజూట ప్రభాసేవ్యదివ్యాపగా భవ్యపాదాబ్జ" ఆ దండకం ఈ విధంగా సంస్కృతంలోను, తరువాత ఆరురకాలైన ప్రాకృతాలలోను,పిమ్మట సార్వదేశీయాలలోను నడిపిం

చాడు. ఇది సాదండ హిత్యంలో శాళివాసుశ్యాపహలాదండకం తరువాత స్థానం అలంకరిస్తోంది.

## చిన్నన్న

పెద తిరుమలాచార్యుని రెండవ కుమారుడు అన్నడు. మూడవ వాడు పెద తిరువెంగళనాథుడు. నాల్గవకుమారుడు చిన్నన్న. ఆఖరి వాడు కోనేటి తిరువెంగళనాథుడు. అన్నయ 'అన్నివిద్యలయందు నరయమున్నింటి యన్నయార్యుని పోలువాడట.' పెద తిరువెంగళనాథుడు గొప్ప సాహితీపరుడు, సంగీత విద్వాంసుడు. పరమసత్వగుణ సంపన్నుడు. ఇతని మేనత్తకుమారుడైన రేవణూరి వేంకటాచార్యుడు తన శకుంతలాపరిణయంలో "విశేషించియు నత్తిరు వెంగళనాథుడు సంకీర్తనంబులుపాడిన" శ్రీ వేంకటేశ్వరుడు "నాడం నోడంగ" అంటూ తిరువెంగళనాథుని శ్రీ వేంకటేశ్వరభక్తిని, సంకీర్తనామాధుర్యాన్ని వర్ణించాడు. తనసంకీర్తనంతో స్వామి వేంకటేశ్వర సాక్షాత్కారం పొందిన పరమభక్తుడితడు.

పెద తిరుమలాచార్యుని తనయులలో పెద్దకుమారుడైన చిన తిరుమలాచార్యులు, నాల్గవకుమారుడైన చిన్నన్న సుప్రసిద్ధులు. చిన్నన్న ద్విపదరచనలో సిద్ధహస్తుడు. 'దినములోనవె వేయి ద్విపదలింపొంద వినుతవర్ణనలతో విరచించు' విద్వాంసుడితడు. 'కస్తురి వీణె గోసినకరణి, తెలిగప్పూరపు క్రోవిదెఱచిన సరణి, విరవాది పొట్లంబు విడిచినమాడ్కి పరిమళించుచు కవుల్ బళిబళీ యనగ' కవితలు చెప్పిన ఘనుడితడు. 'జలజాతవాసిని చనుబాలపుష్టిచే' కవితలు అల్లడం ప్రారంభించాడు. 'సకలవైష్ణవ పాదసంసేవనాబ్జ సదనావధూలబ్ధ సరస కవిత్వ విదితమానసుడు ఈ చిన తిరువెంగళనాథుడు (చిన్నన్న). 'రత్నతొంభదనుపమ శ్రీ వేంకటాద్రీశ దత్తమకరకుండల రత్నమండిత కర్ణుడు' 'శ్రీ వేంకటేశ్వర పాదపద్మ వాసనాలోలుపస్వాంత షట్ప

డుడు' చిన్నన్న కవివర్యుడు. 'అన్నమాచార్య చరిత్రము', 'అష్టమహిషీ కల్యాణము', 'పరమయోగివిలాసము', 'ఉషాపరిణయము' ఇతని రచనలు. శ్రీకృష్ణునికి ఎనమండుగురు భార్యలు కలిగిన కథలు వివరించే 5 ఆశ్వాసాల రచన ఇతని అష్టమహిషీ కల్యాణం. ప్రసిద్ధ ఆళ్వారుల, వైష్ణవ యతుల, ప్రవర్తకుల చరిత్రలు అందిస్తుంది ఇతని 'పరమయోగివిలాసం'. హరివంశంలోని ఉషానిరుద్ధుల కల్యాణగాథే ఇతని 'ఉషాపరిణయం' ఇతని 'అన్నమాచార్య చరిత్ర' అన్నమయ్య జీవితంపై ఒక శ్వేత పత్రం.

"వాణీశనుతకును వ్రతకక్షీవిచల - దేణికి శ్రీ వేంకటేశు రాణికిని
సారసగేహకున్ జారుబాహకును - సార లావణ్యకు సకలగణ్యకును
పరమకళ్యాణికి భ్రమరవేణికిని - దరుణేందుఫాలకు దారశీలకును
రామాభిరామ కప్రతిమధామకును - హైమ సంవ్యానకు హంసయానకును
నింద్రభావితకు గజేంద్రసేవితకు - జంద్రికాహాసకున్ జారునాసకును
నగసుతానతకు పన్నగతల్పయుతకు శృంగమదాంబకు నలమేలుమంగకును
నంకితంబుగను" .... .... ... .... .... అని చిన్నన్న శ్రీ వేంకటేశుని పట్టపురాణికి ప్రణతులర్పిస్తూ 'అష్టమహిషీ కల్యాణం' అంకితం కావించాడు. 'ఉషాపరిణయం' కూడ అమ్మ అలమేలుమంగమ్మకే అంకితం కావించాడు. శ్రీ వేంకటేశ్వరుడు చిన్నన్నకు స్వప్నగతుడై 'పరమయోగవిలాసం' రచించి అలమేలుమంగకు తనకు అంకితం చేయమని ఆదేశించాడు. చిన్నన్న దాన్ని గొప్పవరంగా భావించి 'పరమయోగి విలాసం' రచించి అలమేలుమంగకు, శ్రీ వేంకటేశ్వరునకు అంకితం కావించాడు. 'అన్నమాచార్య చరిత్రము' కూడ 'అలమేలుమంగాధీశునకు' అంకితం కావించాడు. ఈ ద్విపదరచనలలో చిన్నన్న తన సహజమైన శ్రీ వేంకటేశ్వరభక్తిని చాటుకుంటూ, భక్తిభావనకు,

భక్తివిజయాలను సాహితీపరంగా పట్టాభిషేకం చేశాడు. నూలుసేయు సాలివారికి ఆచార్యపురుషుడై, వారి వంశమర్యాదలను రక్షకుడై వర్ధిల్లాడు. వారు భక్తితో చిన్నన్నకు పదివేల వరహాలు పాదపూజలు చేసి అర్పించారు. చిన్నన్న తమ్ముడు కోనేటి తిరువెంగళనాథుడు. సదాశివరాయలు ఇతనికి అనేకగ్రామాలు అర్పించి సత్కరించాడు. ఇతడు గొప్ప వైష్ణవప్రవక్తగా, హిందూధర్మప్రతిష్ఠాపనాచార్యుడుగా సుప్రసిద్ధుడయ్యాడు. ఇతడు యోగసిద్ధుడు. తండ్రి, తాతలవలె వీరు భక్తిప్రపత్తులను, శ్రీ వేంకటేశ్వర శరణాగతిని దేశంలో విశేషంగా ప్రచారం కావించి ప్రజల్ని భక్తిమార్గంలో, ముఖ్యంగా శ్రీ వేంకటేశ్వర భక్తిపథంలో నడిపించి పురోగమింపజేశారు.

పౌత్రుడు - దౌహిత్రుడు

"శ్రీ వేంకటేశేన సరోజజాతాసేయం సరోజాలయ లాలనీయా"

అని తిరువెంగళప్ప 'నామలింగానుశాసన'మునకు తెలుగువ్యాఖ్య అందించాడు. అమరుకకావ్యం ఆంధ్రీకరించి దానికి చిన్నవ్యాఖ్యానం రూపొందించాడు. 'కావ్యప్రకాశిక' అనే ఆలంకారిక గ్రంథానికి సంస్కృతవ్యాఖ్య రచించాడు. ఇతడు అన్నమయ్య మునిమనుమడు. చిన్నతిరుమలయ్య కుమారుడు. అన్నమయ్య దౌహిత్రుడు రేవణూరి వేంకటాచార్యుడు. పెదతిరుమలాచార్యుని మేనల్లుడు. తిరుమలాంబ కొండయార్యుల పుత్రుడు. 'శ్రీపాదరేణు మాహాత్మ్యం', 'శకుంతలా పరిణయం' రేవణూరి వేంకటాచార్యుని కృతులు. రెండుకావ్యాలూ శ్రీవారికి అంకితం కావింపబడ్డాయి.

తాళ్ళపాకవారి కవితాస్వరూపం

"తాళ్ళపాక కవులు పదిమంది. ఆ కుటుంబానికి చెందిన పదిమంది కవులు పదివేలజిహ్వాలతో తిరుపతిక్షేత్ర వైభవాన్ని, తిరుమ

లేశ్వరుని వైభవాన్ని పాడి, ఆడి, లోకానికి చాటిచెప్పారు. విజయ నగరరాజులు వేంకటాచలక్షేత్రమునకు చేసినసేవ యంతయు నొక యెత్తు; తాళ్ళపాకవారు చేసినదొక యెత్తు. ఎవ్వరు ఏ క్షేత్రమునకు చేయనిసేవ తాళ్ళపాకవారు తిరుపతికి - తిరుపతి వేంకటేశ్వరునకు చేసినారు. వారిపుత్రులు, పౌత్రులు, ఆడువారు, దౌహిత్రులు అందరుకలసి ఒక్క-సంస్థగాపూర్తి స్వామిసేవలో తరించారు" అన్న డాక్టరు వేటూరి ఆనందమూర్తిగారిమాటలు పరమసత్యాలు. వీరందరుకలసి సుమారు 42 కృతులు రచించారు. వానిలో అత్యధికసంఖ్యాకములైన రచనలు స్వామివారి వైభవానికి అద్దం పడుతున్నాయి. వారుచేసిన అన్నిరచనలు శ్రీవారికే అంకితమయ్యాయి. గతంలో ప్రస్తుతాన్ని చైతన్యవంతం చేసి భావికి అందించిన మహాభావులు వారు.

"తాళ్ళపాకవారి సాహితీమందిరమునకు మతము పునాది. సంస్కృతాంధ్రములు కట్టడపుశిలలు. సంకీర్తనాది సాహితీప్రక్రియలు సోపానములు. అందలి ఆరాధ్యదైవము శ్రీ వేంకటేశ్వరస్వామి. ధర్మార్థకామమోక్షములు నాలుగు ప్రాకారములు. మధురకవితలు ద్వారవాకిళ్ళు. సార్వజనీనము, సార్వకాలికమునగు నుత్తమభావసంపద తన్మందిర శ్రీ భాండారము. ఆ కవులే యర్చకులు. భక్తియే భగవత్ప్రసాదము. గానమే స్వామికంగరంగ భోగములు. రసికవర్యులే యాత్రికులు. ఇదియే వారి కవితాస్వరూపము"

'తాళ్ళపాక కవుల కృతులు - వివిధసాహితీప్రక్రియలు" అనే డాక్టరు వేటూరి ఆనందమూర్తిగారి రచనలోని ఈ వాక్యాలలో తాళ్ళపాక కవుల కవితాస్వరూపం సువ్యక్తమైంది.

### ధార్మికకార్యకలాపాలు - సంకీర్తనభాండారం

తాళ్ళపాకవారు శ్రీనివాసుని తమకవితాభరణాలతో అలంకరించారు. సంకీర్తనకుసుమాలతో శ్రీపాదాలకు పూజలు కావించారు.

భక్తితో ఎన్నో ధార్మిక సేవలు అందించారు. వారు చెక్కించిన సుమారు 25 శాసనాలవలన వారు 23 గ్రామాలు శ్రీవారికి సమర్పించి నట్లు తెలుస్తోంది. పెద తిరుమలాచార్యులు 13 గ్రామాలు, 2,000 వరహాలు, 12, 153 పణాలు, 3,320 అర్పణాలు సమర్పించి శ్రీవారి సేవలు కావించాడు. ధార్మిక కార్యకలాపాలు నిర్వహించాడు. వీనిని నివేదనలకు, ఉత్సవాలకు, దీపారాధనలకు, తిరుమంజనానికి వినియోగింపజేసాడు. స్వామిపుష్కరిణి జీర్ణోద్ధారణం చేయించాడు. వరాహ స్వామికి ప్రాకారం కట్టించాడు. శ్రీ భాండారం (సంకీర్తనభాండారం) నిర్మింపజేసాడు. వనభోజనమహోత్సవం యేర్పాటు చేయించాడు. అన్నివర్ణాలవారు సహపంక్తిలో భోజనంచేసే సంప్రదాయం అది. దాన్ని నెలకొల్పిన సంఘసంస్కర్త పెద తిరుమలాచార్యుడు. చిన తిరుమలాచార్యులు గోవిందరాజస్వామి పెండ్లి తిరునాళ్ళు యేర్పాటు చేయించాడు. మంగాపురం కల్యాణ వేంకటేశ్వరస్వామి దేవాలయ జీర్ణోద్ధరణ చేయించాడు. దానిలో అన్నమయ్య విగ్రహప్రతిష్ఠ చేయించాడు. తిరువెంగళయ్య శ్రీనివాసునకు వైవాహికమహోత్సవం ప్రతిసంవత్సరం జరగడానికి గ్రామదానాలు చేసాడు. శ్రీవారికిజరిగే అన్ని ఉత్సవాలు అతివైభవంగా జరగడానికి తాళ్ళపాకవారు కారకు లయ్యారు.

సంకీర్తన భాండాగారం రూపురేఖలుదిద్దినవాడు పెద తిరుమలాచార్యుడు. తండ్రి అన్నమయ్య 32 వేల సంకీర్తనలను రాగిరేకులపై చెక్కించి దానిలో యేర్పాటుచేయించాడు. తాళ్ళపాక కవులు ధనాన్ని, జనాన్ని, లేఖకుల్ని వినియోగించి సంకీర్తన భాండాగారపు వ్యవస్థను సుసంపన్నం చేసారు. పెదతిరుమలాచార్యుని, చినతిరుమలాచార్యుని సంకీర్తనలు కూడ రాగిరేకులకు ఎక్కి సంకీర్తన భాండారం అలంకరించాయి. దీప, ధూప, నైవేద్యాలు, చ దన తాంబులాదు లు

సంకీర్తనలతో కూడిన నిత్యోత్సవం సంకీర్తన భాండారంవద్ద నిర్వహించ డానికి యేర్పాట్లు జరిగాయి, దీన్నే 'సంకీర్తన అరుళప్పాడు' అంటారు. క్రీ. శ. 15-16 శతాబ్దాలలో ఈ తాళ్ళపాకవారు 200 సంవత్సరాలు తిరుమలనే కలియుగ వైకుంఠమని భావించుకొని స్వామిపై సంకీర్తనలు చేస్తూ స్వామికి తమ సర్వస్వం అర్పించుకొన్నారు. భావితరాల వీరికి తమ శృంగార ఆధ్యాత్మ సంకీర్తనల భాండారం నెలకొల్పారు. వారు తరించారు. మనం తరించడంకోసం వారి సంకీర్తనల సంపదను, శ్రీ వేంకటేశ్వర భక్త్యైశ్వర్యాన్ని సంకీర్తన భాండారంలో నిలిపారు. చిదంబరంలో కనకరాజును, వరదరాజును చూచినట్లుగానే బంగారు వాకిట నిలచిన మనం ముందుగా స్వామివారిని, కుడిప్రక్కన అన్నమాచార్య, తిరుమలాచార్యులను సంకీర్తన భాండారంవద్ద చూస్తాము.

1922 వ సంవత్సరంలో సంకీర్తన భాండారంనుంచి సంకీర్తనలు గల రేగిరేకులను తరలించి తిరుమల తిరుపతి దేవస్థానాలవారు అన్నమయ్య సంకీర్తనల సంపుటాలు ప్రచురించడానికి పూనుకొన్నారు. అహోబలంలోను, శ్రీరంగంలోను కొన్ని రేకులు ఉన్నాయట. దొరికినవన్నీ దేవస్థానంవారు సేకరించారు. నేను 3,000 రాగిరేకులు లభించాయి. రేకుకు ఒకవైపున 3, రెండవవైపున 3 చొప్పున 6 సంకీర్తనలు ఉంటాయి. నేడు మనకు 18,000 సంకీర్తనలు లభించాయి. వానిలో అన్నమాచార్యునివి 10,000 సంకీర్తనలు. పెద తిరుమలాచార్యునివి 5,000 సంకీర్తనలు. మిగతా 3 వేల సంకీర్తనలు చిన్న తిరుమలాచార్యులవి కాగా ఇంకా 20 వేల అన్నమాచార్య సంకీర్తనలు లభించాలి. అవి ఎక్కడ ఏరూపంలో ఉన్నవో శ్రీనివాసునికే తెలియాలి. కీ. శే. సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వానికి నకళ్లు తీయించారు. పరిష్కరణ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు చేసారు. పరవస్తు వేంకటరామానుజస్వామి, పి. టి. జగన్నాథరావు, రాళ్ళపల్లి అనంత

కృష్ణశర్మ ప్రభృతులు వీని ప్రచురణకు సాహాయ్యం వహించారు. ప్రభాకర శాస్త్రిగారు 1949 లో అన్నమయ్య వర్ధంతి ఉత్సవాలు ప్రారంభించి అన్నమయ్యచరిత్రను, సంకీర్తనల మాధుర్యాన్ని లోకానికి వెల్లడించారు.

అన్నమాచార్య ప్రాజెక్టు

తాళ్ళపాక కవుల సంకీర్తన భాండాగారపు వ్యవస్థకు నూతన రూపకల్పనగా తి. తి. దేవస్థానాల యాజమాన్యం 1978 డిశంబరులో అన్నమాచార్య ప్రాజెక్టు ప్రారంభించారు. శ్రీనివాసుని తత్త్వనవనీతం, మహిమ అన్నమాచార్యుని సంకీర్తనలద్వారా దేశం నలుమూలలా వ్యాపింపజేయడం దీని ప్రాథమికలక్ష్యం. దానికి అనుబంధంగా ప్రచార, పరిశోధనవిభాగాలు నెలకొన్నాయి. ఆ రెండు విభాగాలు అవిరళమైన కృషి సాగిస్తున్నాయి. నేటికి 30 సంపుటాలలో అన్నమాచార్యసంకీర్తనలు వెలువడ్డాయి. సుమారు అన్ని సంపుటాల పరిష్కరణ జరిగి అచ్చుకావలసి ఉంది. స్వరపరచినవి సుమారు 8 సంపుటాలు వెలువడ్డాయి. అన్నమాచార్య సంకీర్తనల గాయకసంప్రదాయపరిరక్షణకై అన్నమాచార్య సంకీర్తనల గురుకులం పనిచేస్తోంది. యువకళాకారులకు శిక్షణ ఇచ్చి అన్నమాచార్య సంకీర్తన బృందాలుగా ప్రచారం సాగించడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. అన్నమాచార్యుని జన్మస్థలమైన తాళ్ళపాకగ్రామాన్ని తి. తి. దేవస్థానం దత్తత తీసికొని దాని సర్వతోముఖ వికాసానికి బాటలు వేస్తోంది. వెలుగుబాటలో తాళ్ళపాక పయనిస్తుంది. తాళ్ళపాక వారి సంకీర్తనలు గ్రంథ సంపుటాలలో కనపడి, మనకు వినపడుతుంటాయి. సంకీర్తనల భాండారంనుండి స్వామి సదా అన్నమయ్య సంకీర్తనలు, తాళ్ళపాక వాగ్గేయకారుల సంకీర్తనలు ఆలకిస్తూంటాడు. "ఇతర మెరుగ గతి యిదియె శరణ్యము- సతత పూర్ణునకు శరణ్యము" అని అన్నమయ్య శరణాగతిగీతం తిరుమలయ్య

హృదయంలో నిత్యం ప్రతిధ్వనిస్తూంటుంది. తిరుమలేశ్వరుని దర్శించ డానికి వచ్చి హుండీలో కానుకలు వేసేవారికి తండ్రి, కుమారులైన అన్నమయ్య, పెద తిరుమలయ్యలు విగ్రహరూపాలుతో సంకీర్తన భాండారాని కిరువైపులా నిలచి శ్రీ వేంకటేశ్వరశరణాగతి సందేశం అందిస్తూంటారు.

తిరుమలవలె తాళ్ళపాకనుకూడ యాత్రాస్థలంగా, దర్శనీయ స్థలంగా రూపొందించాలనే, దానికి క్షేత్రరూపు రేఖలు సంతరించా లనే సంకల్పంతో దేవస్థానంవారు 3 లక్షలరూపాయలఖర్చుతో తాళ్ళ పాక దేవాలయాల పునరుద్ధరణ కార్యక్రమం చేపట్టింది. అన్నమా చార్యమందిరం, శ్రీ వేంకటేశ్వర ప్రాథమిక, ఉన్నతపాఠశాలల నిర్మా ణాలు అమలు జరుపుతోంది. అన్నమాచారిపుట్టిన ఆ తావులోని పంచ భూతాలను తనపాటలతో అతడు పవిత్రీకరించాడు. అందుకే దాని మీద, ఆ గ్రామం అభివృద్ధిమీద అంకరిదృష్టి కేంద్రీకరింపబడింది.

అన్నమాచార్య ప్రాజక్టుకూడ అనన్యసామాన్య కార్యక్రమా లను నిర్వహిస్తోంది. నేటికి 3 సంవత్సరాల వ్యవధిలో వెయ్యి కార్య క్రమాలు నిర్వహించింది. శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుశెట్టి పర్యవేక్ష ణలో ఆ ప్రాజక్టు కార్యక్రమాలు విజయవంతంగా సాగుతున్నాయి. 1921లో ప్రారంభమైన అన్నమాచార్య సంకీర్తనలప్రచారం 1982లో షష్టిపూర్తిఉత్సవం జరుపుకోవాలి. షష్టిపూర్తిఉత్సవసంవత్సరంలో ఆంధ్రదేశంలోని ఏపత్రికా చేయనికృషి 'ఆంధ్రప్రభ' వారపత్రిక చేసింది. దాని సంపాదకులు, సహృదయులు శ్రీ పొత్తూరి వేంకటేశ్వర రావుగారు అన్నమాచార్య జయంతి ప్రత్యేకసంచిక యదాదృచ్ఛికంగా ఆ సందర్భంలో వెలువరించడం ముదావహం.

అన్నమయ్య నిత్యవ్రతం శ్రీ వేంకటేశ్వర సంకీర్తనం
అన్నమయ్య ప్రచారం భాగవత ధర్మప్రచారం

అన్నమయ్య సందేశం శ్రీ వేంకటేశునకు ఆత్మార్పణం
ఇది కలియుగమానవులను తరణోపాయాలు.

ఈ తరణోపాయాలను ప్రసాదించడానికే ఆనాడు సంకీర్తన భాండారం యేర్పడింది. ఈనాడు అన్నమాచార్య ప్రాజెక్టు వెలసింది. అందరికి ఈవిలో ఇహాపరాలిచ్చేదాత శ్రీ వేంకటేశుని మనసు సన్నిహితం చేయడానికి కృషి చేస్తోంది.

"పాదేను నేము పరమాత్మ నిన్నును
వేడుక ముప్పదిరెండు వేళల రాగాలను
తను వేవోళవు తలయే దండెకాయు
ఘనమైన వూర్పులు రెండుకట్టిన ద్రాళ్ళు
మనసె నీబుద్ధితాడు మలిగుణాలె జీవాళి
మొనసినవుట్టుగె మూలమైన కరడి
పాపపుణ్యా లిరువంకపైడి వెండిమనసులు
పైపైఁ గుత్తికె మేటిపై చనిగె
కోవుల నాలి [illegible] లోనఁగుచ్చి కట్టినట్టితాడు
చూపరాని సంసారమె సూత్రపుగణికె
జీవునికి నీదండె సేసినవాడవు నీవు
వావాతిమాటలే నీపై వన్నెపనాలు
ఈవి మాకు నిహపరాలిచ్చితివి మెచ్చితివి
శ్రీ వేంకటేశ నీవే చేకొన్న దాతవు"

— అన్నమయ్య అధ్యాత్మసంకీర్తన

